భక్తిసాహితి 63వ పుష్పము

శుక్ల-మకర సంక్రాంతి

ప్రథమ ముద్రణము : 1990

ప్రతులు - 1500



ప్రతులు గ్రంథమాలలోను, ఇచట కూడ లభించును

జయలక్ష్మి పబ్లికేషన్స్

3-35, రామాలయం వీథి

కూకట్‌పల్లి, హైదరాబాదు-500 872

ఫోన్ : 26 32 98



మూల్యము : రు. 20-00

ముద్రణ :

ఆర్. కె. ప్రింటర్స్

11-2-1124, నాంపల్లి,

హైదరాబాదు-1.

# అంకితము

పశ్చిమ గోదావరి జిల్లా కాళ్ళమండలములోని

కాళ్ళకూరు

గ్రామములో వేంచేసియున్న

"శ్రీ బాలవేంకటేశ్వర"

స్వామివారికి

భక్తిపూర్వకముగ.

శ్రీమతే రామానుజాయ నమః

## ప్రమోదూత శుభాకాంక్షలు




శ్లో॥ ప్రమోదూతే శుభేకృత్వా
యుష్మత్ క్లేశ ప్రణాశనమ్।
పాతు వో దివ్యకృపయా
గోదా శ్రీరంగనాయకీ ॥

తే.గీ. ఈ ప్రమోదూత వర్షాన నింపుమీర
నాయురారోగ్య శుభముల నందజేసి
పుత్రపౌత్రాదిసంపద పొసగనిచ్చి
ప్రోచుగావుత మిము సదా భూమిపుత్రి।

క. వరవరముని లిఖియించెను
పరభగవద్గీత కెపుడొ వ్యాఖ్యను దానిన్
ధరముద్రణమును జేయగ
ఠర మనురాగమును జూపి కాంచుడు కీర్తిన్ ॥

తే.గీ. గ్రంథమాలను నడపుట కష్టసాధ్య
మనెడి సూక్తిని మీ రెద ననుభవించి
మాకు పుష్కలసహకార మందజేసి
భాగ్యవంతులుకండయ్య భక్తులార.

శ్రీ గోదాగ్రంథమాల

శ్రీః

శ్రీ లక్ష్మీనారాయణాభ్యాం నమః
శ్రీమత్యై గోదాదేవ్యై నమః శ్రీరంగనాథాయ నమః
శ్రీమతే రామానుజాయ నమః

శ్రీవేంకటాచలాధీశం శ్రియాధ్యాసిత వక్షసమ్,
శ్రితచేతనమందారం శ్రీనివాసమహం భజే. 1

శ్రీరామచంద్రః శ్రితపారిజాతః సమస్తకల్యాణగుణాభిరామః,
సీతాముఖాంభోరుహచంచరీకః నిరంతరం మంగళమాతనోతు. 2

కృష్ణో రక్షతు నో జగత్త్రయగురుః కృష్ణం నమస్యామ్యహం
కృష్ణేనామరశత్రవో వినిహతాః కృష్ణాయ తస్మై నమః,
కృష్ణాదేవ సముత్థితం జగదిదం కృష్ణస్య దాసోఽస్మ్యహం
కృష్ణేతిష్ఠతి సర్వమేతదఖిలం హేకృష్ణ ! రక్షస్వమామ్. 3

లక్ష్మీం క్షీరసముద్రరాజతనయాం శ్రీరంగధామేశ్వరీం
దాసీభూతసమస్తదేవవనితాం లోకైకదీపాంకురామ్,
శ్రీమన్మందకటాక్షలబ్ధవిభవబ్రహ్మేంద్రగంగాధరాం
త్వాం త్రైలోక్యకుటుంబినీం సరసిజాం వందే ముకుందప్రియామ్. 4

# మనవి

నీళాతుంగ స్తనగిరితటీసుప్తముద్బోధ్య కృష్ణం
పారార్థ్యం స్వం శ్రుతిశతశిరస్సిద్ధమధ్యాపయన్తీ,
స్వోచ్ఛిష్టాయాం స్రజి నిగళితం యా బలాత్కృత్య భుంక్తే
గోదా తస్యై నమ ఇదమిదం భూయ ఏవాస్తు భూయః ॥

—పరాశర భట్టాచార్యులు

ఈ గ్రంథమాలకు గోదాకటాక్ష మాధారము. భాగవతకటాక్ష మాధేయము, "మేము కేవలము నిమిత్తమాత్రులము" అని వేరొకచో చెప్పుకొన్నట్లే ఈ గోదాస్తవ ప్రచురణ ఇప్పుడు జరుగుచున్నది.

మా కవ్యాజలభ్యమైన ఈ అమృతఫలము శ్రీమదప్పుల దేశికేంద్ర విరచితము. ప్రతిపద్య రసోదయమైన ఈ కావ్యరత్నమందలి వ్యంగ్యార్థవైభవాదుల సౌరభమును తమ యపూర్వాభినవధీచాతుర్యాదుల నుపయోగించి తేట తెనుగులో విశదీకరించిన వ్యాఖ్యాత శ్రీమాన్ కందాళ వేంకట రామనరసింహాచార్యులవారు "జగమెరిగిన బ్రాహ్మణులు".

ఈ గ్రంథపరిష్కారమున విశిష్ట కృషి చేసి మించినవారు కవితార్కిక కేసరి ఉ॥వే॥ శ్రీమాన్ న.చ. రఘునాథాచార్యులవారు (వరంగల్లు).

ఇది ఇంత త్వరలో సూర్యాలోకభాగ్యమునకు నోచుకొనుటకు ప్రధాన కారణము శ్రీ తిరుమల తిరుపతి దేవస్థానాధికారులు. ప్రత్యేకముగా నిండు హృదయముతో వీరికి మా కృతజ్ఞతాభరమును విన్నవించుకొనుచున్నాము.

ఏతత్ వ్యాఖ్యారచనకై 4 సంవత్సరములు నిరంతర కృషిచేసి దీని ప్రచురణకుకూడ దీక్ష వహించి ఆ తల్లికటాక్షమును మాపై ప్రసరింప చేసిన వారీ వ్యాఖ్యాత. ఈ మధురసన్నివేశమున వీరిని స్మరించుకొనుట మా విధి.

ఇప్పటున "పుష్పమాలా ప్రసంగేన సూత్రం శిరసి ధార్యతే" అను అభి యుక్తోక్తి గుర్తుకువచ్చుట సహజము కదా!

ముద్రణాది సర్వభారములను తమ భుజస్కంధములపై నిడుకొని వీరిట్లు మన గ్రంథమాలను గౌరవించుట కరమానందకరము. గంగాఝరిని భువికి తెచ్చిన భగీరథు లీ యభినవభగీరథు లనుట చర్వితచర్వణము.

సామూహికముగా పై వారందరికి నా కృతజ్ఞతల నందించుచు, ఈ మహాఫలము నాస్వాదించవలసినదిగా ఆస్తిక మహాజనులకు విజ్ఞప్తి చేసికొను చున్నాము.

లోకే వనస్పతిబృహస్పతితారతమ్యం
యస్యాః కటాక్షపరిణామముదాహరన్తి,
సా భారతీ భగవతీ తు యదీయదాసీ
తాం దేవదేవమహిషీం శ్రియ మాశ్రయామః.

ఇట్లు విన్నవించు
శ్రీ చరణరేణువులు
ప్రకాశకులు.

మునునూరు
15-3-90

# ఈ రచనలో సహకరించిన సోదరులు

1. విద్యాప్రవీణ, భాషాప్రవీణ, చి. శ్రీమాన్
డా॥ కె వి. రామకృష్ణమాచార్యులు M.A. Ph.D.
రీడరు, K.S.V పీఠం, తిరుపతి.

2. విద్యాప్రవీణ, చి. శ్రీమాన్
కె. వి. ఆర్. తిరుమలాచార్యులు M.A.
I/C ప్రిన్సిపాల్, S.L.B.S.O.D. కాలేజి,
చినసింగ్రకొలను, ప. గో. జిల్లా.

3. విద్యాప్రవీణ, చి. శ్రీమాన్
కె. వి. ఆర్. లక్ష్మణాచార్యులు M.A.
గవర్నమెంట్ జూనియర్ కాలేజి (బాలురు)
కొవ్వూరు, ప. గో. జిల్లా.

# కృతజ్ఞతలు

ఈ గోదా స్తవ వ్యాఖ్య విషయమున

ప్రోత్సాహము - అభిప్రాయము

శ్రీమాన్ N.C. రామానుజాచార్య, M.A.

ఖమ్మం.

పరిష్కరించి అభిప్రాయము నిచ్చినవారు

కవిశాబ్దికకేసరి ఉ.వే. శ్రీమాన్

S.N.C. రఘునాథాచార్యస్వామివారు

వరంగల్లు.

సూచనలు - అభిప్రాయములు

1. శ్రీశ్రీశ్రీ త్రిదండి చిన్న శ్రీమన్నారాయణ రామానుజ
జీయర్ స్వామివారు
J. E. T. సీతానగరం.

2. ఉ॥వే॥ శ్రీమాన్ శ్రీ భాష్యం అప్పలాచార్యస్వామివారు
విశాఖపట్టణం.

3. ఉ॥వే॥ శ్రీమాన్ K.S. రామానుజాచార్యస్వామివారు
విద్యాప్రవీణ, భాషాప్రవీణ, M.A.
ప్రిన్సిపాల్ - వేద, సంస్కృత కళాశాల,
నెల్లూరు.

4. ఉ॥వే॥ శ్రీమాన్ (విద్యాప్రవీణ - భాషాప్రవీణ)
కిడాంబి వెంకటాచార్యస్వామివారు, M.A.
Head of the Dept. of Telugu, Y.N. కళాశాల

మరియు

డెప్యూటీ స్థానాచార్య,

శ్రీ ఆదికేశవ ఎంబెరుమానార్ దేవస్థానం

నరసాపురం.

5. (విద్యా ప్రవీణ - భాషా ప్రవీణ)

శ్రీ A.V. సీతారామమూర్తిగారు, M.A (Triple)

సీనియర్ లెక్చరర్, L.B.S.O. కాలేజి, చినసింద్రకొలను.

6. ఉ॥వే॥ శ్రీమాన్ K.T.L. నరసింహాచార్యులుగారు,

గోదాగ్రంథమాల - ముసునూరు.

మా కుటుంబ సభ్యులకు హార్దిక శుభాకాంక్షలు

1) చి.సౌ. పద్మావతి

2) చి.సౌ. సుధావల్లి B.Com.

Directorate of Rice Research, Rajendra Nagar, Hyderabad

3) చి. శ్రీమాన్ A. V. రాఘవస్వామి B.Com Steno' Director of Marketing and Inspection, Nampally Hyderabad.

4) చి.నరసింహం B.Tech (Mechanical) H.P.C.L. LPG gas filling Plant Malakapuram. Visakhapatnam.

5) చి. కృష్ణ B. E. (Mechanical) Steel Plant Visakhapatnam.

6) చి. రాధికా రాజ్యలక్ష్మి (X Class)

# సలహాలు - సహకారం

1. ఉ॥వే॥ శ్రీమాన్
   ఈయుణ్ణి రంగాచార్యస్వామివారు, అంతర్వేదిపాలెం.
2. ఉ॥వే॥ శ్రీమాన్ డా॥ T.K.V. అయ్యంగార్, M.A., Ph.D.
   Asst. Prof. of Maths,
   Regional Engineering College, Warangal.
3. ఉ వే॥ శ్రీమాన్ కిడాంబి గోపాలకృష్ణమాచార్యస్వామి వారు
   (భాషాప్రవీణ) అంతర్వేదిపాలెం.
4. ఉ॥వే॥ శ్రీమాన్ N.V.L.N. రామానుజాచార్యస్వామి వారు
   (భాషాప్రవీణ) పెంటపాడు, నరసాపురం.
5. విద్యాప్రవీణ, భాషాప్రవీణ, జాతీయ బహుమతి గ్రహీత,
   ఆదర్శోపాధ్యాయ, శ్రీమాన్ G.A.V.S అప్పలాచార్యస్వామి వారు
   ద్వారక తిరుమల.
6. ఉ॥వే॥ శ్రీమాన్ N. Ch. కృష్ణమాచార్యస్వామివారు,
   (రిటైర్డ్) A. I. R. విజయవాడ.
7. శ్రీమాన్ డా॥ S.B. రఘునాథాచార్యస్వామివారు, M.A., Ph.D.
   Prof. of Sanskrit, S.V. University, Tirupati.
8. ఉ॥వే॥ శ్రీమాన్ K.V. రాఘవాచార్యులుగారు, M.A.
   Retd. Telugu Lecturer, Hyderabad.
9. T. T. D. తిరుపతి.
10. అధ్యాపక మిత్రమండలి - చినచింద్రకోలను.
11. శ్రీ K.S.R. ఆంజనేయులుగారు
    T.T.D Oriental College, Hyderabad.
12. శ్రీ C. V. శేషాచార్యులుగారు
    T.T.D Oriental College, Hyderabad.
13. శ్రీ ములుకుట్ల రామకృష్ణశాస్త్రిగారు, హైదరాబాదు.

# శ్లోకత్రియమ్
## (ప్రాతః నిత్యానుసంధేయమ్)

శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజమ్,
ప్రసన్నవదనం ధ్యాయేత్ సర్వవిఘ్నోపశాంతయే

ప్రాతః స్మరామి భవభీతిమహార్తిశాంత్యై
నారాయణం గరుడవాహనమంబుజనాభమ్,
గ్రాహాభిభూతమదవారణముక్తిహేతుం
చక్రాయుధం తరుణవారిజపత్రనేత్రమ్. 1

ప్రాతర్నమామి మనసా వచసా చ మూర్ధ్నా
పాదారవిందయుగళం పరమస్య పుంసః,
నారాయణస్య నరకార్ణవతారణస్య
పారాయణప్రవణవిప్రపరాయణస్య. 2

ప్రాతర్భజామి భజతామభయంకరం తం
ప్రాక్సర్వజన్మకృతపాపభయాపహత్యై,
యో గ్రాహవక్త్రపతితాంఘ్రిగజేంద్రఘోర-
శోకప్రణాశనకరో ధృతశంఖచక్రః. 3

శ్లోకత్రయమిదం పుణ్యం
ప్రాతరుత్థాయ యః పఠేత్,
లోకత్రయగురుస్తస్మై
దద్యాదాత్మపదం హరిః.

# శ్రీసీతారామస్తోత్రం

అయోధ్యాపురనేతారం మిథిలాపురనాయికామ్,
రాఘవాణామలంకారం వైదేహానామలంక్రియాం. 1

రఘూణాం కులదీపం చ, నిమీనాం కులదీపికామ్,
సూర్యవంశసముద్భూతం సోమవంశసముద్భవామ్. 2

పుత్రం దశరథస్యాపి పుత్రీం జనకభూపతేః,
వసిష్ఠానుమతాచారం శతానన్దమతానుగామ్. 3

కౌసల్యాగర్భసంభూతం వేదిగర్భోదితాం స్వయమ్,
పుండరీకవిశాలాక్షం స్ఫురదిందీవరేక్షణామ్. 4

మత్తమాతంగగమనం మత్తహంసవధూగతామ్,
చందనార్ద్రభుజామధ్యం కుంకుమాక్తభుజాంతరామ్. 5

చాపాలంకృతహస్తాబ్జం పద్మాలంకృతపాణికామ్,
సర్వలోకవిధాతారం సర్వలోకవిధాయినీమ్. 6

లోకాభిరామం శ్రీరామం అభిరామాం చ మైథిలీమ్,
దివ్యసింహాసనాసీనం దివ్యస్రగ్వస్త్రభూషణామ్. 7

అనుక్షణం కటాక్షాభ్యాం అన్యోన్యేక్షణకాంక్షిణౌ,
అన్యోన్యసదృశావేతౌ త్రైలోక్యగృహదంపతీ. 8

ఇమౌ యువాం ప్రణమ్యాహం భజామ్యతికృతార్థతః,
అనయా స్తౌతి యః స్తుత్యా రామం సీతాం చ భక్తితః. 9

తస్య తౌ తనుతాం ప్రీతిం సంపదస్సకలా అపి,
ఇతీదం రామచంద్రస్య జానక్యాశ్చ విశేషతః. 10

కృతం హనుమతా పుణ్యం స్తోత్రం సద్యో విముక్తిదమ్,
యః పఠేత్ ప్రాతరుత్థాయ సర్వాన్ కామానవాప్నుయాత్. 11

య ఇదం పఠతి స్తోత్రం మైథిలీరామచంద్రయోః,
శ్రీవైకుంఠమవాప్నోతి స నరో హతకిల్బిషః. 12

# సువర్ణమాలినీ స్తోత్రమ్

(నెల్లూరు - వేదసంస్కృత కళాశాల ప్రిన్సిపాలుగారైన
డా॥వే॥ శ్రీమాన్ K.S. రామానుజాచార్యులవారిచే రచింపబడిన
అష్టలక్ష్మి స్తోత్రము)

శ్రీరస్తు

శ్రీలక్ష్మీనారాయణాభ్యాం నమః

లక్ష్మీనారాయణౌ దివ్యదంపతీ జగతాం పతీ,
శరణ్యౌ శరణం యామి సర్వాభీష్టఫలప్రదౌ.

కరయుగధృతపద్మాపద్మమాలాఽభిరామా
శ్రితజనసిధిరేషా సర్వలోకైకమాతా,
కమలనయనవక్షఃపీఠమాతస్థుషీ నః
ప్రదిశతు పురుషార్థాన్ ఆదిలక్ష్మీః అభీష్టాన్. 1

ధనపతిముఖదేవైః స్తూయమానా దయార్ద్రా
దినకరనిభవర్ణా బిల్వవృక్షాలయా శ్రీః,
ధృతనవనిధిహస్తా దేవతా మంగళానాం
వితరతు ధనలక్ష్మీః విత్తరాశీన్ సదా నః. 2

అభయవరదముద్రాధూతసద్భక్తశోకా
కరకమలవిరాజత్ శాలిమంజర్యుదారా,
ప్రతికలమిహ దత్తాం సర్వసస్యోపయాతాం
అతులితబహుధాన్యాం సంపదం ధాన్యలక్ష్మీః. 3

దరహసితమనోజ్ఞాన్ కర్దమానందముఖ్యాన్
కరధృతనిజహస్తాన్ లాలయన్తీ స్వపుత్రాన్,
వితరతు పరితుష్టాఽస్మాసు సంతానలక్ష్మీః
మహితసుగుణభవ్యాం సంతతిం సంతతేర్నః. 4

రుచిరకనకభూషాభూషితా స్వర్ణవర్ణా
శ్రితనయనచకోరానందదాస్యేందుబింబా,
కలశజలధికన్యా సేయం ఐశ్వర్యలక్ష్మీః
నిరవధికవిభూతీర్నః ప్రదద్యాదిహాఽష్టౌ. 5

జలజమధివసన్తీ మత్తవేదండశుండో
ద్ధృతజలకణికాభిః సిచ్యమానా సితాన్తమ్,
నతజనదురవస్థా ధ్వంసినీయం గజాన్తాం
ప్రదిశతు గజలక్ష్మీః సంపదం నస్సమృద్ధామ్. 6

గజవరమధిరూఢా శంఖచక్రాసిశార్ఙ్గా
ద్యమితసితశస్త్రాస్త్రోద్భటా శాత్రవేషు,
సుమధురదరహాసేనాశ్రితాన్ హర్షయన్తీ
రిపునివహనిరాసం వీరలక్ష్మీః విధత్తామ్. 7

శుభమణిగణచారుస్వర్ణసింహాసనస్థా
సురవరవనితాభిః సాదరం సేవ్యమానా,
సకలశుభవిధాత్రీ సర్వలోకేశ్వరీయం
దిశతు విజయలక్ష్మీః విష్ణుపత్నీ జయం నః. 8

సువర్ణమాలినీస్తోత్రం
అష్టలక్ష్మిప్రియావహమ్,
పఠతామిహ సర్వార్థాః
సంసిద్ధ్యన్తి యథేప్సితమ్.

# శ్రీలక్ష్మీనారాయణ
## అష్టోత్తరశతనామ స్తోత్రమ్

శ్రీర్విష్ణుః కమలా శార్ఙ్గీ లక్ష్మీర్వైకుంఠనాయకః,
పద్మాలయా చతుర్బాహుః క్షీరాబ్ధితనయాఽచ్యుతః. 1

ఇందిరా పుండరీకాక్షో రమా గరుడవాహనః,
భార్గవీ శేషపర్యంకో విశాలాక్షీ జనార్దనః 2

స్వర్ణాంగీ వరదో దేవీ హరిః ఇందుముఖీ ప్రభుః,
సుందరీ నరకధ్వంసీ లోకమాతా మురాంతకః. 3

భక్తప్రియా దానవారిః అంబికా మధుసూదనః,
వైష్ణవీ దేవకీపుత్రో రుక్మిణీ కేశిమర్దనః. 4

వరలక్ష్మీః జగన్నాథః కీరవాణీ హలాయుధః,
నిత్యా దృఢవ్రతో గౌరీ శౌరిః కాంతా సురేశ్వరః. 5

నారాయణీ హృషీకేశః పద్మహస్తా త్రివిక్రమః,
మాధవీ పద్మనాభశ్చ స్వర్ణవర్ణా నిరీశ్వరః. 6

సతీ పీతాంబరః శాంతా వనమాలీ క్షమాఽనఘః,
జయప్రదా వసుధ్వంసీ వసుధా పురుషోత్తమః. 7

రాజ్యప్రదాఖిలాధారో మాయా కంసవిదారణః,
మహేశ్వరీ మహాదేవో పరమా పుణ్యవిగ్రహః. 8

రమా ముకుందః సుముఖీ ముచికుందవరప్రదః,
వేదవేద్యాబ్ధిజామాతా సురూపార్కేందులోచనః. 9

పుణ్యాంగనా పుణ్యపాదో పావనీ పుణ్యకీర్తనః,
విశ్వప్రియా విశ్వనాథో వాగ్రూపీ వాసవానుజః. 10

సరస్వతీ స్వర్ణగర్భో గాయత్రీ గోపికాప్రియః,
యజ్ఞరూపా యజ్ఞభోక్తా భక్తాభీష్టప్రదా గురుః. 11

స్తోత్రక్రియా స్తోత్రకారః సుకుమారీ సుపర్ణగః,
మానినీ మందరధరో సావిత్రీ జన్మవర్జితః. 12

మంత్రగోప్త్రి మహేష్వాసో యోగినీ యోగవల్లభః,
జయప్రదా జయకరః రక్షిత్రీ సర్వరక్షకః. 13

అష్టోత్తరశతం నామ్నాం
లక్ష్మ్యా నారాయణస్య చ,
యః పఠేత్ ప్రాతరుత్థాయ
సర్వదా విజయీ భవేత్.

—

శ్రీరంగనాథాయ నమః

## శ్రీరంగనాథ అష్టోత్తరశత నామ స్తోత్రమ్

శ్రీరంగనాథో దేవేశః, శ్రీరంగబ్రహ్మసంజ్ఞకః,
శేషపర్యంకశయనః, శ్రీనివాసభుజాన్తరః. 1

ఇన్ద్రనీలోత్పలశ్యామః, పుణ్డరీకనిభేక్షణః,
శ్రీవత్సలాంఛితో హారీ, వనమాలీ హలాయుధః. 2

పీతాంబరధరో దేవః తథా నారాయణో హరిః,
శ్రీభూమినీళాసహితో మహావిష్ణుః సనాతనః. 3

సింహాసనస్థో భగవాన్ వాసుదేవప్రభావృతః,
కందర్పకోటిలావణ్యః కస్తూరీతిలకోజ్జ్వలః. 4

శంఖచక్రగదాపద్మ - సులక్షితచతుర్భుజః,
శ్రీమత్పుందరజామాతృ - నాథో దేవశిఖామణిః. 5

శ్రీరంగనాయకో లక్ష్మి-వల్లభః తేజసాంనిధిః,
సర్వశర్మప్రదో హీశః సామగానప్రియోత్సవః. 6

అమృతత్వప్రదో నిత్యః సర్వప్రభురరిందమః,
శ్రీభద్రకుంకుమాలిప్తః శ్రీమూర్తిః చిత్తరంజితః. 7

సర్వలక్షణసంపన్నః శాంతాత్మా తీర్థనాయకః,
శ్రీరంగనాయకీశశ్చ యజ్ఞమూర్తిః హిరణ్మయః. 8

ప్రణవాకారసదనః ప్రణవార్థప్రకాశకః,
గోదాప్రాణేశ్వరః కృష్ణో జగన్నాథో జయప్రదః. 9

నిచుళాపురవల్లీశో నిత్యమంగళదాయకః,
గంధస్తమ్భద్వయోల్లాన-గాయత్రీరూపమణ్డపః. 10

భృత్యవర్గశరణ్యశ్చ బలభద్రప్రసాదకః,
వేదశృంగవిమానస్థో వ్యాఘ్రాసురనిషూదనః. 11

గరుడానన్తసేనేశ - గజవక్త్రాదిసేవితః,
శంకరప్రియమాహాత్మ్యః శ్యామః శంతనుసంస్తుతః. 12

పాంచరాత్రార్చితో నేతా, భక్తనేత్రోత్సవప్రదః,
కలశాంభోధినిలయః, కమలాననపూజితః. 13

సనన్దనన్దసనక సుత్రామామరసేవితః,
సత్యలోకపురావాసః చతురష్టాక్షరోఽవ్యయః. 14

ఇక్ష్వాకుపూజితోఽనన్తో వసిష్ఠాదిస్తుతోఽనఘః,
రాఘవారాధితః స్వామీ రాజేన్ద్రో రఘువన్దితః. 15

విభీషణార్చితపదో లంకారాజ్యవరప్రదః,
కావేరీమధ్యనిలయః కల్యాణపురవాస్తుకః. 16

ధర్మవర్మాఖ్యచోళేన్ద్ర-పూజితః పుణ్యకీర్తనః,
పురుషోత్తమకృతస్థానో భూలోకజనభాగ్యదః. 17

అజ్ఞానదమనజ్యోతిః అర్జునప్రియసారథిః,
చంద్రపుష్కరిణీనాథః చండాదిద్వారపాలకః. 18

కుముదాదిపరీవారః పాండ్యసారూప్యదాయకః,
సప్తావరణసంవీత - సదనః సురపోషకః. 19

(సప్తావరణసంవీతః, సజ్జనాసురపోషకః)

(మరియొక పాఠము)

నవనీతనవాహారో విహారీ నారదస్తుతః,
రోహిణీజన్మతారశ్చ కార్తికేయవరప్రదః. 20

శ్రీరంగాధిపతిః శ్రీమాన్ శ్రీమద్రంగమహానిధిః,
శ్రీరంగవత్సలశ్చైవ రంగపాలక ఏవ చ. 21

రంగదేవోత్తమశ్చాయం రంగసర్వస్వమేవ చ. 22

శ్రీరంగనాథాయ పరబ్రహ్మణే నమః.

శ్రీరంగనాథ అష్టోత్తరశత నామస్తోత్రము సంపూర్ణము.

శ్రీగోదాదేవ్యై నమః

# శ్రీగోదా

## అష్టోత్తరశత నామ శ్లోకాః

శ్రీరంగనాయకీ గోదా విష్ణుచిత్తాత్మజా సతీ,
గోపీవేషధరా దేవీ భూసుతా భోగశాలినీ. 1

తులసీకాననోద్భూతా శ్రీధన్విపురవాసినీ,
భట్టనాథప్రియకరీ శ్రీకృష్ణహితభోగినీ. 2

ఆముక్తమాల్యదా బాలా రంగనాథప్రియా పరా,
విశ్వంభరా కలాలాపా యతిరాజసహోదరీ. 3

కృష్ణానురక్తా సుభగా సులభశ్రీః సులక్షణా,
లక్ష్మీప్రియసఖీ శ్యామా దయాంచితదృగంచలా. 4

ఫల్గున్యావిర్భవా రమ్యా ధనుర్మాసకృతవ్రతా,
చంపకాశోకపున్నాగ-మాలతీవిలసత్కచా. 5

ఆకారత్రయసంపన్నా నారాయణపదాశ్రితా,
శ్రీమదష్టాక్షరీమంత్ర-రాజస్థితమనోరథా. 6

మోక్షప్రదాననిపుణా మంత్రరత్నాధిదేవతా,
బ్రహ్మణ్యా లోకజననీ లీలామానుషరూపిణీ. 7

బ్రహ్మజ్ఞానుగ్రహా మాయా సచ్చిదానందవిగ్రహా,
మహాపతివ్రతా, విష్ణు-గుణకీర్తనలోలుపా. 8

ప్రపన్నార్తిహరా నిత్యా వేదసౌధవిహారిణీ,
శ్రీరంగనాథమాణిక్య-మంజరీ మంజుభాషిణీ. 9

సుగంధార్థగ్రంథకరీ రంగమంగళదీపికా,
ధ్వజవజ్రాంకుశాబ్జాంక-మృదుపాదతలాంచితా. 10

తారకాకారసఖరా ప్రవాలమృదులాంగుళీ,
కూర్మోపమేయపాదోర్ధ్వ-భాగా శోభనపార్ష్ణికా. 11

వేదార్థభావవిదిత తత్త్వబోధాంఘ్రిపంకజా,
ఆనందబుద్బుదాకారసుగుల్ఫపరమాణుకా. 12

తేజశ్శ్రియోజ్జ్వలకృతపాదాంగుళిసుభూషితా,
మీనకేతనతూణీరచారుజంఘావిరాజితా. 13

*కకుదత్ జానుయుగ్మాఢ్యా స్వర్ణరంభాభసక్థికా,
విశాలజఘనా, పీనసుశ్రోణీ మణిమేఖలా. 14

ఆనందసాగరావర్త గంభీరాంభోజనాభికా,
భాస్వద్వళిత్రికా చారుజగత్పూర్ణమహోదరీ, 15

నవవ(మ)ల్లీరోమరాజిః సుధాకుంభాయతస్తనీ,
కల్పమాలానిభభుజా చంద్రఖండనఖాంచితా. 16

సుప్రవాళాంగుళిన్యస్త మహారత్నాంగుళీయకా,
నహాయణప్రవాళాభ - పాణిదేశసమంచితా. 17

కంబుకంఠీ సుచుబుకా బింబోష్ఠీ కుందదంతయుక్,
కారుణ్యరసనిష్యంది నేత్రద్వయసుశోభితా. 18

ముక్తా శుచిస్మితా చారుచాంపేయనిభనాసికా,
దర్పణాకారవిపుల కపోలద్వితయాంచితా. 19

అనంతార్కప్రకాశోద్యత్-మణితాటంకశోభితా,
కోటిసూర్యాగ్ని సంకాశ -నానాభూషణభూషితా. 20

సుగంధవదనా సుభ్రూః అర్ధచంద్రలలాటికా,
పూర్ణచంద్రాననా, నీలకుటిలాలకశోభితా. 21

---

"కకుదజ్జానుయుగ్మాఢ్యా" అని పూర్వపాఠము. పండిత పరిష్కృత
పాఠము "కకుదత్ జానుయుగ్మాఢ్యా" అని.

సౌందర్యసీమావిలసత్కస్తూరీతిలకోజ్జ్వలా,
ధగద్ధగాయమానోద్యత్ మణిసీమంతభూషణా. 22

జాజ్వల్యమానసద్రత్న-దివ్యచూడావతంసికా,
సూర్యార్ధచంద్రవిలసత్ భూషణాంచితవేణికా. 23

నిగన్నిగద్రత్నపుంజ-ప్రాంతస్వర్ణనిచోళికా,
సద్రత్నాంచితవిద్యోత-విద్యుత్పుంజాభశాటికా. 24

అత్యర్ఘ్యానలతేజోఽధి-మణికంచుక ధారిణీ,
నానామణిగణాకీర్ణ-హేమాంగద సుశోభితా 25

కుంకుమాగరు కస్తూరీ-దివ్యచందన చర్చితా,
స్వోచితౌజ్జ్వల్య వివిధ-విచిత్రమణిహారిణీ. 26

అసంఖ్యేయసుఖస్పర్శ-సర్వాతిశయభూషణా,
మల్లికాపారిజాతాది-దివ్యపుష్పస్రగంచితా, 27

శ్రీరంగనిలయా పూజ్యా దివ్యదేశసుశోభితా,
ఏవం శ్రీరంగనాయక్యా నామ్నామష్టోత్తరం శతమ్. 28

యో నరః పఠతే నిత్యం నిత్యనిర్వాణసంపదమ్,
లబ్ధ్వా రంగపతేః దాసదాసస్తు భవిష్యతి. 29

శ్రీగోదా అష్టోత్తరశతనామ శ్లోకములు సమాప్తము

---

## పాంచరాత్ర లక్ష్మీతంత్రమునందలి
## లక్ష్మీ
## అష్టోత్తరశతనామ స్తోత్రము

ఓమ్ శ్రీలక్ష్మై నమః

శ్రీర్లక్ష్మీః కమలాదేవీ మా పద్మా కమలాలయా,
పద్మేస్థితా పద్మవర్ణా పద్మినీ మణిపంకజా. 1

పద్మప్రియా నిత్యపుష్టా హ్యుదారా పద్మమాలినీ,
హిరణ్యవర్ణా హరిణీ హ్యర్ఘ్యా చంద్రా హిరణ్మయీ. 2

ఆదిత్యవర్ణాఽశ్వపూర్వా హస్తినాదప్రబోధినీ,
రథమధ్యా దేవజుష్టా సువర్ణరజతస్రజా. 3

గన్ధద్వారా దురాధర్షా తర్పయన్తీ కరీషిణీ,
పింగళా సర్వభూతానాం ఈశ్వరీ హేమమాలినీ, 4

కాంసోస్మితా పుష్కరిణీ జ్వలన్త్యనపగామినీ,
సూర్యా సువర్ణా మాతా చ విష్ణుపత్నీ హరిప్రియా. 5

ఆర్ద్రా యష్కరిణీ గంగా వైష్ణవీ హరివల్లభా,
శ్రయణీయా చ హైరణ్య-ప్రాకారా నళినాలయా. 6

విశ్వప్రియా మహాదేవీ మహాలక్ష్మీః వరా రమా,
పద్మాలయా పద్మహస్తా పుష్టిః గన్ధర్వసేవితా. 7

ఆయాసహారిణీ దివ్యా శ్రీదేవీ చంద్రసోదరీ,
వరారోహా భృగుసుతా లోకమాతాఽమృతోద్భవా. 8

సిన్ధుజా శార్ఙ్గిణీ సీతా ముకున్దమహిషీన్దిరా,
విరించిజననీ ధాత్రీ శాశ్వతా దేవపూజితా. 9

దుగ్ధా వైరోచనిః గౌరీ మాధవ్యచ్యుతవల్లభా,
నారాయణీ రాజలక్ష్మీః మోహినీ సురసున్దరీ. 10

సురేశసేవ్యా సావిత్రీ సంపూర్ణాయుష్కరీ సతీ,
సర్వదుఃఖహరాఽఽరోగ్య-కారిణీ సత్కళత్రికా. 11

సంపత్కరీ జయశ్రీ చ సత్సంతానప్రదా ఇష్టదా,
విష్ణువక్షఃస్థలావాసా వారాహీ వారణార్చితా. 12

ధర్మజ్ఞా సత్యసంకల్పా సచ్చిదానందవిగ్రహా,
ధర్మదా ధనదా సర్వ-కామదా మోక్షదాయినీ. 13

సర్వశత్రుక్షయకరీ
సర్వాభీష్ట ఫలప్రదా
సమాప్తము

# గోదాచతుఃశ్లోకీ

నిత్యాభూషా నిగమశిరసాం నిస్సమోత్తుంగవార్తా
కాంతో యస్యాః కచవిలులితైః కాముకో మాల్యరత్నైః,
సూక్త్యా యస్యాః శ్రుతిసుభగయా సుప్రభాతా ధరిత్రీ
సైషా దేవీ సకలజననీ సించతాం మామపాంగైః. 1

ఉపనిషత్తులకు నిత్యాలంకారమైనవాడును, తనతో సమానమైనవారు గాని, తనకంటె అధికులైనవారుగాని లేనివాడును, అయిన ఏ శ్రీరంగనాథుడు ఏ గోదాదేవిచేత ధరించి సమర్పించబడిన మాల్యరత్నముల(ను) కాముకుడై (కోరినవాడై), ఆమెకు ప్రియుడైనాడో, ఏ గోదాదేవియొక్క శ్రుతిసుభగమైన సూక్తితో(తిరుప్పావు-నాచ్చియార్ తిరుమొళి)జగమంతయు మేల్కొలుపబడినదో (అలంకరింపబడినదో), అట్టి సకలజననియైన తల్లి (గోదాదేవి) తన అపాంగములతో (చల్లని చూపులతో) నన్ను రక్షించును గాక.

మాతా చేత్ తులసీ పితా యది తవ శ్రీవిష్ణుచిత్తో మహాన్
భ్రాతా చేద్యతిశేఖరః ప్రియతమః శ్రీరంగధామా యది,
జ్ఞాతారస్తనయాస్త్వదుక్తిసరసస్తన్యేన సంవర్ధితాః
గోదాదేవి! కథం త్వమన్య సులభా (సుభగా) సాధారణా శ్రీరసి? 2

ఓ గోదాదేవీ! నీయొక్క తల్లి తులసి-తండ్రి విష్ణుచిత్తులు, సోదరుడు భగవద్రామానుజులు-ప్రియతముడు శ్రీరంగధాముడు. నీయొక్క వచనములనెడి సరసస్తన్యములచేత వృద్ధిపొందించబడిన ఈ జ్ఞానులందరును నీ కుమారులు. కావున ఓ గోదాదేవీ! నీవు సాధారణమైన లక్ష్మివి ఎట్లగుదువు? (ఎట్లయితివి?) (లేదా) నీవు సాధారణమైన లక్ష్మివా? (లక్ష్మికంటె అధికురాలవని భావము)

---

చూ, గోదాస్తవం, 1. వ్యక్తం మమాంతరమిదం-14 శ్లో
2. శ్రీవిష్ణుచిత్తమునిపుంగవ-32 శ్లో॥

కల్పాదౌ హరిణా స్వయం జనహితం దృష్ట్వైవ సర్వాత్మనా
ప్రోక్తం స్వస్య చ కీర్తనం ప్రపదనం స్వస్మై ప్రసూనార్పణమ్,
సర్వేషాం ప్రకటం విధాతుమనిశం శ్రీధన్వినవ్యే పురే
జాతాం వైదికవిష్ణుచిత్తతనయాం గోదాముదారాం స్తుమః 3

కలియుగారంభమున శ్రీమన్నారాయణుడు (వరాహస్వామి) జన హితము కోరి తనకు స్వయముగా చెప్పిన ప్రపత్తివైభవమును, పూర్తిగా ఆచరించి ఈ చేతనులకు చూపుదమను ఉద్దేశ్యముతో 'భూదేవియే', శ్రీవిల్లి పుత్తూరునందు 'గోదాదేవి'గా అవతరించి, స్వామియొక్క కీర్తనము, ప్రపత్తి, స్వామికి పుష్పమాలార్పణము మొదలగువానిని ఆచరించుట ద్వారా లోకమునకు చాటినది. ఆ విధముగా భూమియొక్క అవతారమైనట్టియు, ఉదార స్వభావ యైనట్టియు గోదాదేవిని స్తోత్రము చేయుదము.

ఆకూతస్య పరిష్క్రియామనుపమామాసేచనం చక్షుషోః
ఆనందస్య పరంపరామనుగుణామారామశైలేశితుః,
తద్దోర్మధ్యకిరీటకోటిఘటితస్వోచ్ఛిష్టకస్తూరికా
మాల్యామోదసమేధితాత్మవిభవాం గోదాముదారాం స్తుమః. 4

శ్రీరంగనాథునియొక్క హృదయమునందలి "చేతనోద్ధరణము" అను భావమునకు 3వ శ్లోకములోని విధముగా తాను ఆచరించిచూపుట ద్వారా సాటిలేని పరిష్కారము, అలంకారము అయినట్టిదియు, స్వామినేత్రములకు చల్లదనమును కలుగచేయునదియు, ఆనందముయొక్క పరంపరయైనట్టిదియు, స్వామియొక్క గుణములకు తగినట్టిదియు, ఆ స్వామియొక్క వక్షఃస్థలమునందు తాను అనుభవించి సమర్పించిన కస్తూరియొక్కయు, కిరీటకోటియందు తాను ముడిచి విడచిన పుష్పమాలయొక్కయు సౌరభముతో వృద్ధిపొందిన తన వైభవము కలిగినట్టిదియు, ఔదార్యయుక్తయు అయిన గోదాదేవిని స్తోత్రము చేయుదము.

---

శ్రీ శ్రీ శ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ చిన్న జీయర్
(జీయర్ ఎడ్యుకేషన్ ట్రస్టు-సీతానగరం)
వారి మంగళాశాసనము

శ్రీమతే నారాయణాయ నమః

అనేక మంగళాశాసనములు

చైత్ర బహుళ సప్తమి
28-4-1989

కల్పాదౌ హరిణా స్వయం జనహితం దృష్ట్వైవ సర్వాత్మనా
ప్రోక్తం స్వస్య చ కీర్తనం ప్రపదనం స్వస్మై ప్రసూనార్పణమ్,
సర్వేషాం ప్రకటం విధాతుమనిశం శ్రీధన్వినవ్యే పురే
జాతాం వైదికవిష్ణుచిత్తతనయాం గోదాముదారాం స్తుమః.

కర్తవ్యోపదేశం చేసి మానవులను ఉద్ధరించటానికి ఎన్నో సార్లు శ్రియఃపతి భూమిపై అవతరించి ఎన్నో రకాల మాయలు ప్రయోగించినా ఈ మారని మనుష్యులను చూచి అసహనం చెందాడు. "మూఢాః" అని ఘోరంగా శపించి తన శ్రీకృష్ణావతారాన్ని చాలించాడు. విశ్రాంతికోసమని దుఃఖోపశమనం కోసమని సౌందర్యరాశియైన సీతాదేవి ఉన్నతమైన వక్షః సౌందర్యంలో క్వచిత్కోణే మగ్నమైపోయినాడు. తన స్వభావం, జీవుల స్వరూపాన్ని, భగవానుడే మరచిపోతే ఇక వీరా జ్ఞాపకముంచుకొనునది ? వీరూ విస్మరించి భగవత్ విముఖులై స్వైరసంచారము నారంభించి మనస్సునకు వాక్కునకు శరీరమునకు నేర్పవలసిన కర్తవ్యముల నొక్కటిని తెలుసుకోలేని సమయంలో ఈ జీవకోటి నంతటిని ఉద్ధరించటానికి శ్రీవిల్లిపుత్తూరులో శ్రీవిష్ణు చిత్తుల ముద్దులపట్టియై అవతరించినది గోద.

భగవానునకు చేయ చేతగాని పనులను తాను చేసి చూపింది. పర తత్త్వాన్ని బోధించాలంటే తానే కనుక తన ప్రభావాన్ని తానే చెప్పుకోవలసి వచ్చింది ఆయనకు. అది లోకానికి అసూయాజనకము అయింది. అట్లుగాక గోద స్వామివైభవాన్ని తాను నోరార పాడింది. పాడించింది. ఇది ఆత్మశ్లాఘ

కాదు. కనుక జిజ్ఞాసుజనజీవాతువైనది. "భగవచ్ఛరణాగతి" వైభవాన్ని చాటి చెప్పి అదె తనులభమో, ఒకవేళ భగవానుడే ఉపనని వర్తించుకోనన్నా, నిర్బంధించికూడ పొందతగిన సంబంధద్రఢిమ ఎట్టిదో, అందమైన పాటలుగ పాడి అందించిందేగాని వేదాన్తబోధ చేయలేదు.

శరీరమున్నందులకు చేసే పనులన్నీ లోపలనుండి నడిపించే ఆ ప్రభువుయొక్క సేవగ అర్పించాలని ఉపదేశించటమే గాక తానాచరించి చూపింది. తాను ముడిచి విడచిన పుష్పములను స్వామికి ప్రీతి కలుగున ట్లర్పించినది తాను నోట దాల్చిన పలుకులను పాటగపాడి అందించింది. ఇవి రెండూ తాను అనుభవించిన ఉచ్ఛిష్టములే-అయితే అవి పొందక భగవానుడే నిలవలేక పోయినాడు. కోరి మరీ గ్రహించినాడు. ఆ పై బంగారుతీగవంటి తానే ఒక మాలికయై స్వామి నిత్యాభరణములకు ఆభరణమైంది.

గోదాదేవి మన తరపున పురుషకారము చేయదగిన మధ్యవర్తులలో మొదటి యామె. ఈమెలో ఒక విశేషముంది. మిగిలిన పురుషకారభూతురాళ్ళగు తాయారులు స్వామిని తమ సౌందర్యంలో నిదురబుచ్చి మనలను మరిచేటట్లు చేయగలిగితే, ఆతనిని నిదురనుండి మేల్కొలిపి తన కర్తవ్యాన్ని పాఠము చెప్పి నేర్పి జీవరక్షణభారాన్ని వహించునట్లు తీర్చి దిద్దిన అధ్యాపిక మన గోద-

ఈ విధముగ భగవానుడయిన శ్రియఃపతి శిష్యుడాచార్యుని వద్ద వలె ఎంత పరతంత్రుడై మెలగువాడో ఒకసారి భావిస్తే, మన భాగ్యం పండి నట్లే-తల్లిగ మనలను లాలించి బుజ్జగించి, "వారాయ్, పాడవుం నీవాయ్, తిరు వాయ్" అంటూ బ్రతిమాలిన ఈమెను గనుక మన మాశ్రయించ గలిగితే ఆమెవద్ద పరతంత్రుడైన తాను ఎందులకు మన అభీష్టములను పరిపూరించడు? కనుక చేయదగిన దేమిటి?

అత్యన్తఉదారస్వభావం కలిగిన మన అమ్మ గోదాదేవి యొక్క సౌందర్యమును, దానికి పరవశుడైన స్వామిని, ఆమెయొక్క కళ్యాణగుణము లను, వానికి అమ్ముడైన స్వామిని స్మరిస్తుండుటే గద-

అయితే ఆ తల్లి వైభవాన్ని ఉన్నదున్నట్లు కీర్తించటం అనేది ఎవ్వరికీని శక్యం కానేకాదు. అపారం కనుక - ఇక దాహార్తుడు నదిలో నీటిని తన దాహమునకు తగినంత గ్రహించి తృప్తుడగునట్లే- మనమూ మన మనః పాత్రస్థితిని బట్టి, బుద్ధియొక్క వైభవాన్ని బట్టి, చేతనయినంత- అందినంత వరకు కీర్తించుటే చేయతగినది. అట్లు చేయటంవల్ల అటు నదికి లోటు లేదు- దాహమూ తీరకపోదు. అట్లే అమ్మయొక్క అప్రమేయకీర్తిప్రవాహమునకు లోటులేదు. మన సాంసారికతాపార్తి శమించుటలోను లోపం లేదు. ఎంతటి వారు కీర్తించినా ఆమె కాంతికి లోటుండదు. మచ్చ ఏర్పడనే ఏర్పడదు.

"నహి శునా లీఢాపి భాగీరథీ దుష్యేత్-
శ్వాపి న లజ్జతే, న చ బిభేతి-ఆర్తిస్తు-
శామ్యేత్ శునః"

(శునకము నోటితో స్పృశించి త్రాగినా గంగానది అపవిత్రం కాదు. శునక మూ పనిచేయ సిగ్గు చెందదు. భయపడదు. అయినా దాని దాహము తీరునుకూడ) అంటారు శ్రీస్తవంలో-

అట్లే ఎందరెందరు కీర్తించినా తరగని ప్రభావంకల, శ్రీఆండాళ్ వైభవాన్ని అనుభవించిన శ్రీ ఉ. వే శ్రీమాన్ మరింగంటి అప్పలదేశి కేంద్రులు-శ్రీగోదాస్తవ మనుపేర. మూలగ్రంథమున గోదావైభవమును ప్రకటిస్తూ కృపచేయగ-దానిని అన్ని తరగతులవారు అందుకునే రీతిలో శ్రీ ఉ. వే శ్రీమాన్ K. V. R. నరసింహాచార్య స్వామివారు సౌరభాన్ని కూర్చి తెలుగుజాతి కందించారు. కేవలము ఆధ్యాత్మిక శ్రద్ధ కలవారి వరకే పర్యవసింపచేయక మూలకర్తలు కావ్యసోయగములను అందు నింపగ-శ్రీమాన్ నృసింహాచార్యస్వామి సంస్కృతవిద్యా శ్రద్ధకల విద్యార్థులందరికిని-దాని కావ్య సౌరభాన్ని అందుకునే రీతిలో ఉపరిచితులుకూడ భాషాధ్యయనం చేస్తూ సన్మార్గంలో పయనించగలిగేటట్లు ఈ గోదాస్తవాన్ని - ప్రతిపదార్థమువంటి తాత్పర్యము వివరణములతోపాటు, ఆ యా శ్లోకములయందలి అలంకారములను వృత్తములను కూడ తెలియచేస్తూ-కవిసమయ ప్రశంసాపాత్ర మయేటట్లు తీర్చి దిద్దారు. దీని వెనుక ఉంటూ మార్గమును చూపి మూలగ్రంథాన్ని సంస్కరించి

వ్యాఖ్యను పరిష్కరించి, సరైన రీతిలో వెలువడేటట్లు కృషిచేసిన కవితార్కిక కేసరులు శ్రీ ఉ. వే. శ్రీమాన్ N. C. రఘునాథాచార్యస్వామి సంసేవ్యులు.

శ్రీగోదాదేవి ఈ కృతి సౌరభాలను తానను భవించి, తన అధీనంలో స్వామిచే "బలాత్కృత్య" అనే శక్తి కలది కనుక, అనుభవింపచేసి, తద్వారా శ్రద్ధాళువు లందు కొనునట్లు కృపచేయుగాక—

వీరి ఈ కృషిని ప్రధానముగ సంస్కృత విద్యార్థులు. మిగిలిన సంప్రదాయపరులు—గ్రంథాధ్యయనము ద్వారా—సఫలపరచుబాగ్య మందెదరుగాక! అని అనేక మంగళాశాసనములు చేస్తున్నాము.

గోదా శ్రీరంగనాథులు శ్రీమాన్ నృసింహాచార్యులవారిచే ఇట్టి సేవలను బాగుగ స్వీకరింతురుగాక!

జీయర్ ఎడ్యుకేషనల్ ట్రస్ట్,
సీతానగరం,
28-4-89.

చిన్న శ్రీ రా. జీయర్

కవితార్కిక కేసరి
ఉ. వే. శ్రీమాన్ శ్రీ న. చ. రఘునాథాచార్యస్వామి
(పరిష్కర్త)

# గోదాస్తుతి ప్రశస్తి

"సంధ్యాన-భ్రమ నానటన్నిటల దృఙ్మార్గాంతరస్పర్శనీ
రంగత్తుంగతరంగ సంఘనదివ శ్రీసూక్తియుక్తాననః"

అని ప్రశంసింపదగిన అనర్గళకవితావైఖరిగల శ్రీ ఉ. వే. మరింగంటి అప్పల దేశికులవారు ప్రసాదించిన గోదాస్తుతి శత రూపంలో అవిర్భవించిన అత్యుత్తమ కావ్యఖండము అసదృశమైన వర్ణనావైభవంతోను, నానాలంకార సంకలనంతోను రసబంధురమై సహృదయహృదయాకర్షణధురంధరమైన ఈ స్తుతి సుమారు 200 సంవత్సరాలకు పూర్వం అవిర్భవించి నా తాళపత్రాలలో చిరకాలం నిలీనమైయుండి, అంతరించిపోకుండ సవ్యాఖ్యానంగా ఈనాటికి ప్రకటితం కావటం రసికభాగ్యపరిపాకమే నని విశ్వసిస్తున్నాను.

సుమారు 25 సంవత్సరాలకు పూర్వం ఒక వ్యక్తిచే వ్రాతప్రతిలో నావద్దకు తేబడిన ఆ స్తుతిగ్రంథం లేఖకదోష భూయిష్ఠమై శోధింపబడకుండానే తిరిగి ఆ వ్యక్తివద్దకే చేరిపోయింది. అప్పుడే అమృతగుళికలవంటి 10శ్లోకాలను నేను ఎత్తి వ్రాసికొని శ్రీవైష్ణవపత్రిక వారికి అందించాను. వారు ఆ 10శ్లోకాలు మాత్రం పత్రికలో వేశారు.

తరువాత శ్రీ ఉ. వే కోవెల రంగాచార్యస్వామివారు, శ్రీ ఉ. వే. అమరవాది వేంకట నరసింహాచార్యస్వామివారు, ఈ స్తుతి సంపూర్ణంగా వ్రాత ప్రతిలో తమవద్ద ఉన్నట్లును, దీనిని అప్పలదేశికులవారు రచించినట్లును, నాకు తెలిపియున్నారు. తరువాత ఖమ్మంలో ఉండే ఒక స్వామివారు దీన్ని మూలమాత్రం అచ్చువేయించారు. కాని అందులో కొన్ని లేఖక, ముద్రణ దోషాలు చోటుచేసుకున్నవి-శ్రీమాన్ అమరవాది వేంకటనరసింహాచార్యస్వామి వారి వద్దనుండిన హస్తలిఖితప్రతి ఒకటి నావద్దకు చేరగా దాని సహాయంతో ముద్రితప్రతిని చాలావరకు శోధింపియుంచినాను.

ఇట్లుండగా శ్రీగుణరత్నకోశాదిస్తోత్రాలపై పెపుల విశద వ్యాఖ్యలను వ్రాసిన విద్వాంసులు శ్రీమన్ K. V. P. నరసింహాచార్యస్వామివారు ఈ స్తుతికి తెలుగులో రసభావాలంకారస్ఫోరకమైన వ్యాఖ్యను వ్రాయటం అది ప్రకటింపబడటం అత్యంతముదావహమైన విషయం.

మొదట మూలశ్లోకముల పెలెనే ఈ ఆంధ్రవ్యాఖ్యకూడా నాపై సౌహార్దంతో పరిశీలనకై వ్యాఖ్యాకర్తలచే పంపబడినది. నావద్ద నున్న వ్రాత పతి సహాయంతో నేను చేసియున్న పాఠశోధనలు కొన్ని వారికి తెలిపి తోచిన సలహాలను వారికి వ్రాసి పంపినాను. సహృదయులుగా వారు సూచనలు స్వీకరించినందులకు కృతజ్ఞుడను.

వారి పాండిత్యమును స్ఫురింపచేసే ఈ వివరణము సర్వతోభద్రమని భావిస్తున్నాను వ్యాఖ్యానకర్తలకు ప్రకటనకర్తలకు లనర్ఘమైన ఈ దివ్య స్తుతిని వెలికి తెచ్చినందుకు రసిక పాఠకలోకం అవశ్యం కృతజ్ఞతాబద్ధమై యుంటుంది.

వరంగల్లు,
1-5-89

ఇట్లు
బుధజన విధేయుడు
శ్రీ న. చ. రఘునాథాచార్యుడు

ఉ. వే. శ్రీమాన్ శ్రీ భాష్యం అప్పలాచార్యస్వామి

## అభినందనము

శ్రీమాన్ మరింగంటి అప్పలదేశికులవారి గోదాస్తవము అపూర్వమైన రచన- దాని విశిష్టతగురించి ఉ.వే శ్రీమాన్ రఘునాథాచార్య స్వామివారు వివరించినారు. వేదాంతదేశికుల గోదాస్తుతితో సదృశమో విశిష్టమో అన్నట్లు ఒప్పుచున్నది. గోదాదేవిపై విరచితమైన ఈ శతకము విచిత్ర పదగుంఫనముతో వృత్త వైవిధ్యముతో భావబంధురతతో శబ్దార్థాలంకారసంయోజనముతో విచిత్రముగ సాగినది. వీరు సంస్కృతభాషయందును వృత్తములయందును చూపిన ప్రౌఢి అనితర సాధారణము.

ఆండాళును "ఆస్థానశీత్యభియశంకిభిరార్యవర్యైః అరక్షితాం" అని, "అంజికొడుక్కి ఒరు సంతతియాయ్" అను మణవాళమామునుల వాక్యమును స్మరింపచేసినారు. వేదాన్తదేశికులను పదేపదే స్మరింపచేసినారు. శ్రీ పరాశర భట్టారకులను స్మృతిపథమున విహరింపచేసినారు.

ఇట్టి స్తోత్రమును ఆంధ్రులకు ప్రధానముగ శ్రీ వైష్ణవ సంప్రదాయ శ్రద్ధకలవారికి ఆంధ్రవివరణముతో అందించినారు శ్రీమాన్ నరసింహాచార్యులుగారు. వారి వివరణమున పూర్వాచార్యుల సామ్యములను చక్కగ నిరూపించినారు. మరుగున పడివున్న ఈ స్తవమును తెలుగువారి కందించవలయునను వారి ప్రయత్నము అభినందనీయము. ఆంధ్రుల సంస్కృత సేవకు ఈ స్తవము నికషము.

పూర్వాచార్యుల సవిధమున నిలువదగిన మహానుభావులు ఆంధ్రులై శ్రీ వైష్ణవ సంప్రదాయమునకే అలంకారమైన ఒక స్తవమును అనుగ్రహించినారు అను ఈ వార్త ఆంధ్రులకు ఆనందహేతువు.

శ్రీమాన్ నరసింహాచార్యులవారు సంప్రదాయశ్రద్ధాళువులై నిరాడంబరమైన సేవాభావముతో శ్రీ గుణరత్నకోశమును, స్తోత్రరత్నమును, గద్యత్రయమును ఆంధ్రవివరణముతో ఆంధ్రులకందించినారు. వానికి మరికొన్ని వివరణ

ములు లభించునే మోకాని. ఆంధ్రమున వివరణమే లేని ఈ స్తవమునకు వివరణమును ప్రసాదించుచు, ఇంతవరకు వెలుగుచూడని ఈ స్తవమును ఆంధ్రుల కందించుటలో శ్రీ నరసింహాచార్యులవారు కృతకృత్యులై ఆంధ్రలోకమున అభినందనీయులై నారు.

వారు చేసిన ఈ సేవకు ఆండాళు వారికి సర్వాభ్యుదయములను తప్పక ప్రసాదించగలదు. పాండిత్యమును లోకోపకారముగా వినియోగించుచూ ధన్యులైన వీరు సంప్రదాయమును ప్రచారము చేయునట్లు శ్రియఃపతి అనుగ్రహించునట్లు ప్రార్థించుచున్నాను.

విశాఖపట్టణం, ఇట్లు
26-6-89 శ్రీ అప్పలాచార్యః

ఉ. వే. శ్రీమాన్ కె. యస్. రామానుజాచార్యస్వామి
(విద్యాప్రవీణ, భాషాప్రవీణ - M.A.)
Sri Veda and Sanskrit College, Mulapeta,
Nellore.

శ్రీమతే రామానుజాయ నమః

శ్రీమత్యై గోదాదేవ్యై నమః

## అనుమోదము

శ్రీమన్మరింగంటి అప్పలదేశికాచార్యస్వామివారిచే ప్రణీతమైన శ్రీ గోదాస్తవమునకు శ్రీమాన్ కందాడై వేంకటరామనరసింహాచార్యస్వామివారు ఆంధ్రమున రచించిన విశేషవివరణాత్మకవ్యాఖ్యానమును ఆసాంతము చదివి ఆనందించితిని. శ్రీమాన్ ఆచార్యులవారు ఇదివరకే "శ్రీగుణరత్నకోశము"నకు "రత్నదీపిక" అను వ్యాఖ్యానమును, స్తోత్రరత్నమునకు "రత్నప్రభ" అను వ్యాఖ్యానమును సంతరించి ఆస్తికోత్తములకు చక్కని వ్యాఖ్యాతగా సుపరిచితులై ఉన్నారు.

శ్రీవైష్ణవసంప్రదాయమున గోదాదేవికి గల స్థానము నిరుపమానము. ఆమె అనుగ్రహించిన "తిరుప్పావై" అను దివ్యప్రబంధము శ్రీవైష్ణవ దేవాలయములయందును గృహారాధనలయందను నిత్యానుసంధేయమై అలరారుచున్నది. ధనుర్మాసమున ముప్పదిరోజులు రోజునకు ఒక్కొక్క పాశురము చొప్పున తిరుప్పావై ముప్పది పాశురములను అనుసంధించుట శ్రీవైష్ణవ సంప్రదాయము. పరమపురుషుని సన్నిధిలో యావదాత్మభావిగ చేయు నిత్యకైంకర్యమే పరమపురుషార్థమని బోధించినది. ఈ దివ్యప్రబంధము, భగవంతుని తప్ప మరెవరిని వివాహమాడనని నిశ్చితాభిప్రాయము గల శ్రీగోదాదేవి-అర్చారూపియగు శ్రీరంగనాథుని వివాహమాడి అర్చావైభవమును లోకమునకు చాటినది. శ్రీకృష్ణదేవరాయని ఆముక్తమాల్యదలో నాయిక ఈ గోదాదేవియే-ఈ విధముగ ఈమె భగవంతుని దేవేరులలో అన్యతమయై విరాజిల్లుచున్నది.

శ్రీగోదాదేవిని స్తుతించుచు ఏర్పడిన ప్రాచీన స్తోత్రములలో శ్రీమద్వేదాంతదేశికులవారి "గోదాస్తుతి" మిక్కిలి ప్రసిద్ధమైనది. ప్రకృత

గోదాస్తవప్రణేత శ్రీమన్మరింగంటి అప్పలదేశికాచార్యస్వామివారు (వీరి దేశకాలాదులు ఇంకను తెలియవలసి ఉన్నది) వీరి ఈ గోదాస్తవము వివిధవృత్తములలో సరసశబ్దాలంకారశోభితమై అర్థజ్ఞానములేనివారును చదివి ఆనందింపతగి యున్నది. ఇందు ప్రతిపాద్యాంశము సైతము శ్లేష-విరోధాభాస-రూపకోత్ప్రేక్షాద్యర్థాలంకారములతోను ధ్వన్యర్థములతోను శోభితమై భక్తిరసముతో సహృదయపాఠకలోకమును ముంచెత్తుచున్నది.

ఇట్టి ఈ గోదాస్తవమును శ్రీమాన్ నరసింహాచార్యులవారు సామాన్యవాక్యార్థమునే గాక విశేషార్థములను సైతము ప్రదర్శించుచు కావించిన ఈ వ్యాఖ్యానము లలితము-మధురమునై యున్నది. గోదాస్తుతి-శ్రీగుణరత్నకోశము-గోదాఅష్టోత్తరశతనామ స్తోత్రము-మున్నగు ప్రాచీనస్తోత్రములలోని భావములతో ఈ స్తోత్రమునందలి భావములను సరిపోల్చిచూపుట ఈ వ్యాఖ్యాతయొక్క విమర్శనాదృష్టికి నికషోపలము. ఈ వ్యాఖ్యానమున చూపిన ఇతర స్తోత్రముల అకారాదిక్రమమును తెలిపిన బాగుండగలదు.

ఆంధ్రపాఠకలోకమునకు శ్రీగోదాస్తవమును చక్కని వ్యాఖ్యతో అందించుచున్న శ్రీమాన్ నరసింహాచార్యులవారిని హృదయపూర్వకముగా అభినందించుచున్నాను. "క్లేశః ఫలేన హి పునర్నవతాముపైతి" అను న్యాయమును ఆంధ్రవిద్వల్లోకము వీరి విషయమున సార్థకమొనర్చును గాక.

నెల్లూరు,
14-11-86

ఇట్లు
బుధజనవిధేయుడు
కె. ఎస్. రామానుజాచార్యులు

ఉ. వే. శ్రీమాన్ కే. వేంకటాచార్యస్వామి
(విద్యాప్రవీణ, భాషాప్రవీణ - M.A.)
Head of the Dept. of Telugu, Sri Y. N. College, Narsapur
మరియు డిప్యూటి స్థానాచార్య,
(శ్రీ ఆదికేశవ ఎంబెరుమానార్ దేవస్థానం-నరసాపురం)

శ్రీమత్యై గోదాదేవ్యై నమః
శ్రీమతే రామానుజాయ నమః

## ఆమోదము

సర్వవాఙ్మయములలోను భక్తిసాహిత్యమునకు విశిష్టస్థానము కలదు. భగవంతుని చేరుటకు జీవుడు పడు ఆవేదనాత్వరలను తెలుపుట భక్తిసాహిత్య పరమలక్ష్యము. గుణాధిక విషయమున పొందు ఇట్టి భావన ప్రశంసనీయము. జీవుని ఆకర్షించి అతనికి నిద్రపట్టకుండ చేయునవి భగవంతుని స్వరూప-రూప-గుణ-విభూతులు. గోపికలే ఇందుకు ప్రబలసాక్ష్యము. వీనిని పరిపూర్ణముగ భగవత్ కటాక్షముచే తాము అనుభవించి ఆ యనుభవమును వాగ్రూపమున వెల యించినవారలు పరమభక్తులైన ఆళ్వార్లు.

పన్నిద్దరాళ్వారులలో (ఆళ్వారులు దశసంఖ్యాకు లనుట ప్రసిద్ధము.) అగ్రగణ్య అండాళ్ అని వ్యవహరింపబడు గోదాదేవి-తులసికి పరిమళము సహజమైనట్లు భగవద్భక్తి ఈమెకు జన్మతోనే వచ్చినది. ఐదు జంటలైన (10 మంది) ఆళ్వార్లకు గోద ఏకైక జ్ఞానసంతానమగుటచే వారి "భగవత్ జ్ఞాన సంపద" అంతయు ఈమెకు దక్కినది.

భూదేవి వరాహస్వామివలన, కలిలో సకలజనతరణోపాయముగా భగవంతుని గూర్చిన కీర్తన, ప్రపదన, మాలికార్పణము లను ఉపదేశము పొందినది. వానిని తాను ఆచరించి స్వసంతానమైన చేతనులచే ఆచరింప చేయుటకై "శ్రీవిల్లిపుత్తూర్" అను దివ్యదేశమున ప్రపన్నకులశేఖరులైన పెరియాళ్వార్లకు తులసివనములో అయోనిజగా లభించినది. విష్ణుచిత్తుల గృహమున వయస్సుతోపాటు ఈమె భగవద్భక్తి కూడ దినదినాభివృద్ధి నొంది

నది ఫలితముగ గోద ధరించిన మాలికనే భగవంతుడు ధరించినాడు. ఇట్టిది ఈమె భగవద్భక్తి.

శ్రీకృష్ణుని బాల్యచరిత్రమునందలి రసవద్ఘట్టములను శ్రవణపేయములైన సూక్తులతో వర్ణించియు, స్వామి అనుగ్రహాన్ని పూర్తిగా పొందిన విష్ణుచిత్తులు గోదాదేవి ధరించిన పుష్పమాలను వటపత్రశాయికి సమర్పించి, స్వామి పరిపూర్ణకటాక్షమునే గాక "లేభే మహత్తరపదానుగుణం ప్రసాదమ్" అను దేశికుల సూక్త్యనుసారము "పెరియాళ్వార్" అను బిరుదమును కూడ పొందినారట.

(భగవంతునకు మంగళాశాసనము చేయుట సహజము-అనుసారణము చే విష్ణుచిత్తులకు పెరియాళ్వార్ అను నామధేయము కల్గినదనుట ప్రసిద్ధము.)

భగవంతుని ఎప్పుడును వీడనిదియు కరుణాస్వరూపిణి యగు సనిదియు శ్రీదేవి "న కశ్చిన్నాపరాధ్యతి" (తప్పుచేయని వారెవరు?) అని మహాపరాధి యగు చేతనుని కూడ స్వామిచే రక్షింపచేయుటకై ప్రయత్నించునట, కాని స్వామి హితపరుడు-స్వతంత్రుడు కావున, ఒక్కొకసారి ఆమెమాటను వినక ముఖమును మరియొక ప్రక్కకు త్రిప్పుకొనుట కాని ఆ ప్రక్కనున్న క్షమా స్వరూపిణియగు గోదాదేవిని చూచి తన కోపాన్ని మరచి ఆ చేతనుని రక్షించు నట.

"పార్శ్వే పరత్ర భవతీ యది తత్ర నాసీత్,
ప్రాయేణ దేవి! వదనం పరివర్తితం స్యాత్"

అనునది శ్రీదేశికులవారి రసఘనసూక్తి-

ఇట్టి వైభవశాలి యగు గోద "తిరుప్పావై" "నాచ్చియార్ తిరుమొళి" అను రెండు ప్రబంధములను స్వానుభవపరీవాహరూపములైన వానిని భక్తజన భాగధేయఫలముగ అనుగ్రహించినది. విఖ్యాతిశాయి ప్రసిద్ధిగల "తిరుప్పావై" దివ్యప్రబంధమును గూర్చి వేరుగ నుడువవలసిన పనిలేదు.

లోకమాతయగు శ్రీగోదాదేవివైభవప్రకాశకస్తోత్రములు సంస్కృతములో అనేకములు కలవు (తెలుగులో సాహితీసమరాంగణసార్వభౌముడైన శ్రీకృష్ణదేవరాయలచే విరచితమైన "ఆముక్తమాల్యద" ప్రబంధము ప్రసిద్ధమైనది) అందులో తలమానికము ప్రాచీనాచార్యపుంగవులు అసమానకవితాధురీణులునైన శ్రీవేదాంతదేశికపాదులు అనుగ్రహించిన గోదాస్తుతి. 29శ్లోకములతో కూడిన ఈస్తోత్రమునందలి శబ్దార్థసౌష్ఠవము, భావనాపటిమ, మాధుర్యము—నాన్యతోదర్శనీయములు. దాని భోగ్యత సాహిత్యవేత్తలకే తెలియగలదు.

శ్రీగోదాదేవి వైభవాన్ని అనుభవించి దానిని కవితారూపమున వెలయించిన అర్వాచీన ఆచార్య పుంగవులలో శ్రీమాన్ వరింగంటి అప్పల దేశికులవారగ్రగణ్యులు. వీరు మౌద్గల్యవంశస్థులు. (ఈ వంశస్థులచే రచింపబడిన "తిరునామములు" ఆంధ్రదేశ ప్రసిద్ధములు.) శతాధికములైన శ్లోకరత్నములతో నొప్పారుచున్న ఈ స్తవమునందలి శబ్దార్థసౌష్ఠవము, భావనాపటిమ మధురాతిమధురము. "మోచా-రసాల-మధుదుగ్ధరసాతిశాయి, గోదాస్తవం కృతమిహాప్పలదేశికేన" అని కవియే తన స్తోత్రమును- అరటిపండు, తియ్యమామిడిపండు, తేనె, పాలు, వీని రుచులను అతిశయించినదని నుడివినాడు. ఈ స్తోత్రమును అనుభవించినవారికి ఈ కవిమాటలు యథార్థములని తెలియును.

ఈ కవిభావనాపటిమకు ఒక్క ఉదాహరణము :- "స్వతంత్రమై స్వేచ్ఛావిహారియైన శ్రీకృష్ణమత్తగజాన్ని తన విలాసశృంఖలలచే (గొలుసులచే) బంధించి, పరతంత్రునిగా చేసి, చేతనరక్షణముచేయునట్టిది గోదాదేవి". ఇట్టి ఆమెస్వరూపగుణములన్నియు ఈ స్తోత్రమున విశదముగ అనుభవింపబడినవి. "గోదాదేవి మన పాలిట పక్షపాతినియైయుండగ మన రక్షణలో మనము అన్వయింపనక్కరలేదు- గోదాదేవిని శరణుచొచ్చినచాలును" అనుట ఇందలి భావచమత్కారము.

ఈ కవి శిఖామణి ద్రావిడదివ్యప్రబంధ-తత్వ్యాఖ్యానగతములైన మధురభావాల్ని- తన స్తవంలో కూర్చినాడు. "ప్రకృతిమతాం" అను శ్లోకములో ఋషులకు, ఆళ్వార్లకు- పెరియాళ్వార్లకు-ఆండాళ్కు గల ఉత్తరోత్తర

రాతిశయము వివరింపబడినది. ఇది "తిరుప్పావై" మూవాయిరప్పడి" ఉప క్రమములో కలదు.

అట్లే "ఏషా ఖాషావదనకమలే" అను శ్లోకమున "ఆవు దాటపెయ్య యందు దూడ అని భ్రాంతిని పొంది పాలను ఇచ్చుచున్నట్లు, శ్రీహరి దాట పెయ్యలవంటి భక్తులయందు గోదాదేవి అను భ్రమను పొంది ఫలితమును ఇచ్చుచున్నాడు" అని వర్ణి పబడినది. ఈ విషయముకూడ తిరుప్పావై వ్యాఖ్యా సమున ఫలశ్రుతిలో శ్రీపరాశర భట్టారకుల రస్యనూక్తిగా వివరింపబడినది.

అట్లే "అతీత భగవజ్జనుర్విషయ" అను శ్లోకమున గడచిన భగవ దవతారములకు మంగళాశాసనము చేయుట - "గతజలసేతుబంధనము"గా వర్ణింపబడినది. ఇది కూడ పై వ్యాఖ్యానమున స్పష్టము.

ఈ స్తవములో గల మరికొన్ని అణిముత్యములు. "మతమిదమను రారే" అను శ్లోకమున, "భక్తిపంటకు నదీమాతృకము గోదాదేవి. భక్తిపంటను పండించువాడు శ్రీమన్నారాయణుడు. ఆ పంటను దుష్టజంతువులనుండి కాపాడు వారు భగవద్రామానుజులు."

ఇందలి ఉక్తిచమత్కారమును చూడవచ్చును. "వ్యక్తం మహాంతర మిదం" అను శ్లోకములో "లక్ష్మిని భగవంతుడు వక్షఃస్థలమున ధరించుచున్నాడు. నీవు ధరించినమాలను శిరసున ధరించుచున్నాడు. ఇదే నీకును లక్ష్మికిని గల అంతరము."

ఇందలి సామంజస్యమును కూడ అనుభవింపవచ్చును. "పటీభటో వా భ్రూకుటీభటో వా" ఇట్టి ఉక్తిచమత్కారాలు ఈ స్తవమున కోకొల్లలు.

ఈ స్తవమంతయు శబ్దార్థాలంకారమండితము. ఏ శ్లోకమును చూచి నను అందు అనుప్రాసమో, యమకమో, ఉపమయో, శ్లేషయో, ఉత్ప్రేక్షయో తది తరాలంకారములో గోచరించుచునే ఉండును. శబ్దార్థాలమీద కవికిగల అధికారము అట్టిది. ముఖ్యముగా శ్లేషాలంకారము ఈ కవి వాక్యమున చక్కటి స్థానాన్ని సంపాదించుకొనినదనుటకు "త్వాం విష్ణుచిత్తతనయాం సభసి ప్రరూఢాం" "విబుధాశ్రయణీయపాదపీఠాం" మున్నగు శ్లోకములే ఉదాహరణలు.

ఛందస్సు వాగ్దేవతకు పాదస్థానము. వివిధ వృత్తస్వీకరణముచే కవి సరస్వతీపదవిన్యాసవిలాసమును పాఠకులకు ప్రదర్శింపచేయును. భారవికవి కిరాతార్జునీయమున హిమాలయవర్ణనమున, మాఘమహాకవి శిశుపాలవధమున రైవతకాద్రివర్ణనమున వివిధవృత్తములను స్వీకరించి తమ కావ్యములకు చక్కని శోభను గూర్చినారు.

శ్రీ కూరేశమిశ్రుల వరదరాజ - సుందరబాహుస్తవములలోను, శ్రీ పరాశరభట్టపాదుల శ్రీ గుణరత్నకోశ - శ్రీ రంగరాజస్తవములలోను - వృత్తవైవిధ్యము కలదు.

శ్రీమాన్ అప్పలదేశికులవారు కూడ ఈ స్తవమున ప్రసిద్ధములైన శార్దూల-వసంతతిలకాదులనేగాక - పృథ్వీ-నర్కుటక-శిఖరిణీ-ఔపచ్ఛందసికాది వృత్తాలనుకూడ స్వీకరించుట వీరి కవితారచనామార్మికతకు నిదర్శనము.

పై కారణముచే కొంచెము ప్రౌఢమని చెప్పదగి, సర్వాంగసంశోభితమైన ఈ గోదాస్తవము సంస్కృతములో సామాన్యపరిచయముకలవారికి పూర్తిగ తెలుగుమాత్రమే తెలిసినవారికి ఆస్వాదింప నసాధ్యము కావున, వారందరికి, విశేషజిజ్ఞాసువులైన పండితులకు, ఇందలి భావములు హృదయస్థములు కావలయునను తలంపుతో ఉ. వే. శ్రీమాన్ కందాడై వేంకట రామనరసింహాచార్యస్వామివారు (లెక్చరర్-ఓరియంటల్ కాలేజి-పత్తేపురం) మూలశ్లోకములకు సరళాంధ్రమున భావములనే గాక అందలి విశేషములను కూడ వివరించియున్నారు, ఆవశ్యకములైన స్థలముల ప్రాచీనాచార్యులయొక్క శ్లోకములను కూడ ఉట్టంకించి పాఠకులకు మహోపకారము గావించినారు.

ఇంతకు పూర్వము ఈ వ్యాఖ్యాత- శ్రీగుణరత్నకోశ-స్తోత్రరత్న-గద్యత్రయములకు సులభసుందరవ్యాఖ్యలుచేసి వానిని ఆంధ్రసరస్వతికి కంఠభూషలను గావించినారు. అందు ముఖ్యముగ శ్రీగుణరత్నకోశశ్లోకవివరణము రాష్ట్రేతర పండిత ప్రశంసలను కూడ పొందినదనుట ప్రసిద్ధము. కావున వీరి వ్యాఖ్యాన సామర్థ్యమును గూర్చి ప్రత్యేకముగ నుడువపనిలేదు. "నామూలం లిఖ్యతే కించిత్-నానపేక్షితముచ్యతే" అను మల్లినాథసూరిసూక్తికి గల సార్థకతను వీరి వ్యాఖ్యలలో చూడవచ్చును.

"కర్ణానురోధిచరితాం," "పద్మాతిశాయినయనం" మున్నగు శ్లోకము లకు వీరు చేసిన వివరణము మూలమునకు జీవాతువు. ఎంతటి ప్రౌఢశ్లోకాని కైనా సరళమైన వివరణచేయుట వీరి సొమ్ము. దీనికి పాఠకులే ప్రమాణము. శ్రీమాన్ అప్పుల దేశికులవారి కృషి వీరి వివరణముతో ఫలించినదనుట సమంజసము.

గోదాశ్రీరంగనాథులు ఈ సరళవ్యాఖ్యాతనుండి మరికొన్ని వ్యాఖ్యాన ములనుకూడ స్వీకరింతురుగాక.

నరసాపురం,

25-10-88

ఇట్లు

బుధజన విధేయుడు

కె వెంకటాచార్యులు

విద్యాప్రవీణ - భాషాప్రవీణ
శ్రీ ఆచంట వెంకట సీతారామమూర్తి
Sr. Lecturer, L.B.S.Govt. Oriental Degree College
China Nindra Kolanu

శ్రీగురుభ్యోనమః
లక్ష్మీహయగ్రీవాయ నమః

# అభినందన

శ్రీమాన్ మరింగంటి అప్పలదేశిక కవీన్ద్రులు శ్రీగోదాస్తోత్రమును రచించి అద్యతన విశిష్టాద్వైత కవులలో అగ్రేసరులయిరి. శ్రీగోదాస్తోత్రము సంస్కృతభాషలో రచింపబడుటచే పండితులకు మాత్రమే గ్రాహ్యమగుచున్నది. మృదుమధురమై రసభరితమైనట్టి ఈ గోదాస్తోత్రమును ఆంధ్రదేశములోగల సమస్తమైనవారును చదివి అర్థము చేసికొనుటకై శ్రీమాన్ కందాళ వెంకటరామ నరసింహాచార్యులుగారు తమ పాండితీప్రకర్షతో రమణీయముగా సరళముగా తెలుగులో వివరణ వ్రాసిరి. సౌరభమను పేరుతో వ్రాసిన ఈ వివరణము సర్వ జనమనోరంజన మగుటలో సందేహలవమైనను లేదు. శ్రీమాన్ ఆచార్యులవారు ఇంతకుముందే శ్రీగుణరత్నకోశ, ఆళ్వందార్‌స్తోత్ర, గద్యత్రయములకు సరళములగు వివరణలుచేసి పాఠకలోకమునకు సుపరిచితులై యున్నారు.

శ్రీగోదాస్తోత్రములోని మూలశ్లోకములను వివరించునపుడు వివరణకర్తలగు శ్రీమాన్ నరసింహాచార్యులుగారు చేసిన కృషి మిక్కిలి ప్రశంసనీయము. ఈ వివరణమును ఆమూలాగ్రము చదివినచో విశిష్టాద్వైతసంప్రదాయమునకు చెందిన గ్రంథములనెన్నింటినో వీరు పరిశీలించినట్లు విశదమగుచున్నది.

ఉదా :— మొదటి శ్లోకములో పన్నిద్దఱాళ్వారుల చరిత్ర, 15, 33, శ్లోకములలో వేదాంతదేశికుల గోదాస్తుతి, అట్లే అచ్చటచ్చట శ్లోకములలో సందర్భానుసారముగా విష్ణుసహస్రనామస్తోత్రము, శ్రీపరాశరభట్టరుల శ్రీగుణరత్నకోశము'

ఇంకా అళ్వందార్‌స్తోత్రం యతిరాజవింశతి, యతిరాజసప్తతి, కులశేఖరుల ముకుందమాల మొదలగువానినుండి శ్లోకములను ఉట్టంకించుచు, తులనాత్మకముగా వివరించిన పద్ధతి హృదయాహ్లాదకరమైనది. వీరి పరిశీలనా నైపుణ్యము అనితరము-అయా శ్లోకములవద్ద భావానుగుణముగా గోదాఅష్టోత్తరశతనామస్తోత్రములోని నామములను కూర్పుటకూడ సముచితముగానున్నది.

అంతేగాక వీరు అలంకారశాస్త్రములో పరమనిష్ణాతులనుటకు 108 శ్లోకములలోను వీరు ప్రదర్శించిన వివిధాలంకార పాండిత్యము, వివిధ ఛందోవిశేషములు, నిదర్శనములు—ముఖ్యముగా-"స్మితాతిరసచంద్రికాం" అను 78వ శ్లోకముయొక్క వివరణము పరిశీలించినచో శ్రీమాన్ నరసింహాచార్యులుగారి పాండితీప్రతిభా విశేషము విదితము కాగలదు. గోదాదేవియొక్క స్మితమే చంద్రునియొక్క వెన్నెలగా మారినది. ఇచట పరిణామాలంకారము. ఓషధీనాం పతిః—చంద్రుడు-వైద్యుడు-అర్థశ్లేష-"స్మితాతిరసచంద్రికా"-రూపకము. ఈ శ్లోకములో రూపక-పరిణామ-ఉత్ప్రేక్షా - పహ్నవ-శ్లేష - సమాసోక్తులను ఆరు అలంకారములు నిరూపింపబడినవి. ఇట్లు ప్రతిశ్లోకములో అలంకారనిరూపణము, వృత్తినిరూపణము, విశేషార్థనిరూపణము మిక్కిలి ప్రశంసనీయము.

అట్లే "పలాశమృగసంకులం" అను 80వ శ్లోకమును వివరించునపుడు కాళిదాసుని కుమారసంభవ శ్లోకములతోను, "మమ మతిరుపదేశైః"-అను 99వ శ్లోకమును వివరించునపుడు భవభూతి ఉత్తరరామచరిత్రలోని శ్లోకముతోను సరిపోల్చి చెప్పుటలో వీరికి గల సాహిత్య ప్రతిభావ్యుత్పత్తులు, తులనాత్మక పరిశీలన వ్యక్తమగుచున్నవి.

వీరు ఆంధ్రవివరణముతో వ్రాసిన ఈగోదాస్తోత్రము యావదాంధ్రదేశముననే గాక భారతదేశము నందంతటను కూడ ప్రశంసాపాత్రముకాగలదని నా దృఢవిశ్వాసము.

మిత్రులు శ్రీ నరసింహాచార్యులుగారికి శ్రీగోదాదేవి ఆయురారోగ్యాదికములను ప్రసాదించును గాక-ఇట్టి ఎన్నియోస్తోత్రములను తెలుగులో అనువదించి వీరు భక్తలోకసముద్ధరణకు తోడ్పడగలరని ఆశించుచున్నాను.

చిననింద్రకొలను
1-12-1989

ఇట్లు
బుధజనవిధేయుడు
ఆచంట వెంకట సీతారామమూర్తి



"కవితా వనితా చైవ స్వయమేవాగతా వరా."

అను రీతి కవితామతల్లికి అలవడుట అనుగ్రహప్రసాదజన్యము. కవిత్వమున ముఖ్యము భక్తిజ్ఞానవైరాగ్యములచే పాకాదు లలవడుట, దానిచే భగవదానందము కల్గుట. అట్టి భక్తిప్రధానుని కవిత్వమున్నట్లు తదితరుల కుండదనియే కవితాలోక సిద్ధాంతము. ప్రాసాదులు అభ్యాసాయత్తములు, పాకాదుల జన్మాయత్తములున్ను అని వాడుక.

శ్రీమదప్పల దేశికులు హయగ్రీవావతారం, కవిత్వం వారిని తనంతట తానే వరించినదని వారి కవిత్వమే చెప్పుచున్నది. ఆ ప్రవాహము సంస్కృతం అయినా, ఆంధ్రం అయినా ఆశువుగా పొంగిపొరలేదే కాని ఇతరము కాదు.

వీరి తిరునామములను కొన్నింటిని సేకరించాము. వానిని పూర్వము నుండి మా తండ్రిగారుకూడ అనుసంధించేవారు. పండితులనుకూడ ఉత్రూతలూగించిన వీరి కవిత్వంగురించి ఏమని చెప్పాలి? పాఠకులే చదివి అనుసంధించాలి.

ఖమ్మం,
25—1—1990

ఇట్లు
న. చ. జగన్నాథాచార్యులు

శ్రీమాన్ N.C. రామానుజాచార్య M.A. ఖమ్మం.

# కవిపరిచయము

"గోదాస్తవ"మ్మను ఈ శతపత్రకుసుమము అమ్మవారి రూపగుణ కరుణాది అనేక విశేషములను చిత్రీకరిస్తూ రచించిన దివ్యగ్రంథము. మౌద్గల్య వంశకలశాబ్ధి సుధాకరులైన కీ.శే. శ్రీమాన్ మరింగంటి అప్పలదేశికులవారు దీనిని రచించారు. "మోచారసాల మధు దుగ్ధరసాతిశాయి" "మరంద కదళీ మధురసాల...... మదకదంబక పూరితా" (స్వాదు ఫలములు-తేనె, పాలు, వీటి రుచిని మించి మధురమైన దీ కృతి) అని తమ స్తోత్రములలో తామే స్తుతించిన దానిని గూర్చి మనం వ్రాసేది ఏముంటుంది? ఇంతవరకు అన్ని శ్లోకములలో ఈ స్తుతిని వ్రాసినవారెవరును లేరు.

శ్రీమాన్ అప్పలదేశికులవారు పరాశరభట్టరు, వేదాంతదేశికుల కోవకు చెందిన ఉత్తమ శ్రేణి శేముషీ ధురంధరులు నల్గొండజిల్లా, కోదాడ సమీపమున నున్న "నరసింహపుర" కుగ్రామం వీరి స్వస్థలం. మరింగంటి వంశనామాన్ని పాండిత్యానికీ కవిత్వాదులకూ ఆచార్యపీఠానికీ పర్యాయపదముగా స్థాపించిన ఘనత వీరిదే. ఆనాటికి ఈనాటికి "ఈ వంశనామం కవులకు పండితులకు అత్యంత ఆదరణీయం" అంటే అతిశయోక్తి కాదు.

కవులలోను పండితులలోనుకూడ, శ్రేష్ఠులై భగవత్ భక్తులైన వీరు తమ కవిత్వాన్ని ఐహలౌకిక విషయములకు కాక శ్రియఃపతికే అంకితం చేశారు. ఆశువుగా అనర్గళంగా పొంగిపొరలే వాక్ఝురి వీరిది. "జీవః కోవా భువి కవయితుం మత్సమృద్ధిం సమర్థః?" (శ్రీరాముని తప్తజాంబూనద పదపద్మద్వంద్వము అధ్యక్షీకృతమయ్యెను. సదాచార్యోపదేశములతో నా జన్మము సార్థకమగుటయే గాక మామక పూర్వార్జిత సుకృత దుష్కృత పరంపరలుకూడ దూరముగా సముత్క్షిప్తములైనవి. అట్టి శ్రీరాముని పాద యుగ్మమును సాహితీరూపమున అభివర్ణించుటలో కలుగు నిర్భరానందమునందు

ఊయల లూగుచున్న నాతో ఈ పృథ్విని కవితాసమృద్ధిని ఢీకొనగల వారెవరు?" అని శ్రీరామపాదస్తవంలో ప్రతినబూనటం వారికే తగినది. ఈ విషయమునే మా అన్నగారైన కీ శే. పార్థసారథిస్వామివారి సంస్కృత వ్యాఖ్యకూడ బాగుగా వివరించినది.

"కవి అంటే వేదాంతదేశికులే, తక్కినవారు నామమాత్రం, "ఈగపులి" వంటివారే" అనెడి శ్రీవాసుదాసుస్వామివారి సూక్తి ఈ దేశికులకుకూడ అన్వయించి వీరిని వారి సరసన నిలబెట్టుంది. "వారంతటివారు రెండవవారు మృగ్యులే" అను యామునమునుల సూక్తికూడ వీరికి అన్వయిస్తుంది.

కావ్యాలనుండి వేదాంతము వరకు, ద్రావిడ ప్రబంధాలు-పూర్వాచార్యుల వ్యాఖ్యలు-ఇంకా ఎన్ని గ్రంథములను అపోశనం పట్టారో - అన్నీ కూడ కరతలామలకమైన అంతులేని అసాధారణ ప్రజ్ఞ వీరిది. వారొక సంచార గ్రంథాలయం. సాక్షాత్తు సరస్వతీదేవియే స్వామివారి తిరుమాళిఘ వెలుపల ప్రతిరోజూ కలాపుచల్లి వెళ్లేదని ఆబాలగోపాలం చెప్తారు. వీరి నాలుకపై సరస్వతియే పలుభంగుల వింతవింతతాళముల విజృంభించి నాట్యమాడిందని అనుటలో శ్రీ నిగమాంత దేశికులవారి ఫలశ్రుతియే ప్రమాణము.

మరింగంటి వంశీయుల, అందునా ప్రధానంగా అప్పలదేశికుల, కృతులైన తిరునామములు (మంగళహారతులు) జగత్ప్రసిద్ధములు. మా ఆచార్యులు ఉ వే. శ్రీమాన్ దాశరథి వెంకటాచార్య స్వామివారు "తిరువాయ్‌మొళి" కాలక్షేపం ముగించి, వీరి తిరునామములలోని ఒక పాదం ఉదాహరిస్తూ ఆనాటి కాలక్షేప సారం మొత్తం ఆ ఒక్క పాదంలో నిక్షిప్తమయిందని చెప్తూ పుండేవారు. అందుకొన్నింటిని మా సోదరులైన ఉ.వే. శ్రీమాన్ న.చ.జగన్నాథాచార్యస్వామి(ఖమ్మం)వారు సేకరించి ఈ గ్రంథమున ముద్రించుటకై వారి అభిప్రాయముతో పాటు పంపియుండిరి. వానియందలి స్వారస్యమును రసహృదయులైన పాఠకులే ఆస్వాదింతురుగాక.

ఈ కవిశేఖరులు "పాకశాస్త్రంలోకూడ దిట్ట" అని ప్రసిద్ధి. జీడికల్లు గ్రామానికి సంచారరూపంగా వేంచేసి దేవాలయంలో విడిదిచేసిన సందర్భమున

అక్కడి రామునికి స్వహస్తములతో "పులిహోర" ప్రసాదములు ఆరగింపు చేసిరట. అంతే ఆ భోగ్యతను వదలలేక ఆ రాముడు జీడికల్లునుంచి సపరివారంగా వీరిని వెంటబడించి వచ్చాడనీ ఆ రాముడే నృసింహపురంలో వెలసిన రాముడనీ వీరి వంశపువారు చెప్తుంటారు. ఇంకా వీరి విషయంలో ఆనూహ్యమైనవి ఎన్ని ఉన్నవో ?

ఇంతటి మహనీయులకూడ తమ ఘనతకు సదాచార్యుల శీతల దృక్కులే కారణమని వినయముగా-

"అస్మద్గురుభ్యో ఽస్తు నమో
యత్ ప్రసాద ప్రభావతః,
రామః ప్రసన్నో నః సాక్షాత్
వాంఛితాదధికప్రదః"

ఈ రామ పాద స్తవపు ప్రథమశ్లోకంలో చెప్పుకొన్నారు.

షుమారు రెండు మూడు వందల సంవత్సరాల పూర్వపువారైన వీరు ఈ స్తవాన్ని రచించి మనతరంవారికి "పైతామహధనంగా" ఒక గొప్ప నిక్షేపాన్ని ఇచ్చారు. నృసింహపురంలోని పెద్దరామాలయంలో గోదాసన్నిధిలో శ్రీ దేశికుల వారి సాహిత్యాన్ని లభ్యమైనంతవరకు సేకరించి, వేంచేపచేసి, వారి వంశజులు, తిరువారాధనతో పాటు, ఆ శ్రీ కోశాదులకు కూడ ధూప దీపాదులను 80 సంవత్సరముల పూర్వమువరకు సమర్పించెడివారట. కలియుగ ప్రభావమేమో ఆ గ్రంథములలో కొన్ని మూషికములపాలై, మిగిలినవి కోనేటి పాలైనవని మా మామగారైన కీ శే శ్రీమాన్ బూరుగడ్డ రామానుజాచార్యుల వారు చెప్తుండేవారు. ఇటీవల ఆలయములోని విగ్రహములుకూడ అపహరింప బడినట్లు విన్నాము. దేవాలయం పునర్నిర్మాణం చేసికోవచ్చు, విగ్రహాలు ప్రతిష్ఠించుకోవచ్చు. కాని సాహిత్యం ఎవరిస్తారు? అది పూరింపబడని అగాధంలాగానే ఉండిపోతుంది.

శ్రీమాన్ అప్పలదేశికులవారి వంశంలోని ఇటీవలి పండితుల పరిచయం కూడ ప్రకృతమే అవుతుంది. శ్రీమాన్ చెన్నమాచార్యులవారు కూర్చున్న చోటు

నుంచి అంగుళంకూడ కదలకుండ భగవద్విషయ రామాయణాదులు తిరుప్పావు వ్యాఖ్యానిస్తూ గంటలతరబడి ఉపన్యసించితే శ్రోతలు తన్మయులై భగవద్గుణా లకు, అమ్మవారి కరుణా వాత్సల్యాదులకు, మైమరచి ఆర్ద్రతను పొందేవారట.

శ్రీమాన్ మరింగంటి సింగరాచార్యులవారు రోజుకొక ప్రబంధం వ్రాసే ప్రజ్ఞ కలవారు. ఏ దేశ మేగినా ఏక్షేత్రం సందర్శించినా అచ్చతెలుగులో సులభశైలిలో అందరిచేత (స్త్రీలు-బాలురుకూడ) నిత్యం అనుసంధించ తగిన విధముగా కమ్మని ఒక తిరునామం సాయించి అంకితం చేసేవారట.

వీరి తరువాతివారైన ఈ వంశకవులందరు భగవత్సమానులైన శ్రీమదప్పలగురువులకు "దాసోహ"మ్మనినవారే.

సుప్రసిద్ధకవులు అష్టావధానులుకూడనైన కీ. శే ఉ వే. శ్రీమాన్ బూరుగడ్డ రామానుజాచార్యులవారు నష్టమైన వీరి సాహిత్యాన్ని గురించి చాలా బాధపడుతూ ఉండేవారు. వారు స్వయంగా వ్రాసికొని "లైబ్రరీ"లో భద్ర పరచుకొనినదే ఈ స్తవం. ఇట్టి దివ్యగ్రంథమును-అందునా గోదాదేవిస్తోత్రమును భద్రపరచినందులకు మామగారైన శ్రీమాన్ బూరుగడ్డ రామానుజాచార్యుల వారు ఎంతైనా అభినందనీయులు.

పోయిన వాటికి విచారించక ఉన్నవాటినైనా భద్రపరచటం ముఖ్య మనీ, మూలాన్నే ముద్రింపించి ప్రచారంచేస్తే బాగుంటుందనీ, భావించి ఈ కార్యక్రమం చేపట్టాను. కొన్నివందల తిరునామములు కూడ సేకరించి ఉంచాను, ఈప్రయత్నంలో మా భ్రాతృమూర్తి శ్రీమాన్ పుల్లగుమ్మి శ్రీనివాసాచార్యులు గారు కూడ నాకు సహకరించారు.

ఈ గోదాస్తవంలోని శ్లోకాలను ముద్రణకు పూర్వం డా. P. S. శాస్త్రి (నాగపూర్) గారికి పంపగా వారు ఒక్కొక్క శ్లోకాన్ని బాగుందని ప్రశంసిస్తూ "ఇవి అమృతమయ్యే జాతిరత్నాలు, ఒకదానికొకటి తీసిపోని ఉత్తమశ్రేణికి చెందినవి" అని వ్రాశారు. మనవారికి కూడ శ్రద్ధగా పుస్తకాలు పంపించాను, చేతికందించాను. ఒక్కరినుండి కూడ సమాధానం రాలేదంటే ఆశ్చర్యపడాలా? బాధపడాలా??

ఈశ్లోకాలకి విపులమైన వ్యాఖ్యానం కావాలనే, వాటి మహదర్థాన్ని ఆకళింపుకోవాలనే, నా బలీయమైన కోరిక-నా పూర్వజన్మవిశేషమో ఏమో దాసునికి శ్రీమాన్ కందాళ వెంకటనరసింహాచార్యులవారితో మైత్రి సంభవించి - సఫలమయ్యింది.

శ్రీమాన్ ఆచార్యులవారి "శ్రీగుణరత్నకోశ"- "రత్నదీపికా" వ్యాఖ్యను చూచి, గోదాస్తవ వ్యాఖ్యకు కూడ వీరే సమర్థులని తలచి, నేను విన్నపం చెయ్యగానే దాసుని అదృష్టమేమో వెంటనే అనుమతిస్తూ, కేవలం వ్యాఖ్యానము వ్రాయుటయేగాక తిరుమల తిరుపతి దేవస్థానమునుండి ఆర్థిక సహాయమును సంపాదించి, పండితుల అభిప్రాయము సేకరించి, స్వంత పుస్తకము మాదిరి ముద్రణ భారమునుగూడ వహించి, ఎన్నో శ్రమలకోర్చి పూర్తి కావించినారు. వారి ప్రయత్నాలను ఎప్పటికప్పుడు నాకు తెలుపుతూ ఉండేవారు. నా కోరిక తీరదని నిరాశచెందిన తరుణంలో ఈ పుస్తకానికి ఇంతటి దివ్య రూపాన్ని ప్రసాదించి శ్రీమాన్ ఆచార్యులవారు నన్ను కృతకృత్యుణ్ణి చేయటం నా అదృష్టంగా భావిస్తున్నాను.

కవుల హృదయాలను కవులే గ్రహిస్తారు. వజ్రం విలువ వజ్రానికే తెలుస్తుంది. పద్యాన్ని ఊహించి అక్షరరూపశిల్పంగా మలిచి పండితులకు ఆమోద యోగ్యంగా చెయ్యటం సామాన్యవిషయం కాదు.

ఈ రోజుల్లో కమ్మని కవిత్వం వ్రాసేవారే తక్కువ. అందునా సంప్రదాయ కవిత్వం అంటే దుర్భిణీతో వెతకవలసినదే. వ్రాసిన సామగ్రి చాలా ఉన్నది. చదవాలి-ఆనందించాలి-దాన్ని పరిరక్షించటం కష్టం. అట్టి Ready Made సాహిత్యాన్ని ఉన్నదానిని ఉన్నట్లు భద్రపరచటం చాలా పుణ్యవిశేషం. గోదా గ్రంథమాల వ్యవస్థాపకులైన శ్రీమాన్ K. T. L. నరసింహాచార్యులవారు ఆశీర్వదించి సంపూర్ణంగా సహకరించారు. శ్రీమాన్ బూరుగడ్డ అళహసింగరాచార్యులవారుకూడ నా ఈ ప్రయత్నంలో చేయూత నిచ్చి ఆశీర్వదించారు. ఎందరెందరో అండగా నిలచి తోచినవిధంగా సహాయపడి ఇంతటి గొప్పకార్యాన్ని సఫలం చేసినందుకు సదా కృతజ్ఞుడను.

ఇక చివరగా దేశికులవారి ఈశ్లోకంతో ముగిస్తాను.

"విద్యాశిల్పప్రగుణమతినా....

..... ....చక్షురుజ్జీవ్య సన్తః"

(సరస్వతియొక్క సమస్త విద్యలనభ్యసించి, రత్నాలనే సానబెట్టే నైపుణ్యం సంపాదించి, దానివల్ల కుశాగ్రబుద్ధికలిగి, అట్టి బుద్ధికి తట్టిన ఆలోచనలతో వ్రాసి, మాటిమాటికి సానబెట్టి, ఎల్లప్పుడూ అనుసంధానం చేస్తూ కవినే చుట్టుముట్టుతూ సాగిన ఈగోదాస్తవశ్లోకాలు మనకందరకు మంగళము చేయుగాక") అని

స్తంభాద్రి
(ఖమ్మం
28-1-1990

ఆండాళ్ తిరువడిఘళే శరణమ్
శ్రీమదప్పుల గురవేనమః
ఇట్లు
రామానుజదాసః

# వినయాంజలి

శ్రీగుణరత్నకోశముయొక్క రత్నదీపికా వ్యాఖ్యను దాదాపు 5 సంవత్సరముల క్రిందట నావద్ద నుంచి తెప్పించుకుని, ఖమ్మం వాస్తవ్యులగు శ్రీమాన్ యస్. సి రామానుజాచార్య స్వామివారు-ఉ. వే. శ్రీమాన్ మరింగంటి అప్పలదేశిక కవివర్య విరచితమై, వీరిచే మూలము మాత్రము ముద్రింపబడిన ఈ గోదాస్తవమును పంపుచూ, దీనికికూడ "శ్రీగుణరత్నకోశమునకు"వలె విపులమైన వ్యాఖ్య వ్రాయవలసినదిగా ఆజ్ఞాపించియున్నారు.

అందు అనేకశ్లోకములు పాదరహితములుగను సందేహాగ్రస్తములుగను ఉన్నవనియు, వీలైనంతవరకు పరిష్కరించి వ్రాయుటకు ప్రయత్నించుడనియు వారి ఆజ్ఞ. వెంటనే నేనువారికి "దీని లిఖిత ప్రతి ఎవరివద్దనైనను దొరుకునేమో ప్రయత్నింపుడనియు" అట్లే దీనికి ఇంతకుముందెవరైనను ఏ భాషలోనైనను వ్యాఖ్య వ్రాయుటకు ప్రయత్నించిరేమో తెలిసికొను"డనియు విన్నవించుకొని యుంటిని. దానికి సమాధానముగా వారు "లిఖితప్రతులు ఎక్కడను లేవనియు-వ్యాఖ్యకు కూడ ఏ భాషలోను ఎవరును ప్రయత్నించలేదనియు కాబట్టి ఏ విధమైన ఆధారములు లేవనియు" కూడ తెలియచేసి యుండిరి.

ఇక చేయునదిలేక వారి ఆజ్ఞను తిరస్కరించలేక ఏవిధమైన ఆధారములు లేకపోయినను ఈ గోదాస్తవమునకు "మందః కవియశఃప్రార్థీ" అని కాళిదాస మహాకవి చెప్పినట్లుగా, బహుసాహసోపేతుడనై, యథామతి భావములను మాత్రము వ్రాయుటకు ప్రయత్నించి, అందులకై సోదరుల సహకారమునుకూడ పూర్తిగ ఉపయోగించుకొని "సౌరభము" అనుపేర భావములు వ్రాసియుంటిని.

ఆ తరువాత "కేవలము తాత్పర్యములేగాక-కొద్దిగ వివరణ కూడ ఉంటే బాగుంటుందని," "అలంకారములు ఛందస్సు మొదలగు విశేషములను కూడ తెలిపితే బాగుంటుందనీ," ఇత్యాదిగ సూచనలు వచ్చుట గమనించి, యథాశక్తి వాటిని కూడ చేర్చుట జరిగినది. ముఖ్యముగా శ్లోకములవద్ద ఆ యా

శ్లోకములకు సరిపడు "గోదాఅష్టోత్తర శతనామస్తోత్రము"లోని నామములను, అట్లే మరికొన్ని స్తోత్రముల వాక్యములను, శ్లోకములనుకూడ చేర్చుట జరిగినది.

శ్లోకములలోకూడ సంకల్పానుసారముగా అనేక మార్పులుచేసి ఏయే శ్లోకములలో ఏయే మార్పులు నీయబడినవో ఒక పట్టికనుకూడ తయారుచేసి ఈ వ్యాఖ్యయొక్క ప్రతులను ఖమ్మం శ్రీమాన్ N. C. రామానుజాచార్య స్వామివారికిని, నెల్లూరు ఉ.వే.శ్రీమాన్ K.S.రామానుజాచార్య స్వామి వారికిని నరసాపురం ఉ.వే.శ్రీమాన్ K.వెంకటాచార్య స్వామివారికిని, పెంటపాడు ఉ.వే.శ్రీమాన్ N.V.L.N. రామానుజాచార్య స్వామివారికిని పంపుకొనియుంటిని.

వెంటనే ఉ వే. శ్రీమాన్ K.S.రామానుజాచార్య స్వామివారు (నెల్లూరు) మరికొన్ని సవరణలను సూచించుచు వారి అభిప్రాయము (అనుమోదము)ను కూడ 1986 నవంబరులోనే ఇచ్చియుండిరి. అటుల ఉ.వే.శ్రీమన్ K.వెంకటాచార్య స్వామివారు (నరసాపురం), ఉ.వే.శ్రీమాన్ N.V.L.N. రామానుజాచార్య స్వామివారు (పెంటపాడు), కూడ కొన్ని సూచనలతోపాటు ఆయా శ్లోకములకు సంబంధించిన ద్రావిడ ప్రబంధములలోని విశేషములనుకూడ తెలిపియుండిరి.

సోదర చి.సౌ. హేమాబ్జవల్లి అట్లే శిష్యుడు చి. ఘంటసాల ఓంకార మూర్తిజీ శుద్ధప్రతులను తయారుచేయుటలో సహకరించిరి.

ఈ ప్రయత్నమిట జరుగుచుండగా ఖమ్మం నుంచి శ్రీమాన్ N. C. రామానుజాచార్యస్వామివారు "వారిస్తోత్రమును వరంగల్లు వాస్తవ్యులు కవి శాబ్దికకేసరులు ఉ వే శ్రీమాన్ S. N. C. రఘునాథాచార్యస్వామివారికి పంపినట్లును అందులో(మూలమున) కొన్ని దోషములున్నవని వారు చెప్పినట్లును వ్రాసియున్నారు. అప్పటికి నాకొక ఆధారము దొరికినదని సంతోషించి, వెంటనే
...నుబట్టి ఉ. వే. శ్రీమాన్ రఘునాథాచార్యస్వామివారి వద్ద ఈ
...పరిష్కరింపచేసిన తరువాతనే దీని ముద్రణకు తగిన

ప్రయత్నము చేయవచ్చు''నని, శ్రీమాన్ N. C. రామానుజాచార్యులవారికి (ఖమ్మం) తెలియచేసి, అక్కడకు నా బాధ్యత నెరవేరినట్లుగా భావించితిని.

ఈలోగా నా "ఆళ్వందార్''స్తోత్ర "గద్యత్రయ'' వ్యాఖ్యలు వెలువడినవి. కాని ఖమ్మం స్వామివారినుంచి ఏవిధమైన సమాచారము లేకపోవుటచే వారు కార్యాంతర వ్యగ్రులై యుందురని భావించి, 1988 జూలై నెలలో ఉ. వే. శ్రీమాన్ N. V. L. N. రామానుజాచార్యస్వామివారు వరంగల్లు వెళ్ళుచుండగా వారితో ఒక ప్రతిని ఉ. వే. శ్రీమాన్ రఘునాథాచార్యస్వామివారికి పంపుకొనియుంటిని.

నా అదృష్టవశమున వారివద్ద ఈ స్తవముయొక్క లిఖితప్రతి యున్నది. నేను పంపినదే తడవుగ వారు తమవద్ద ఉన్న ప్రతితో శ్లోకములను సరిచేయుటయేగాక-భావ వివరణాదులతోకూడ ప్రత్యక్షరము పరిశీలించి, ఆయాస్థలములో "ఇది ఇలాకాదు-ఇక్కడ ఇంకా వివరణ కావాలి – ఇక్కడ భావము అస్పష్టముగా ఉన్నది'' ఇత్యాదిగా వారి అభిప్రాయమును నిష్కర్షగా చెప్పుచు ఆయాశ్లోకములవద్ద ఎయే విధముగ వివరణ చేసిన బాగుండునో ఆ సూచనలుకూడ చేసి ఉ. వే. శ్రీమాన్ T. K. V. అయ్యంగార్(వరంగల్లు)వారి ద్వారా ఆ గ్రంథమునాకు చేరు ఏర్పాటు గావించిరి.

(ఈ విధముగా ఉ. వే. శ్రీమాన్ రఘునాథాచార్యస్వామివారితోపాటు ఉ. వే. శ్రీమాన్ టి. కె. వి. అయ్యంగార్ వారికి కూడ శ్రమకలిగించితిని.)

అది అందిన వెంటనే అందలి వారి సూచనలు చూచుసరికి "దీనికి ఆధారముగా ఏమియు దొరకలేదే" అను సందేహము నివృత్తమైనది. తర్వాత వారి సూచనల ప్రకారము ఆ యా శ్లోక వివరణను సరిచేసి ఉ. వే. శ్రీమాన్ కిడాంబి వెంకటాచార్యస్వామి (నరసాపురం) వారి ఆమోదము(అభిప్రాయము)ను తీసికొని వరల ఉ. వే. శ్రీమాన్ రఘునాథాచార్యస్వామి (వరంగల్లు) వారికి ఒక ప్రతిని, శ్రీశ్రీశ్రీ త్రిదండి చిన్న శ్రీమన్నారాయణ రామానుజ జీయర్ స్వామి(సీతానగరం - విజయవాడ)-వారికి ఒక ప్రతిని, ఉ. వే. శ్రీమాన్ శ్రీభాష్యం అప్పలాచార్యస్వామి (విశాఖపట్టణం) వారికి ఒక ప్రతిని వారి

మంగళాశాసనములకొరకై ప్రపుకొనియుంటిని మా కళాశాల అధ్యాపక మిత్రమండలికి కూడ చూపి మాసహోపన్యాసకులైన శ్రీ అచంట వెంకట సీతారామమూర్తిగారి అభిప్రాయము(అభినంద)ను కూడ తీసికొంటిని.

శ్రీశ్రీశ్రీ జీయర్ స్వామివారు, కవితార్కిక కేసరి ఉ. వే. శ్రీమాన్ ఎస్. ఎన్. సి. రఘునాథాచార్యస్వామివారు, అట్లే ఉ. వే. శ్రీమాన్ శ్రీభాష్యం అప్పలాచార్యస్వామివారును- వారివారి మంగళాశాసనములను కటాక్షించిరి.

ఈ విధముగ అనేకమంది పెద్దలయొక్క మిత్రులయొక్క సోదరుల యొక్క మంగళాశాసనములతో, ఆమోదానుమోదములతో, అభినందనలతో సూచనలతో సహకారముతో ఈ సౌరభవ్యాఖ్య ఈ రూపమును పొందినది. ఇందులకై వారలకందరకు కృతజ్ఞతలను తెలియచేసికొనుచున్నాను.

కవితార్కిక కేసరులు ఉ. వే. శ్రీమాన్ S. N. C. రఘునాథాచార్య స్వామివారు ప్రతిశ్లోకమును పూర్తిగా పరిష్కరించుటవలన అంతకుముందు మేము చేసిన కొన్నిమార్పులపట్టికయొక్క అవశ్యకత లేకుండపోయినది. కావున ఆ పట్టికనిచట ఇచ్చుటలేదు.

ఇక శ్రీగోదావైభవమును గురించియు ఈ స్తవవైశిష్ట్యమును గురించియు ప్రముఖపండితుల మంగళాశాసనములు ఆమోదానుమోదములలో వారే తెలిపి యున్నారు. కావున ఆ ప్రయత్నమును నేను చేయుటలేదు. అయితే శ్రీమాన్ N C. రామానుజాచార్యస్వామి(అమ్మం)వారు తమ కవి పరిచయమున— ఈ కవిగారు 2, 3 శతాబ్దములపూర్వపువారయు, నల్గొండజిల్లా కోదాడకు సమీపమున నున్న "నరసింహపురం" వీరి, నివాసస్థలమనియు పేర్కొని, వారి యొక్క వారివంశపువారియొక్క గొప్పతనమును గురించి చెప్పి, వీరియొక్క కృతులనేకములు- దౌర్భాగ్యవశమున మూషికములపాలు, కోనేటిపాలు అయినవని బాధపడిరి.

వీరే వీరిచేముద్రింపబడిన మూలగ్రంథమున-ఈ కవివర్యులు అభినవ వేదాంతదేశికులు అని పేర్కొనిరి. ఈ స్తవమును పరిశీలించినచో అందు ఏవిధమైన అతిశయోక్తియులేదని తెలియనగును.

అట్లే ఒకప్పుడు వైష్ణవపత్రికలో ఉ. వే. శ్రీమాన్ S. N. C. రఘు నాథాచార్యస్వామివారు (వరంగల్లు) వారి అభిప్రాయము నిచ్చియున్నారు. (10-6-1963-వైష్ణవపత్రిక) అందువారు "ఈ కవులు అప్పలదేశికులు, నృసింహదేశికులు-అని ఇద్దరు సోదరులనియు, ఉభయభాషాపండితులు-ఉభయ వేదాన్తనిష్ణాతులు అగుటయేగాక-విశిష్టాద్వైతపరముగాను, సంస్కృతమునను, ఆంధ్రమునను కూడ శతాధిక గ్రంథకర్తలనియు-వారి గ్రంథములు ముద్రణకు నోచుకొనక ఖిలములై పోవుచున్నవనియు" వారి బాధను వ్యక్తముచేసిరి.

వీరు ప్రకృతము ఈ సౌరభవ్యాఖ్యను ఆమూలాగ్రము పరిష్కరించి తమ అభిప్రాయమును కూడ ఇచ్చియున్నారు. వీరు వీరి అభిప్రాయములో తెలిపినట్లుగా ఈ స్తవముయొక్క మూలశ్లోకములుకూడ చాలాకాలముక్రితమే వీరివద్దనే పరిష్కరింపబడుట విశేషము.

మరియు ఖమ్మం వాస్తవ్యులగు ఉ. వే. శ్రీమాన్ న. చ. జగన్నాథా చార్యస్వామివారు— వారి అభిప్రాయము నిచ్చుచు ఈ అప్పలదేశిక కవివర్య విరచితములైన తిరునామముల (మంగళహారతుల)ను కొన్నింటిని సేకరించి పంపియున్నారు. వాటి ఈ అభిప్రాయముల చివర ముద్రించుట జరిగినది. దీనికై వీరికి కృతజ్ఞతలను తెలిపుకొనుచున్నాను.

ఇక ఈ సౌరభవ్యాఖ్యముద్రణకువస్తే—మొదట్లో ఖమ్మం వాస్తవ్యులు శ్రీమాన్ N. C. రామానుజాచార్యస్వామివారు తామే ముద్రణకు ప్రయత్నింతు మని వారి అభిప్రాయమును వెలిబుచ్చియున్నారు. కాని చాలకాలమువరకు వారి వద్దనుంచి సమాచారము లేకపోవుటవలన-ఇంతకుముందే దాదాపు 27-28 సం॥నుండి పరిచయము కలిగియుండి-నా శ్రీగుణరత్నకోశవ్యాఖ్యకు వారి అభి ప్రాయమునిచ్చి, ఆళ్వందార్‌స్తోత్ర గద్యత్రయవ్యాఖ్యలను వారి గ్రంథమాల ద్వారా ముద్రింపించి మరింత సన్నిహితులైన ఉ. వే. శ్రీమాన్ K. T. L. నర సింహాచార్యస్వామివారిని, వారిచే నడుపబడుచున్న శ్రీ గోదాగ్రంథమాల ద్వారా దీనిని ముద్రింపించుటకు కోరియుంటిని—

ముద్రణయందలి సాధకబాధకములను మనమునందిడుకొని వారు ముందుకొద్దిగ సందేహించిరి. కాని తర్వాత వారే స్వయముగ వారి అంగీకార మును తెలిపిరి. అ తవరకు దీని ముద్రణకై సతమతమగుచున్న నేను పరమా నందభరితుడనై ఆ ఆనందపారవశ్యములో పరిష్కర్తలను అభిప్రాయప్రదాత లను కొద్దిగ త్వరపెట్టియుంటిని. దానికై మరల మరల ఆ యా పెద్దలక్షమను అర్థించుచున్నాను. అంత త్వరపడినను అనివార్యకారణములచే ముద్రణ ఆలస్యమే అయినది.

దీని ముద్రణ కేవలం గ్రంథమాలకు భారం అగునను ఉద్దేశ్యముతో తిరుమల తిరుపతి దేవస్థానం నుండి ఆర్థిక సహాయమును కోరితిని. వారును అతి ఉదారముగా ఆర్థిక సహాయము నొసంగిరి. తన స్తోత్ర సంపుటిని తన గ్రంథమాల ద్వారా ముద్రింపించుకొనుటకు గోదాదేవియే స్వయముగా శ్రీని వాసుని నుండి సహాయమును పొందినట్లు భావించితిని. కేవలం తిరుమల దేవస్థానమువారేగాక మరికొంతమంది ఉదారులుకూడ గ్రంథ ముద్రణలో పాటు గ్రంథమాలకు కూడ సహకరించిరి. ఆ విధముగా సహకరించిన వారి నామములను చివర ఉదహరించుట జరిగినది. ఈ విధంగా సహకరించిన తిరుమల తిరుపతి దేవస్థానం అధికార వర్గమునకును కార్య నిర్వాహణాధికారి వారికిని, ఈ విషయమున తమ సంపూర్ణ సహకారము నందించిన డా. S.B. రఘునాథాచార్యుల (తిరుపతి) వారికిన్ని విడిగా సహకరించిన ఉదారులకును ప్రత్యేకముగా కృతజ్ఞతలను తెలియచేసికొనుచున్నాను.

"అట్లేదీని ముద్రణకు అంగీకరించిన గ్రంథమాల వ్యవస్థాపకులు ఉ వే. శ్రీమాన్ K.T.L.నరసింహాచార్య స్వామివారికికూడ కృతజ్ఞతలను తెలియచేసి కొనుచున్నాను ప్రోత్సాహకులుగా శ్రీమాన్ N.C.రామానుజా చార్య స్వామివారికికూడ ప్రత్యేక కృతజ్ఞతలను తెలుపుకొనుచున్నాను.

దీనితో ఒకప్పుడు గోదాగ్రంథమాల ద్వారా "రత్నత్రయ"లో ప్రచు రితమైన కీ శే. నల్లాన్ చక్రవర్తుల తిరువెంకట సంపత్కుమార జగన్నాథా చార్య స్వామివారి గోదాస్తోత్రముకూడ భావములతో ప్రచురించుట జరిగినది.

వీరు ఆకాశవాణి విజయవాడ కేంద్రమున సుప్రసిద్ధ వయోలిన్ విద్వాంసులైన ఉ.వే. శ్రీమాన్ నల్లాన్ చక్రవర్తుల కృష్ణమాచార్య స్వామివారి పితృపాదు లగుటచే, ఆ భావములను వీరికి (విజయవాడ పంపి వీరిచే పరిష్కరింపచేసి తెప్పించుట జరిగినది. దీనికై వీరికికూడ కృతజ్ఞతలను తెలియచేసి కొను చున్నాను.

అట్లే వేదాంత దేశికుల గోదాస్తుతికూడ, ఉ వే శ్రీమాన్ K.V.రాఘవా చార్య స్వామి(రిటైర్డ్ తెలుగు లెక్చరర్-సిద్ధిపేట. ప్రస్తుత మకాం హైదరా బాదు) వారి విపులమైన పరిమళ వ్యాఖ్య భావములు మాత్రము స్వీకరించి, వారి అంగీకారముతో ఇందు పొందుపరుపబడినది. దీనికై వారికికూడ కృతజ్ఞతలను తెలుపుకొనుచున్నాము.

ఇంకను ఇందు గోదాచతుఃశ్లోకి భావములతో ఇవ్వబడినది. మరియు ఆయా శ్లోకములవద్ద ఇవ్వబడిన గోదా అష్టోత్తర శతనామ స్తోత్రముకూడ (నామావళితో) విడిగా ఇవ్వబడినవి. దానితో శ్రీరంగనాథ అష్టోత్తర శతనామ స్తోత్రము, పాంచరాత్ర లక్ష్మీతంత్రము నందలి లక్ష్మీ అష్టోత్తర శతనామ స్తోత్రము కూడ నామావళితో ప్రచురింపబడినవి.

అట్లే ఉ.వే శ్రీమాన్ K.S.రామానుజం (M.A) నెల్లూరు వారిచే ప్రకా శితమైన అథర్వణ రహస్యమునందలి లక్ష్మీనారాయణ అష్టోత్తర శతనామ స్తోత్రము - నామావళియు, శ్రీ దత్తస్తోత్ర సంపుటినుండి గ్రహింపబడిన భూదేవీ అష్టోత్తర శతనామములున్ను - ఇందు ప్రచురింపబడినవి. దీనికై కృతజ్ఞతలు తెలియజేసుకొనుచున్నాను.

మరియు ఉ.వే.శ్రీమాన్ K.S.రామానుజాచార్య స్వామివారి స్వీయ రచనయైన సువర్ణమాలినీ (అష్టలక్ష్మీ) స్తోత్రముకూడ వారి అంగీకారముతో ప్రచురించబడినది. ఈ విషయమునకూడ వీరికి కృతజ్ఞతలను తెలుపుకొను చున్నాను.

వీనితోపాటు మరికొన్ని అవశ్యపఠనీయములైన స్తోత్రములుకూడ ఇందు ప్రచురించబడినవి. పాఠకులు వాటిని ఉపయోగించుకొందురు గాక-యని మనవి.

మరియు ముద్రణయందలి సమస్తభారములను బాధ్యతలను తామే స్వయముగా వహించి ఈగ్రంథమును సకాలములో సుందరముగా ముద్రించి ఇచ్చిన శ్రీ R. K. ప్రింటర్సు, నాంపల్లి హైదరాబాదు వారికిన్ని ఈప్రయత్నములో సహకరించిన శ్రీకంభంపాటి సీతారామాంజనేయులు(లెక్చరర్ ఓరియంటల్ కళాశాల సికిందరాబాదు)వారికిన్ని, శ్రీవిల్లిపుత్తూరునందలి శ్రీగోదా శ్రీరంగనాథుల ఫోటోలను ముఖచిత్రమునకై ఇచ్చిన ఉ. వే. శ్రీమాన్ N.V.T.N.రామానుజాచార్యస్వామి(పెంటపాడు) వారికిన్ని, వాటిని అందముగా "బ్లాకు" చేసి ఇచ్చిన "DECCAN PROCESS HYDERABAD" వారికిన్ని, మరొకమారు ప్రోత్సాహకులకు, పరిష్కర్తలకు తమ మంగళాశాసనములు, అభిప్రాయములు సలహాలు ఇచ్చిన పెద్దలకు, ప్రచురణకర్తలకు, మిత్రులకు సోదరులకునుకూడ కృతజ్ఞతలను తెలియచేసికొనుచున్నాను.

ఇంక చివరగా ఒక్క మనవి. ఇందు సర్వసులభముగా నుండటకై కేవలము వ్యావహారిక భాషయే వాడబడినది. విశిష్టాద్వైత సంప్రదాయానుగుణమైన పదజాలము వాడబడలేదు ఇందలి దోషములు నావి యనియు గుణములు-పరిష్కరించిన-సూచనలను-సలహాలను ఇచ్చిన-ఆయా పెద్దలవనియు సవినయముగా మనవి చేసికొనుచు సెలవుతీసికొను చున్నాను.

చిననింద్రకొలను — ఇట్లు

14-4-90 — బుధజనవిధేయుడు

సౌరభవ్యాఖ్యాకర్త

# శ్రీ మరింగంటి అప్పలదేశికులు సాయించిన తిరునామములు

సేకరణ

ఉ. వే. శ్రీమాన్ న. చ. జగన్నాథాచార్యులవారు

ఖమ్మం

## 1 భైరవి - ఖండ

మంగళం సిరు లొసగు మందార వల్లికి
మంగళం నెనరు గల మణివల్లికి
మంగళం రంగమణిమందిర మతల్లికిని
మంగళం మముగన్న మా తల్లికి
జయ మంగళం నిత్య శుభ మంగళం ॥జయ॥

సిరి పరుని నెరిమనము
గిరికొనెడు మరకతపు
సిరిదొరగు తిరుమేను
బరగునతికి
దరలు బొరలెడి కరుణ
శరమిరవుగొని చూడ్కి
తిరమైన యాళ్వారు తిరుమగళుకు ॥జయ॥ 1

కలతగల తమతల్లి గొల్ల నెలత వలతిక కృష్ణ
కలిత లలితముఖాడి యలతమిథులన్
తొలుత కలుషముల నడచి నంతతమును మాచ్ఛ
శుల తలపున మెలగునెలత కెపుడు ॥జయ॥ 2

కడునెదరు జెద నెడను
ముదచి విరచిన పువ్వు
లిదవద బెరుంగోయు
లుద యాసుని
అదలనకు సుడినిఖడ
నడచి పొదపున దొడరు
నడజెడి మిగల రంగనాంచారుకు ॥జయ॥ 3

జగము బొగడగ గగన
నగ మనగ దగు శేషగిరి
నగము గల సిరిమగని
నిగ నిగలకే
వగ మిగిలి దగిలి జగ్గి
దనపు నాగసున శత్రుల
పగగొనెడు గురుని
గురి యగు మగువకు
జయమంగళం-నిత్యశుభమంగళం

॥ మధ్యమావతి-ఖండ

రంగ శృంగార తరంగ నరసింహాపుర
రంగ కృష్ణస్వామికి-మీరంగనలు
రంగకు నివ్వాళు లివ్వరే ॥రంగ॥

చంద్ర నాసా పాళికి న్మ్రతఘాత
చద్ర ధూళిపాళికి
చంద్ర ముఖదీధితికి చంద్రకాటీ ధృతికి
చంద్ర కాంచిత మౌళికి-మీరంగనలు ॥రంగ॥ 1

ఖండ పచన స్ఫూర్తికి సదా శ్రీ
ఖండ భూషిత మూర్తికి
ఖండ పరమన్నటిక ఖండ బిన మండలా
ఖండ లాగమకీర్తికి-మీరంగనలు ॥రంగ॥ 2

శేషశైల విహారికి, కస్తూరి వి
శేషగ మనోహారికి
శేష పరతంత్రతా శేష భూష తల్ప వి
శేషజ్ఞనుతిహారికి-మీరంగనలు ॥రంగ॥ 3

### III సావేరి - చతురశ్ర

స్వాములకును మంగళమని పాడరె
సావేరినిపుడు
ప్రేమమీర వైకుంఠ వాసుని
ప్రియ తెను పద నయనాత్మతుల్యులు ॥ స్వాములకు ॥

ధారుణి నొక్కటి తత్వముగా గొని
తద్ద్వయమును మాని
అరయమూటిని దూరము కాయక
నా సక్తిని బూని
సారతరమగు చతుర్థాంబులు
సరవిని మనసా నీ
శౌరిపదాంబుజ సంతత చింతన
సాయించు శమదమాంబుధులకు ॥ స్వాములకు ॥ 1

గురు నళిమానము మొదలగునైదును
కూడియున్న ఘనులు
అరిషడ్వర్గములటు భోజిమ్మిన
వరమణి గుణఘనులు
స్థిరతర సప్తవ్యసనములణచియు
సెతురు హరిపనులు
సరవిగ నష్టాక్షరమను సారము
సాయించు శమదమాంబుధులకును ॥ స్వాములకు ॥ 2

యతికులపతి సిద్ధాంత విచారము
లవనిని స్థాపించి
ప్రతిలేని శఠారితముని పాదా
కృతి మదిభావించి
సతతంబును మావరవరయోగికి స
స్మృతి చే మించి
క్షితి తలమున శ్రీశ్రీనివాస
దేశికమణి పదములె శరణని వేడిన ॥ స్వాములకు ॥ 8

IV ధన్యాసి-మిశ్రగతి

భాగవతార్చన కన్నను మిక్కిలి
భాగ్యములేనమ్మా
ఆగమసార విదార్య వతం సులి
దేగతి యని రమ్మా - శ్రీమహా - ॥ భాగవతార్చన ॥
అతులిత చర మోపాయ పరులకిదె
ఆత్మోజ్జీవనము
వితత మహాకలిదోష విదూషిత
విష్టప పావనము
హతమతి దుర్విష యాహి నమాగమ
మృత సంజీవనము
సతత తదీయారాధన పరులదె
సార్థక జీవనము- శ్రీ మహా.... ॥ భాగవతార్చన ॥ 1
రాగముతో శ్రీ భాగవతులపర
భాగత గొనియాడి
ధీగతులౌ శరణాగతులకు మీ
రేగతియని వేడి
త్యాగముసైహికభోగములనుచు వి
రాగముతోగూడి
బాగుగన పురో భాగులదైన వి
యోగమునకు నోచ శ్రీ మహా ॥ భాగవతార్చన ॥ 2

మానుగ నాత్మాత్మీయములు తద
ధీనము గావించి
మేనతి చంచలమౌనని దాస్య స
మృద్ధిని గావించి
మానిత శేషత్వాను గుణాత్మ
జ్ఞానము గావించి
మానసమున శ్రీశ్రీనివాస గురు
మౌళిని సేవించు శ్రీ మహా ॥ భాగవతార్చన ॥ 8

V

సుందర తర నరహరి పురి కోవిలు గోదాజానికి
సుందరులందరు నిత్యము శుభమంగళమనరే ॥ సుందర ॥
విందగు తిలనాసిక, కురువిందరదాచ్ఛదనం, నర
విందార్పణ గండయుగచ్ఛవిం, దరమన గళమున్
విందర నిరసించెడు అరవింద మనందగు గో
విందత నిరవధిభువన కువిందత మెరసిన మేటికి ॥ సుందర ॥ 1

మందర కదళీదళమహిమం దగిలిన వెన్నుం-జటు
మందలు పుందలుచ గిరిమందర మను త్రివళుల్
మందస్మిత సుధగాను విచుమందత నొగిలెటి జనులక
మంద గుణరత్నముల మందసమగు శ్రీధరునకు ॥ సుందర ॥ 2

కందర్ప పురందర మణికంద కళింద సుధారుచి
కందళకంఠ తనువు చక్కందనమున్ దనరున్
కందరనిభ నాభియు మాకందమలందములకు పలు
కందమలరు ప్రామిస్మీకులకందని స్వామికి ॥ సుందర ॥ 3

కుందమ్ముల కుందమ్ముల కుందమ్ములగు రదాళులు
కుందని చందొళ విందులకుందని నిడుముఖమున్
కుందనపుందట్టగు రాకుందలపుటగలపాణుల
కుంద ముకుంద ముఖవిధులకుం దగుయశమగు శౌరికి ॥ సుందర ॥ 4

నందన వన ఘన సనక సనందన ముఖ మునిబృందము
నందలరెడు శేషాచలనందక ధరుడగుచున్
నందయ నప్పలగురు మేనం దలరెడు భట్టాధిప
నందినినొంది ముని మహాసందరనొందెడు సామికి ॥ సుందర ॥ 5

VI సావేరి-ఆది

పామరులను పాలింపగ నృహరి
గ్రామమందు కృపతో నెలకొన్నది
భామకు మీరందరు మంగళమని
పాడరె గోదాదేవికి    భామకు
నయనానందము సిరుసేలవంకా
నయన భాను వెన్నెలగోరెంకా
ప్రియత భట్టపతి పెంచిన జింకా
పేరు మించు మౌక్తిక తాటంకా    భామకు 1
కుందనపుం దళుకుం శతకోటి
కొందన దీర్పు నద్గుణ గణపేటి
మందహాస మించౌనరు వధూటి
మదపతి వరం పరలో మేటి    భామకు 2
సుఖకరమగు శృంగారపు బొమ్మా
సొంపుతావి గల మరువపు రెమ్మా
వక్షుతగు రంగని ముద్దుల గుమ్మా
శౌరిపాణిలో నలరెడు నిమ్మా    భామకు 3
శేషగిరిం మేలగెడు మణివల్లీ
శ్రీనివాస దేశికులకు తల్లీ
లోపములను కనుగొనని మతల్లీ
తోసిటితో నిలదిన సుధవెల్లీ    భామకు 4

ఆండాళ్ తిరువడిగళే శరణమ్

శుభం భూయాత్

శ్రీమతే రామానుజాయ నమః
శ్రీమతే రంగనాథాయ నమః
శ్రీమత్యై గోదాదేవ్యై నమః
లక్ష్మీనారాయణాభ్యాం నమః

శ్రీ మరింగంటి అప్పలదేశిక ప్రణీతః

# శ్రీ గోదాస్తవః

నీళాతుంగ స్తనగిరితటీ సుప్తముద్బోధ్య కృష్ణం
పారార్థ్యం స్వం శ్రుతిశతశిరస్సిద్ధమధ్యాపయన్తీ,
స్వోచ్ఛిష్టాయాం స్రజి నిగళితం యా బలాత్కృత్య భుంక్తే
గోదా, తస్యై నమ ఇదమిదం భూయ ఏవాస్తు భూయః. 1

సప్తప్రాకారమధ్యే సరసిజముకుళోద్భాసమానే విమానే
కావేరీమధ్యదేశే ఫణిపతిశయనే శేషపర్యంకభాగే,
నిద్రాముద్రాభిరామం కటినికటశిరఃపార్శ్వవిన్యస్తహస్తం
పద్మాధాత్రీకరాభ్యాం పరిచితచరణం రంగరాజం భజేఽహమ్. 2

క్షీరాంభోధౌ విలసితమహారత్నసౌవర్ణదీపే
నిత్యామోదం నిగమశిఖరైః గీయమానానుభావమ్,
కల్యాణాంచద్వనకమలం కాలమేఘావభాసం
శ్రీమల్లక్ష్మీరమణమనిశం మానసే భావయామి. 3

కర్కటే పూర్వఫల్గున్యాం
తులసీకాననోద్భవామ్,
పాండ్యే విశ్వంభరాం గోదాం
వందే శ్రీరంగనాయకీమ్. 4

శ్రీమతీ విష్ణుచి త్తస్య
దుహితా మహితా మమ,
ప్రణామం ప్రణయేనాంగీ –
క్రియతాం గురుతాం గతా. 1

శ్రీమంతురాలైనట్టియు, కొనియాడదగిన గుణసమూహముకలిగినట్టియు, విష్ణుచిత్తుల కుమార్తెయైనట్టియు శ్రీగోదాదేవి గురుత్వమును పొందినదై నా నమస్కారమును వాత్సల్యముతో అంగీకరించునుగాక —

గురుతాం గతా :– గోదాదేవి శ్రీరంగనాథుని పట్టమహిషియై సర్వప్రపన్నులకు గురువుగా అయినది. గురుపరంపరలో శ్రీమన్నారాయణునకు ప్రథమస్థానముకాగా తదర్ధభాగమైన లక్ష్మ్యాదులకు తరువాతి స్థానమీయబడినది.

గు–శబ్దస్త్వంధకారః స్యాత్
రు–శబ్దస్తన్నిరోధకః,
అంధకారనిరోధత్వాత్
గురురిత్యభిధీయతే,

"గురు"శబ్దము "అజ్ఞానమును పోగొట్టువాడు" అను అర్థమును చెప్పును. ఈ విధముగా ఆమె గురువులకే గురువుగా చెప్పబడినది. (చూ. శ్లో. 28, 31 గోదాస్తవం)

అంతియేగాక ఈమె పన్నిద్దరాళ్వారులలో నొకరుగా నున్న విషయము కూడ ఈ శ్లోకమున ప్రతిపాదించబడినది.

మహితా :— అను పదము ఆమెయొక్క మాహాత్మ్యమును తెలుపుచున్నది.

ఈ శ్లోకమున "దుహితా-మహితా" "కురుతాం-గురుతాం" అను పదములలో అనుప్రాస అనెడి శబ్దాలంకారము కలదు. అనుష్టుప్ వృత్తము.

ఆమ్నాయానామావిమృగ్యాంఘ్రిపద్మః
పద్మాభర్తా పాణిమాణిక్యకల్పః,
యస్యాస్తస్యాః పాదపంకేజమూలం
మూలం భూయాత్ భూయసాం శ్రేయసాం నః. 2

వేదములకు కూడ అందని పాదపద్మములు కలవాడును, లక్ష్మీధవుడును నైన శ్రీమన్నారాయణుడు ఏ గోదాదేవికి కరతల-మణిసదృశుడో, అట్టి ఆ గోదా దేవియొక్క పాదపద్మమే మనకు సకలశ్రేయస్సులకు మూలమగును గాక—

ఇచట లక్ష్మీధవుడైనను శ్రీమన్నారాయణుడు గోదాదేవియొక్క ఆజ్ఞాను వర్తియై యున్నా డనుట విశేషము. వేదములకు కూడ అందనివాడు ఈమె హస్తమునందు మణివలె ప్రకాశించుచున్నా డనుటలో భగవంతుని భక్తపరాధీనత కూడ గోచరించుచున్నది.

ఈ శ్లోకమున "పద్మః-పద్మా" "మూలం-మూలం" ఈ పదములలో ముక్తపదగ్రస్తము అను అలంకారము కలదు. శాలినీ-వృత్తము.

కనకలతికాన్నిగ్ధాం ముగ్ధాంబుజాయతలోచనా—
మమృతలహరీభోగ్యాం యోగ్యాం మురారిమహోరసః,
అనవధికృపారూపా మాపన్నజీవనదాయినీ—
మనవధిమనోమోదాం గోదామహం కలయేఽన్వహమ్. 3

బంగారుతీగవలె మనోహరమైనట్టిదియు, పద్మములవలె విశాలములైన నేత్రములు కలిగినట్టిదియు, అమృతప్రవాహమువలె భోగ్యమైనట్టిదియు, తనివి తీరని చరిత్ర కలిగినట్టిదియు, శ్రీమన్నారాయణుని వక్షఃస్థలమునకు తగినట్టి దియు, హద్దులేని కృపయే రూపముగా కలిగినట్టిదియు, ఆర్తులకు జీవనము నిచ్చు నట్టిదియు, అంతులేని సంతోషమునకు కారణమైనట్టిదియు, అంతులేని సంతోష ముతో కూడినట్టిదియు అయిన గోదాదేవిని నేను ఎల్లప్పుడును సేవింతును. హరిణీ-వృత్తము.

మధురవచనభంగీ మాలతీపేశలాంగీ
కబరఖచితమాలా కాందిశీకాక్షిలీలా,
నిభృతకరుణపూరా నిర్మలాంతర్విచారా
విలసతు మయి ధన్యా విష్ణుచిత్తస్య కన్యా. 4

మధురములైన వచోవిన్యాసములు కలిగినట్టిదియు, మాలతివలె సుకుమా రములైన అవయవములు కలిగినట్టిదియు, తన కేశములయందు ధరించిన

పుష్పమాల కలిగినట్టిదియు, దీర్ఘమై చంచలమైన నేత్రవిలాసము కలిగినట్టిదియు, కరుణతో నిండియున్న మనస్సు కలిగినట్టిదియు, నిర్మలమైన అంతఃకరణము కలిగినట్టిదియు, తాను కోరిన కోర్కెను నెరవేర్చుకొనుటచే ధన్యురాలైనట్టిదియు, శ్రీవిష్ణుచిత్తుల పుత్రియైనట్టియు, గోదాదేవి నాయందు ప్రకాశించును గాక.— (నన్నను గ్రహించి తన స్తోత్రమును తానే నాచేత చెప్పించుకొనునుగాక) చూ. గోదాస్తుతి శ్లో. 28.

ఈ శ్లోకమున ప్రతి పాదమునను యతిస్థానమున మరల అదే అక్షరము — (మ-మా, క-కా, ని-ని, వి-వి) అంత్యప్రాసయు —(గీ-గీ, లా-లా, రా-రా, న్యా-న్యా,) ఆదరింపబడినవి. మాలినీ-వృత్తము.

ఆపూర్వస్యాః జననమనఘం కాననే శ్రీతులస్యాః
వృద్ధిః స్నేహప్రసరమృదులే విష్ణుచిత్తస్య పాణౌ,
ద్రాక్సంవేశః కుసుమసదృశే రంగిణః పాదమూలే
బాలామేలా సురభితతనూం మాల్యయుక్తాం ప్రపద్యే. 5

ఎవరియొక్క పవిత్రమైన జననము శ్రీతులసీవనమునందో, ఎవరియొక్క వృద్ధి(పెరుగుట) స్నేహప్రసరముచే మృదువైన శ్రీవిష్ణుచిత్తులయొక్క పాణియందో, ఎవరియొక్క నిశ్చలమైన భావము కుసుమసదృశములైన శ్రీరంగనాథుని పాదపద్మములయందో, అట్టి పరిమళయుక్తమైన శరీరసౌభాగ్యము కలిగిన మాల్యయుక్తయగు గోదాదేవిని శరణు పొందుచున్నాను.

(శ్రీతులసీవనమున జన్మించి, శ్రీవిష్ణుచిత్తుల వద్ద పెరిగి, శ్రీరంగనాథుని యందే తన భావమును నిలిపిన ఆముక్తమాల్యదయైన గోదాదేవిని సేవింతును.)

శ్రీగోదా అష్టోత్తరశతనామములలోని — "శ్రీతులసీకాననోద్భూతా, విష్ణుచిత్తాత్మజా, రంగనాథప్రియా, ఆముక్తమాల్యదా" అను నామములు ఇందు చెప్పబడినవి. మందాక్రాన్తా-వృత్తము.

అస్పృష్టనిగ్రహలవామతిపేశలాంగీం
అంతర్బహిశ్చ దధతీమివ సౌకుమార్యమ్,
అస్థాననిత్యభయశంకిభిరార్యవర్యైః
ఆరక్షితాం నమత రంగపతేః పురంధ్రీమ్. 6

( ) అంతఃకరణమునందును (2) శరీరమునందును కూడ సౌకుమా ర్యము ననుభవించుచున్నదా? అనునట్లు (1) కోపమనునది లేశమైనను లేక ఎల్లప్పుడును చిరునగవుతో ప్రకాశించుచున్నదియు, (2) సుకుమారములైన అవయవములు కలిగియుండినదియు, అతి స్నేహము పాపమును శంకించును గావున అస్థానమునగూడ నిత్యమును భయమును శంకించుచున్న శ్రీవిష్ణుచిత్తులచేత సంరక్షింపబడినట్టిదియు, శ్రీరంగధాముని ప్రేయసి యైనట్టియు గోదాదేవిని నమస్కరింపుడు. వసంతతిలకా-వృత్తము.

పుష్పహాస సుకుమారతాం గతైః
సంగతామనిశమంగకందళైః,
క్లేశయామి నుతికైతవాదిమాం
హంత ! హంత ! మమ కర్కశం మనః ! 7

పుష్పహాసము (వికసించిన పుష్పము) వలె అతిసుకుమారములైన అవ యవములతో నొప్పారు ఈ గోదాదేవిని నా స్తోత్రమనెడి మిషతో క్లేశపెట్టు చున్నాను. అయ్యో! నా మనస్సు ఎంత కఠినమైనది !!

శ్రీపరాశరభట్టరు కూడ శ్రీగుణరత్నకోశమున "పాదారుంతుదమేవ పంకజరజః —42" అను శ్లోకమున "సుకుమారమైన నీ శరీరము పరుషమైన పురుషవాక్కును ఎట్లు సహించును?" అని వర్ణించుట గమనించతగినది. రథోద్ధతా-వృత్తము.

జ్ఞాత్వాపి తే ప్రకృతిమంబ ! సుమర్మ్నివారాం
కండూతిమేతి రసనా స్తుతికల్పనాయామ్,
ఆగశ్శతే విరచితేఽపి మదీయమేవం
క్షాంతం త్వయైతదఖిలం కిమిదం న సహ్యమ్ ? 8

అమ్మా ! నీయొక్క సౌకుమార్యమును తెలిసికొన్నప్పటికిన్ని, నాయొక్క పరుషవాక్కుతో నీకు బాధకలిగినప్పటికిని, నా నాలుక నిన్ను స్తోత్రముచేయ వలయునని "తహతహ" పడుచున్నది. దీనిని వారింపలేకున్నాను. వందలకొలది

ఒప్పులను సహించిన నీ సహనము ఈ ఒక్క తప్పును మాత్రము సహించ
వసంత తిలకా-వృత్తము.

ఇతి నుతిచాపలేన సహితే రహితే కళయా
విహగతురంగ కృష్ణదయితే! మయి తే కృపయా,
మ్రదిమవతీ నితాంతమధురా విధురా కలుషైః
వచనసతీ సతీ ప్రచలితా భవతాన్నితరామ్.

ఈ విధముగా స్తోత్రము చేయవలయు ననెడి చాపల్యము మా।
కలిగి, ఏ విధమైన కళయు లేని (కళారహితమైన) నాయందు, ఓ గోదా
నీయొక్క దయవలన మృదువైన మిక్కిలి మధురమైన దోషములు లేని
సరస్వతీదేవి— మిక్కిలిగా విలసిల్లును గాక.

శ్రీపరాశరభట్టరులు కూడ శ్రీగుణరత్నకోశమున "అనాఘ్రాతావద
8" అను శ్లోకమున "వాణిని నీవే నాకు ఇమ్ము" అని లక్ష్మీదేవినే ప్రా
యున్నారు- ఇట్లే వేదాంతదేశికులు కూడ- చూ. గోదాస్తుతి. శ్లో. 8. ఈ అ
దేశిక ఉవివర్యులు కూడ గోదాస్తవమును రచించబూని "దాని కనుగుణ
వాణిని నీవే నాకు ఇమ్ము" అని గోదాదేవినే ప్రార్థించుచున్నారు.
అనుప్రాస-యమకము. నర్కుటక-వృత్తము.

ఆకంఠప్రచురప్రసాదమధురై రాకస్మికాభ్యాగమైః
సంపత్తిప్రతిపాదనప్రకృతిభిః సంతాపసర్వంకషైః,
ఆర్తవ్రాతశరవ్యభేదచతురైః ఆత్మేశ్వరప్రార్థితైః
ఆలోకైరవలోకయాంబ! కరుణాస్రోతఃప్రణాళీముఖైః.

అమ్మా! ఓ గోదాదేవీ! సంపూర్ణప్రసాదగుణయుక్తము లైనట్టి
ఆకస్మికముగా వచ్చునట్టివియు, సంపద నిచ్చు స్వభావముకలవియు, సంతాపమ
పోగొట్టునవియు, ఆర్తసమూహమును రక్షింపనట్టియు, నీయొక్క ప్రియు
శ్రీరంగనాథునిచేత ప్రార్థింపబడినట్టివియు, కరుణాప్రవాహమునకు మార్గమ
నట్టివియు, అయిన నీయొక్క చల్లని చూపులతో నన్ను చూడుము.

శ్రీగుణరత్నకోశము "ఆనందాత్మభిః — 4" అను శ్లోకమున శ్రీపరాశరభట్టరులు కూడ ఈ విధముగనే లక్ష్మీదేవిని ప్రార్థించియున్నారు. శార్దూలవిక్రీడిత-వృత్తము.

కాంతాకర్షణవాగురాభి రభితః కారుణ్యసూత్రార్పితైః
భక్తాద్యంతుదదోషదర్శనదశానిద్రాళుభిర్నిత్యశః,
అస్మాదృగ్జనపక్షపాతవిశదైః అత్యంతశైత్యాస్పదైః
అంబ! త్వం భర! మామపాంగనికరై రామోక్షఘంటాపథైః. 11

అమ్మా! గోదాదేవీ! కాంతాకర్షణలకు వలలైనట్టివియు (అరికట్టునవి), అంతటను కారుణ్య మను సూత్రముతో కూడియున్నట్టివియు, భక్తులయొక్క గొప్ప గొప్ప దోషములను చూచుటలో కూడ నిద్రాళువులైయున్నట్టియు (దోషములు కనపడనట్టి వాత్సల్యముతో కూడినవి), మాబోటివారియొక్క పక్షపాతమును కూడ సూచించునట్టివియు, (ఉద్ధరించునట్టివి), అత్యంతము శైత్యమునకు అకరములైనట్టివియు, మోక్షము నిచ్చు మార్గములైనట్టివియు, నీయొక్క క్రీగంటిచూపులతో నన్ను రక్షించుము. (నా దోషములను భరించుము.)

"పితేవ త్వత్ప్రేయాన్ -52" అను శ్రీగుణరత్నకోశశ్లోకమున "శ్రీమన్నారాయణుడు భక్తుల యెడ కోపముగా నున్న సమయమున నీవు నీ విలాసాలతో భక్తుల దోషములను భగవంతునకు కనపడకుండ చేసెదవు. అందు వలననే నీవు మాకు తల్లి వైతివి," అని శ్రీపరాశరభట్టరులు కూడ వర్ణించి యున్నారు.

శ్రీమద్వేదాంతదేశికులు కూడ తమ గోదాస్తుతియందు "అస్మాదృశా మప కృతౌ చిరదీక్షితానాం అహ్నాయ దేవి! యదసౌ దయతే ముకుందః-6" అను శ్లోకమున ఇట్లే వర్ణించియుండిరి.

కావున సంతానముయొక్క దోషములు తల్లికి కనపడనట్లే, పుత్ర స్థానీయులైన భక్తుల దోషములు జగజ్జననికి కూడ కానరావు. అందుకనియే "దోషదర్శనమున నిద్రాళువులు" అని వర్ణింపబడినది. దానికి కారణము అపారకరుణ. ఆ కరుణయొక్క అపారత్వమునకు నిదర్శనము

అస్మాదృశులను కూడ ఉద్ధరించబూనుట- అట్టి చల్లని చూపులను తమపై కూడ ప్రసరింపచేయుమని కవిగారి ప్రార్థన. శార్దూలవిక్రీడిత-వృత్తము.

అంతఃపురే మధురిపోరకుతోభయే త్వం
ఆనందనిర్భరమనా అపి మాదృశానామ్,
సంసారఖేదమపహర్తుమిహావతీర్ణా
గోదే! కియానహహ! తే కరుణాసముద్రః ! 12

అమ్మా ! గోదా ! ఎవరివలనను ఏ విధమైన భయమును లేనట్టి శ్రీమన్నారాయణునియొక్క అంతఃపురమునందు ఆనందమయముగా నుండవలసిన దానవైనను, మావంటివారియొక్క సంసారఖేదమును పోగొట్టుటకు ఈ లోకమున అవతరించితివి. నీ కరుణ అనే సముద్రము ఎంత గొప్పది? ఎంత కరుణానిధివి నీవు ?

ఈ శ్లోకమున కూడ గోదాదేవియొక్క అపారకరుణ వర్ణించబడినది ఆ కరుణ సముద్రముతో పోల్చబడినది. "సముద్రమువలె అంతులేని కరుణ గలది గోదాదేవి" అని తాత్పర్యము. అందుకనియే కష్టములను కూడ ఓర్చి భక్త రక్షణమే పరమప్రయోజనముగా భూమియందవతరించినది.

శ్రీగుణరత్నకోశము "నేతుర్నిత్యసహాయినీ- 58" "జనకభవనప్రీత్యా- 56" అను శ్లోకములలో చెప్పబడిన విషయమే ఇందు చెప్పబడినది.

"శ్రీమన్నారాయణునకు నిత్యసహాయినివై ఈ లోకమున సీతాదిరూపములఅవతరించి అనేకములైన కష్టములను అనుభవించియున్నావు" అనియు, "పుటినిల్లైన పాలసముద్రమును, మెట్టినిల్లైన వైకుంఠమును కూడ వదలి, కేవలము మావంటి భక్తులను రక్షించుటకై శ్రీరంగమున అర్చామూర్తివై వెలసియున్నావు" అనియున్న—

"కారుణ్యరసనిష్యందినేత్రద్వయసుశోభితా" అనియు, "దయాంచిత దృగంచలా" అనియు శ్రీగోదా అష్టోత్తరమ్. వసంతతిలకా-వృత్తము.

మతమిదమసురారే రాత్మసస్యాన్యవశ్యం
సఫలయతి కృపాభి స్తే నదీమాతృకం సత్,
భగవతి! భవదీయభ్రాతరి శ్రీయతీంద్రే
విహితకుమతజంతూచ్చాటనే న్యస్తభారమ్. 13

భగవతీ! నీయొక్క అగ్రజులును (అన్నగారు), కుమతములను జంతువులను పారద్రోలినవారును, యతీంద్రులును అయిన భగవద్రామానుజులయందు ఉంచబడిన భారముగల ఈ విశిష్టాద్వైతమతము, నదీమాతృకమై (గోదా=గోదావరి), శ్రీమన్నారాయణునియొక్క ఆత్మసస్యములను నీయొక్క దయతో ఫలింపచేయును.

భగవంతుడు భక్తులహృదయములలో ప్రవేశించి వారల భక్తిని అభివృద్ధి చేయును.

ఇచట విశిష్టాద్వైతసిద్ధాంతప్రవక్త "భగవద్రామానుజులు", ప్రవర్తిల్ల చేసినది "గోదాదేవి". వారు నిర్ణయించినది "ఆత్మస్వరూపము". ఆ నిర్ణయము వలన సంతోషపడువాడు అసురారియైన శ్రీమన్నారాయణుడు అను విషయములు వివరింపబడినవి.

1) భక్తి అను పంటను అభివృద్ధిపరచువాడు శ్రీమన్నారాయణుడు (రూపకాలంకారము)

2) దానికి నదీమాతృక గోదాదేవి.
గోదయే గోదావరి. (శ్లేష–రూపకాలంకారములు)

3) పండిన భక్తి అను పంటను కుమతములు అను దుష్టజంతువుల బారినుండి రక్షించువారు భగవద్రామానుజులు. (రూపకము)

"యతిరాజసహోదరీ" గోదా అష్టోత్తరమ్. మాలినీ వృత్తము.

వ్యక్తం మమాంతరమిదం తవ చేందిరాయాః
యస్మాదనంత ఇహ తామురసా బిభర్తి,
మాలాం త్వయా సుమనసాముపభుక్తముక్తాం
గోదే! స ఏవ సతతం శిరసా బిభర్తి. 14

అమ్మా! గోదాదేవీ! నీకును లక్ష్మీదేవికిని ఇదే తారతమ్యము నాకు కనుపించినది. ఏమనగా శ్రీమన్నారాయణుడు ఆమెను వక్షఃస్థలమున ధరించు చున్నాడు. ఆ శ్రీమన్నారాయణుడే, నీచేత అనుభవింపబడి వదలబడిన మాలను శిరస్సుతో గ్రహించుచున్నాడు.

అనగా "లక్ష్మీదేవికంటె నీయందే శ్రీహరికి ప్రేమ ఎక్కువ" అని ధ్వనితము.

"శ్రీకృష్ణహితభోగినీ" "రంగమంగళదీపికా" గోదా అష్టోత్తరమ్. వసంతతిలకా-వృత్తము.

పృథ్వీనితంబఫలకే విపులా త్వమక్ష్ణోః
సర్వంసహా స్తనభరా నమితే వలగ్నే,
కుంభిన్యథాసి గమనే ష్వచలాసి శీలే
గోదే! తదత్ర భవతీహ భువోఽవతారః. 15

అమ్మా! నీవు నితంబమునందు పృథ్వివి. (గొప్పదానవు) -నేత్రముల యందు విపులవు. (విశాలమైనదానవు) -స్తనభరముచేత వంచబడిన నడుము నందు సర్వంసహవు. (అన్నింటిని సహించుదానవు. గమనమునందు కుంభినివి. (ఏనుగవు-గజగమనవు)- శీలమునందు అచలవు (చలనములేనిదానవు— అనగా పతివ్రతవు)- కావున ఓ గోదాదేవీ! నీవు భూమియొక్క అవతారము" అనునది స్పష్టము.

ఇచట పృథ్వీ-విపులా-సర్వంసహా-కుంభినీ-అచలా- అను పదములు భూమికి పర్యాయపదములై యోగార్థమున గోదాదేవికి వర్తించుచు "ఆమె భూమి యొక్క అవతారము" అను విషయమును స్పష్టము చేయుచున్నది.

ఈ శ్లోకము వేదాంతదేశికుల గోదాస్తుతియందలి—

శోణాఽధరేఽపి కుచయోరపి తుంగభద్రా
వాచాం ప్రవాహవిభవేఽపి సరస్వతీ త్వమ్,
అప్రాకృతైరపి రసైర్విరజా స్వభావైః
గోదాఽపి దేవి! కమితుర్నను నర్మదాఽసి.

అను (6వ) శ్లోకమును స్మరింపచేయుచున్నది. అచట గోదాదేవి సర్వనదీస్వరూపిణిగా వర్ణింపబడినది — ( శోణా - తుంగభద్రా - సరస్వతీ-విరజా గోదావరీ-నర్మదా )—

ప్రకృతశ్లోకమున పూర్తిగ అన్నివిధముల భూమితోనే సామ్యముచెప్పబడి ఆ విధముగా "భూమియొక్క అవతారముగా గోదాదేవి సార్థక్యమును వహించినట్లుగా" వర్ణించబడినది.

"భూసుతా" గోదా అష్టోత్తరమ్. రూపకము-శ్లేష. అలంకారములు. వసంతతిలకా-వృత్తము.

> స్నేహేన లాలయసి పేశలసూక్తిభోగ్య-
> స్తన్యేన తర్పయసి కించ దయారసేన,
> బాలానివ స్నపయసీహ హరేః ప్రపన్నాన్
> విశ్వస్య మాతః! అత ఏవ కిలాసి ధాత్రీ. 16

ప్రపంచమునకే మాతవైన ఓ గోదాదేవీ! విష్ణుభక్తులను ప్రేమతో లాలించుచున్నావు. సుకుమారసూక్తు (తిరుప్పావుపాశురము) లనెడి స్తన్యముతో తృప్తిని పొందించుచున్నావు. దయారసముతో బాలురను వలె స్నానము చేయించుచున్నావు- కావుననే నీవు "ధాత్రి" వైతివి.

ఇచట ధాత్రి యనగా "భూమి" "దాది" అను రెండర్థములు వచ్చుచున్నవి. విష్ణుభక్తులు బాలురుగను, గోదాదేవి వారిని సంరక్షించు దాదిగను వర్ణించబడిరి.

"గోదాదేవి భూమియొక్క అవతారము" అని క్రిందటి శ్లోకముననే చెప్పబడినది కదా- ఇచట బాలుర సంరక్షణలో "ధాత్రి" అనగా దాది ఎట్లు ప్రవర్తిల్లునో, అట్లే విష్ణుభక్తుల సంరక్షణలో "ధాత్రి" అనగా భూమియొక్క అంశను పుణికిపుచ్చుకున్న గోదాదేవి ప్రవర్తిల్లుచున్న దని భావము.

ఉపమా-రూపక-శ్లేషాలంకారములు.

"లోకజననీ" గోదా అష్టోత్తరమ్.

వసంతతిలకా-వృత్తము.

కర్ణానురోధిచరితాం స్మరబాణమాలా-
లీలానుకూలవపుషం ధృతమంజుఘోషామ్,
కేశేషు దృప్తయదువీరకరాభిమృష్టామ్
జ్యామామనంతి హి ధనుఃపురవాసినీం త్వామ్. 17

అమ్మా! నీవు ధన్వీపురము (విల్లిపుత్తూరు)న నివసించుచున్నావు. కర్ణానురోధి చరితవు. మన్మథబాణములైన పుష్పములయొక్క సౌకుమార్యము వంటి సౌకుమార్యము కలదానవు. మనోహరమైన ధ్వనికలదానవు. కేశములయందు దృప్తుడైన యదువీరునియొక్క చేతియందు మెలగుచున్నట్టిదానవు. అట్టి నిన్ను ఓ గోదాదేవీ! ధనుఃపురవాసినియైన ''జ్యా''నుగా (అల్లెత్రాడు-భూమి) తలంచుచున్నారు.

ఇచట ధన్వీపురవాసినియైన గోదాదేవి ''అల్లెత్రాడు''గను, ''భూమి''గాను చెప్పబడినది. ''జ్యా''శబ్దమునకు ఈ రెండర్థములు కలవు. విశేషణములు- గోదాదేవికి, అల్లెత్రాడుకు, భూమికి- ముగ్గురకును సమానములు- ముందుగా అల్లెత్రాడుతో ఎట్లు సమానమో చూతము -

అల్లెత్రాడు కర్ణానురోధిచరిత్ర కలది. అనగా చెవులను అడ్డుకొట్టు చరిత్ర కలది (అకర్ణాంతము లాగబడినది). గోదాదేవి కూడ అందరి చెవులవరకు వ్యాపించిన (ప్రసిద్ధికెక్కిన) చరిత్రగలది. చరిత్ర కర్ణానురోధియైనను శరీరము మన్మథబాణములయొక్క లీలకు అనుకూలమైనది. అనగా అల్లెత్రాడునుండియే బాణములు బయలుదేరును కావున- అందనను మన్మథబాణములకు ప్రసిద్ధి ఎక్కువ కావున, అట్టి మన్మథబాణముల లీలకు నాట్యమునకు అనుకూలమైనది- అల్లెత్రాడు. అట్లే గోదాదేవి కూడ మన్మథుని బాణసముదాయమైన (అరవిందము- అశోకము-చూతము-నవమల్లిక-నీలోత్పలము అను) పుష్పములయొక్క లీలతో అనగా సౌకుమార్యముతో సమానమైన సౌకుమార్యము- (శరీరశోభ) కలది- అనగా పుష్పసుకుమారశరీర-అని అర్థము.

అట్లే అల్లెత్రాడు ఇంపైన ధ్వని కలది. (నారి సారించునపుడు చేయు ధ్వని.) గోదాదేవి గోపికలతో కలిసి ధనుర్మాసవ్రతము చేయునపుడు పాడిన

"తిరుప్పావై" యొక్క ఇంపైన ధ్వని కలిగి— అట్టి అల్లెత్రాడు దృప్తుడైన మన్మథునియొక్క చేతితో పరామర్శింపబడినది గోదాదేవి యదువీరుని (కృష్ణుని) యొక్క చేతితో పరామృశ్యింపబడినది. ఆమె నివసించుచున్నది— ధనుఃపురము- అదే ధన్విపురము (విల్లిపుత్తూరు) కావున ఆమెను అల్లెత్రాడుగా చెప్పట ఉచితముగా ఉన్నది.

ఇక "జ్యా" శబ్దమున కున్న మరియొక అర్థము "భూమి" అని— ఇచటి విశేషణములు భూమికి కూడ సరిపోవుచున్నవి.

ఎట్లనగా- ధనుఃపురము- ధనుస్సులు ఉండు- అనగా వానిని ధరించు వీరులుండు ప్రదేశము. అనగా యుద్ధభూమి. కురుక్షేత్రసంగ్రామమును తీసికొన్నచో అప్పటి యుద్ధభూమి. ఈ భూమి కర్ణానురోధిచరిత- కర్ణునకు అడ్డువచ్చుచరిత్ర గలది. అంతేకాక మన్మథసదృశుడైన అర్జునుని బాణమాల కర్ణుని యందు పడుటకు పీఠమైన శరీరము కలది. (ఆ విధముగా గుంటపడి క్రిందకు దిగినది.) ఆ సమయమున మనోహరమైన ధ్వని కూడ కలదైనది. దృప్తులైన యదువీరులయొక్క (లేదా యదువీరుడైన శ్రీకృష్ణునియొక్క) చేతులతో (లేదా చేతితో) తాకబడినది— అని-

కర్ణుని వధలో భూమి కూడ సహాయపడినదని ప్రసిద్ధి. ఈ (యుద్ధ)భూమి రూపమైన అర్థము ప్రకృతమున ఉపయోగపడదు. కాని కేవలము "గోదాదేవి భూమియొక్క అంశ" అని చెప్పుటయే తాత్పర్యముగా ఇచట "భూమి" అనెడి అర్థము ఉపయోగించును. "నిన్ను విల్లిపుత్తూరునందున్న భూదేవినిగా తలంతును" అని. విల్లిపుత్తూరులో గోదాదేవి రూపమున భూదేవియే ఉన్నదనుట.

ఈ శ్లోకమున శబ్దశ్లేష-అర్థశ్లేష-రూపకాలంకారములు కలవు. మరియు విరోధాలంకారము వ్యంగ్యము.

15, 16, 17 శ్లోకములలో ఒకదానికంటె మరియొకదానియందు విలక్షణముగా "గోదాదేవి భూమియొక్క అవతారము" అని వర్ణింపబడినది.

"శ్రీధన్విపురవాసినీ" "విల్లిపుత్తూర్ నగరవాసినీ" గోదా అష్టోత్తరమ్. వసంతతిలకా-వృత్తము.

తవ సహజసముద్యద్దివ్యగంధప్రబంధే
భవతి చికురబంధే భావబంధో మురారేః,
తదిహ ఖలు యదీయస్పర్శదర్శిని దేవి !
వ్యతనుత శిరసి స్వే ముక్తమాల్యాని దేవః. 18

దేవీ ! సహజముగనే పరిమళయుక్తమై గట్టిగా ముడిపెట్టబడిన నీయొక్క చికురబంధమునందు శ్రీహరికి ప్రీతి ఎక్కువ కలుగుచున్నది. అందుకనియే నీయొక్క ఆ చికురములను స్పృశించి వదలిన మాలలను శ్రీహరి సంతోషముతో తన శిరస్సున ధరించుచున్నాడు.

“సహజముగనే పరిమళించు కొప్పునందు ముడిచిన మాల మరింత పరిమళయుక్తమగును కాన శ్రీహరికి గోదాదేవి ముడిచివిడచిన ఆ మాలయందు ఎక్కువ ప్రీతి” అని ఇచట విశేషము. మాలయొక్క పరిమళము కొప్పునందు ముడిచివిడచుటచే ఇనుమడించుచున్నది. లోకములో అట్లుగాక ముడిచివిడచిన మాల వాడిపోవును “అనుక్తమాల్యదా”-గోదాఅష్టోత్తరమ్. మాలినీ-వృత్తము.

స్వాతంత్ర్యరూపమదదుర్లలితం విలాసైః
సందుధ్య కృష్ణకలభం ఖలు శృంఖలాభిః
శీలానుకూలమలివేణి ! కరోషి యస్మాత్
మూలం త్వమేవ ఖలు చేతనజీవితానామ్. 19

ఓ అలివేణీ! స్వాతంత్ర్యము అను మదముతో విలసిల్లెడి కృష్ణుడు అను కలభమును (మదపుటేనుగును), నీయొక్క విలాసములనెడి సంకెలలతో బంధించి నీయొక్క శీలమునకు అనుకూలమైన వానినిగా చేసికొనినావు. ఎందువల్లననగా చేతనుల జీవితములకు మూలము నీవే కదా !

స్వతంత్రుడైన శ్రీకృష్ణపరమాత్మను తనకు వశునిగా చేసికొనిన గోదాదేవి ఇచట “స్వాధీనపతిక”గా వర్ణించబడినది. అంతేకాక “భగవంతుడు భక్తపరతంత్రుడు” అను విషయము కూడ ఇందు చెప్పబడినది.

రూపకాలంకారము. “కృష్ణానురక్తా” “కృష్ణవిశ్లేషాసహా” గోదా-అష్టోత్తరమ్ వసంతతిలకా-వృత్తము.

అంతర్బహిర్మరకతప్రతిమాసమాన–
మూర్త్యా త్వయా హరిరసావుపగూహ్యమానః,
త్వద్రూపతాం భ్రమరకీటనయేన భేజే
తస్యాపి మజ్జనని ! కిం పరదేవతా త్వమ్ ? 20

ఓ మాతా ! లోపలను పైనను కూడ మరకతప్రతిమతో సమానమైన (స్వచ్ఛమైన) మూర్తిగల నీచేత ఆలింగనము చేసికొనబడినవాడై శ్రీహరి ''భ్రమరకీట న్యాయముచే'' నీ రూపమునే పొందినవా డయ్యెను. అమ్మా ! ఆతనికి కూడ నీవు పరదేవతవా ?

''మోక్షదశయందు భగవంతుడు ముక్తపురుషుని గాఢముగా ఆలింగన మొనర్చుకొనును. దానితో ఆ ముక్తాత్మ తత్సారూప్యమును పొందును'' అను విషయము ఇచట చెప్పబడినది. వసంతతిలకా–వృత్తము.

హే విష్ణుచిత్తస్య మునేః కుమారి !
కరోతి చేష్టం విజహాత్యనిష్టమ్,
స్పష్టం తవ స్యాదిహ కైటభారిః
కుటీభటో వా ? భ్రుకుటీభటో వా ? 21

విష్ణుచిత్తు డను మునియొక్క కుమారైన ఓ గోదాదేవీ ! విష్ణుమూర్తి నీ ఇష్టమును చేసి అయిష్టమును మానుచున్నాడు. కావున అతడు నీ ''ఇంటికి కావలాకాయు సేవకుడా ?'' ''కంటికి కావలాకాయు సేవకుడా ? (ద్వారపాలకుడా ?) (కనుసన్నలలో మెలగువాడా ?)

భగవంతుని భక్తపరాధీనత ఇందు చమత్కరింపబడినది. ఉపజాతి–వృత్తము.

ప్రకృతిమతాం తపోఽభిచరతాం చ శరద్విషతః
పితురపి దేవి తేఽపి మురఘుస్మరభక్తిపరే !
"అణు మణిసాను" కల్పమిదమంతరమస్తి యతః
స్ఖలతి తవ ప్రియోఽపి సరసే నవరాగఝురే. 22

విష్ణుభక్తితత్పరురాలవైన ఓ గోదాదేవీ! విష్ణుభక్తిలో ప్రాకృతజనముకన్న ఋషులకున్ను, ఋషులకన్న ఆళ్వారులకున్ను, ఆళ్వారులకన్న నీ తండ్రిగారైన పెరియాళ్వారులకున్ను, వారికంటెను కూడ నీకును, "పరమాణువునకును మేరుపర్వతమునకును" గల తారతమ్యము గలదు. అందువల్లనే నీ ప్రభువైన శ్రీరంగనాథుడు కూడ సరసమైన నీ అనురాగప్రవాహములో తొట్రుపడు చున్నాడు.

ఇచట విష్ణుభక్తిలో ఒకరికంటె ఒకరికి అధిక్యత చూపబడి "గోదాదేవియే అందరికంటె ఎక్కువ" అను విషయము స్పష్టము చేయబడినది. ఎట్లనగా—

కేవలము శరీరమునే ఆత్మగా భావించు అస్మదాది ప్రాకృతపురుషుల కంటె—ఆత్మస్వరూపము కరతలామలకమై యున్న ఋషులకు అధిక్యత (పరమాణు—పర్వత తారతమ్యము).

అట్లే ఆళ్వారులను శ్రియఃపతియే స్వయముగా వరించి వారికి తన స్వరూపమును చూపినందువలన ఋషులకన్న వీరికి అధిక్యత—

ఆ ఆళ్వారులలో కూడ పెరియాళ్వారులు (విష్ణుచిత్తులు) భగవన్మంగళా శాసనతత్పరులైనందువలన వారికి అధిక్యత—

వారి కన్నను గోదాదేవికి అధిక్యత— ఎట్లనగా ఈమెయే స్వయముగా "సీలాతుంగస్తనగిరితటీసుప్తమైన" శ్రీహరిని స్వయముగా లేపి తన భక్తిని తెలిపినది. కావున అందరి భక్తికంటె ఈమెయొక్క భక్తియే ఎక్కువ— అని.

ఇది వీరందరి విష్ణుభక్తిలో ఒకరికంటె మరొకరికి పరమాణువునకును పర్వతమునకును గల తేడా గలదని చెప్పుటకు కారణము. ఈమెయొక్క జ్ఞానము నిత్యసూరులకు వలె సహజమైనది.

ప్రార్థనాశ్లోకమున "గురుతాం గతా" అను పదముద్వారానే "ఆమె అందరి కంటె మిన్న" అను విషయము సూచితము. నర్కుటక—వృత్తము.

యతః స్ఖలతి విభ్రమస్ఫురితలోలతాభ్రూలతా
తవ స్వయమియం సకృజ్జగతి విష్ణుచిత్తాత్మజే !
తతః ఫలతి సత్వరా సరసభారతీ భారతీ
రమా చ పలమా చరాచరసుధానిధిః శ్రీనిధిః. 23

ఓ గోదాదేవీ! విభ్రమములతో (విలాసాలతో) ప్రకాశించుచున్న నీయొక్క భ్రూలత ఎటువైపు స్వయముగా (ఒకరి ప్రేరణ లేకుండగ) ఒక్కసారి ప్రసరించునో, అప్పుడే అచ్చటనే సరసభారతియైన భారతి, ఉత్కృష్టురాలైన లక్ష్మీదేవి, స్థావరజంగమసుధానిధియైన శ్రీమన్నారాయణుడు, వీ రందరును వశమగుదురు.

ఒక పర్యాయము శ్రీగోదాదేవియొక్క భ్రూలత స్వయముగా చలించినంత మాత్రముననే లక్ష్మీసరస్వతులే గాక శ్రీమన్నారాయణుడు కూడ వశు డగునట్లు వర్ణింపబడినది.

శ్రీగుణరత్నకోశమున శ్రీపరాశరభట్టరు కూడ "రతిర్మతి సరస్వతీ-17" అను శ్లోకమున "లక్ష్మీదేవియొక్క భ్రూలత ఎటు చలించుటకు ఇచ్ఛగించునో ఆటు రతి-మతి-సరస్వత్యాదులు సిద్ధించును" అని వర్ణించియున్నారు.

ఈ కవిగారు కూడ ఆ అభిప్రాయమునే గాక అదే వృత్తమును కూడ స్వీకరించి గోదాదేవి విషయకముగా అన్వయింపచేసిరి. అనుప్రాస-యమకము. పృథ్వీ-వృత్తము.

సంసారరథ్యాతరళో య ఏషః
క్రీత_స్త్వయా దేవి ! కటాక్షలక్ష్మ్యా,
స ఏవ నూనం హృదయంగమ_స్తే
ముక్తావళీనాయకతాం దధాతి. 24

అమ్మా! సంసారమార్గమున కొట్టుమిట్టాడుచున్న ఈ జీవుడు నీయొక్క కటాక్షములచేత నీ వశము చేసికొనబడినవాడై, ఆ విధముగ నీచేత (దాసుడుగా) స్వీకరింపబడినకారణముగా హృదయంగముడై నీ ముత్యాల హారమునందు మధ్యమణి వలె ప్రకాశించుచున్నాడు.

ఇచట తరళ-శబ్దము చంచలమనియు, మహామణి యనియు రెండర్థములను చెప్పుచు జీవునకును హారమునందలి మధ్యమణికిని అన్వయించుచున్నది. ఆమెచే స్వీకరింపబడిన హారమునందు హృదయగతమై మధ్యమణి ప్రకాశించుచున్నట్లుగా, ఆమెచేత స్వీకరింపబడిన ఈ దాసుడు (కవిగారు) కూడ హృదయంగముడై ప్రకాశించుచున్నాడు- అని భావము. ఉపజాతి-వృత్తము.

పుమర్థలాభాయ హి పంచవార్షికీ
పచాంస్యపి త్రింశదుదీరయంత్యసి,
పఠేత్స యస్తు త్రిదశశ్రియం భజేత్
న చేత్ స నిస్త్రింశతయా నిషిధ్యతే. 25

అమ్మా! గోదా! పరమపురుషార్థమైన ముక్తి లభించుటకై చిన్నతనముననే ముప్పది పాశురములను (తిరుప్పావై) గానము చేసితివి. అట్టి ఆ ప్రబంధమును పఠించినవారు దైవీసంపదను పొందుదురు. పఠించనివారు ఆసురీసంపదను పొందుదురు.

''దైవీ సంపద్విమోక్షాయ నిబంధాయాసురీ మతా'' (దైవీసంపద మోక్షముకొరకును, ఆసురీసంపద నరకముకొరకును) అనెడి భగవద్గీతా 16 అ. 5 శ్లో) వాక్యము ఇచట స్మరణీయము.

గోదాదేవి చిన్నతనమునుండియు విష్ణుభక్తియందే నిమగ్నయై యున్నదనియు, ఆమెచే రచింపబడిన తిరుప్పావు మోక్షప్రద మనియు ఈ శ్లోక సారాంశము. ''విష్ణుగుణకీర్తనలోలుపా'' అనియు, ''ఆబాల్య దివ్యభగవత్ జ్ఞాన సంపత్ సముజ్జ్వలా'' అనియు గోదా అష్టోత్తరము. వంశస్థ-వృత్తము.

సుధాగతకథా గతా కృతమసాధునా సీధునా
హతా పయసి పేయతా కిముత చూతజాతో రసః,
అపాస్తమపి గోస్తనీఫలమటంతి యన్మాధురీ -
ధురీణమిహ దేవి! తే సుగుణశుక్తయస్సూక్తయః, 26

అమ్మా! సుగుణనిధులగు నీ సూక్తులు అంతటను వ్యాపించియుండగా, అమృతము యొక్క మాధుర్యకథ వినిపించుటలేదు. మద్యము కూడ అరుచి

యైనది. పాలయందలి మాధుర్యము కూడ తగ్గిపోయినది. మామిడిపండ్లరసము విషయమున కూడ ఇక వేరుగ చెప్పనక్కర లేదు మధురమైన ద్రాక్ష కూడ పులుపెక్కినది.

"లోకములో అన్నిటికన్న మధురములైన అమృతాదులకంటె కూడ గోదాశ్రీసూక్తులే అతిమధురములు" అని ఇచట కవిగారి అభిప్రాయము.
పృథ్వీ-వృత్తము.

ఏషా భాషా వదనకమలే యస్య చ స్యాత్త్వదీయా
తత్త్వేన త్వం న ఇతి బత! ధీః ముహ్యతీయం మురారేః,
వత్సాపాయే సురభిరభితశ్చర్మణా నిర్మితేఽపి
ప్రేమావిష్టా కపటపృథుకే యద్వదేతచ్చ తద్వత్. 27

ఓ తల్లీ! నీచే గానము చేయబడిన "తిరుప్పావు" అను స్తోత్రమయమగు భాష ఎవరి ముఖమున కలదో (ఎవరు నీచే రచింపబడిన తిరుప్పావును నిత్యము పారాయణచేయుదురో) వారియందు విష్ణువునకు "నీవే" అని భ్రాంతి కలుగుచున్నది

ఎట్లనగా దూడచనిపోగా చర్మముతో చేయబడిన కపటపుదూడ (దాటపెయ్య) యందు ఆవు తన బిడ్డయే అను భ్రాంతిని పొందును కదా! ఇక్కడ శ్రీహరివిషయమున కూడ అంతే.

ఇచట ఆవు దాటపెయ్యయందు తన బిడ్డే అని ఎట్లు భ్రాంతిని పొందునో అట్లే శ్రీహరి కూడ భక్తులయందు గోదాదేవి యను భ్రాంతిని పొందుచున్నట్లు వర్ణించబడినది.

అనగా శ్రీహరికి గోదాదేవియందు ఎట్టి వాత్సల్యము, అభిమానము, ప్రేమ కలవో భక్తులయందు కూడ అట్టి వాత్సల్యాదులే కలవని సారాంశము.
భ్రాంతిమదలంకారము, దృష్టాంతాలంకారము మందాక్రాంతా-వృత్తము.

భాషాభూషా నయనఘటనా శేముషీ వేషఘోష-
స్మేరాచార స్థితి గతి గుణాకార భాసౌరభాంతైః,
భావైరేవం బహు విరచితైః కాపి గోపీ కిమాసీః
తత్తే బాల్యం హరిరిహ వశో బ్రాహ్మణి! బ్రహ్మభూతః. 28

ఓ బ్రాహ్మణీ! మాటతీరు, అలంకారము, నేత్రాలంకారము (కాటుకవగైరా (బుద్ధి), వేషము, స్వరము, స్మితము, ఆచారము, ఉనికి, గమనము, గుణములు, ఆకారము, కాంతి -సౌరభము మొదలగు వానితో మనోహరములైన అనేక భావములతో నీ వొక గోపిక వైతివేమో ? అది నీ బాల్యము. పరబ్రహ్మయైన శ్రీహరి ఇప్పుడు నీకు వశుడైనాడు.

ఇచట గోదాదేవి వేషభాషాదులలో అన్ని విధముల గోపికగా మారినట్లు వర్ణించబడినది.

సౌరభ.పదమునకు "ముడనాత్తం" అని ద్రావిడమున చెప్పబడిన ''గొల్ల వాసన'' అను అర్థమును గ్రహించవలెను. ''బ్రాహ్మణి'' అను సంబోధనము ''నీవు బ్రాహ్మణస్త్రీవై యుండియు, గోపికలతో చేరి, నీవు కూడ ఒక గోపికవై- అందలి విశేషములన్నింటిని అనుభవించితివి'' అను అభిప్రాయముతో చేయబడినది.

''అహో! భాగ్యమహో! భాగ్యం నందగోపవ్రజౌకసాం'' (నందగోపుని ఆ గొల్లపల్లియందు జన్మించిన వారి భాగ్యమే భాగ్యము-) అని ఆ గొల్లపల్లి యందు పుట్టుకయే అదృష్టముగా భావింపబడినది.

ఆ విధముగ ఈమె ఒక గోపికయై వేషభాషా సౌరభాదులను కూడ అనుభవించినది.

"గోపీవేషధరా" గోదాష్టోత్తరమ్. మందాక్రాన్తా-వృత్తము.

ప్రాయః ప్రేమధురార్గళావిఘటితా యత్కేశవే శైశవే
రోషావేశవశాదివ ప్రకటితా గోపీవ్రతే తీవ్రతా,
అజ్ఞానాదివ తన్మయా చ రచితం కందర్పసంతర్పణం
గోదే ! దేవి ! భృశం స్పృశంతి ఖలు మే మర్మాణి కర్మాణి తే.

అమ్మా ! శైశవమునుండియు కేశవప్రేమ కలిగి "ఇతర దేవతారాధన చేయరాదు'' అను నియమమును కూడ దాటి (లెక్కచేయక) ఏమియు తెలియని దానివలె తీవ్రమైన గోపీభావముతో నీచేత మన్మథపూజ చేయబడినది.

ఓ గోదాదేవీ ! ఇట్టి నీ చరిత్రలు నా అంతరములను స్పృశించుచున్నవి.

"నాచ్చియార్ తిరుమొళి"యందు గోదాదేవిచేత మన్మథప్రార్థన చేయబడినది. "మొదటినుండియు విష్ణువునందే అనన్యభక్తిగల ఆమె ఇతరదేవతా ప్రార్థన చేయుట యుక్తముకాకపోయినను" "తీవ్రమైన అభినివేశము కలవారికి ఇది అనుచితము కాదు" అని "నాచ్చియార్ తిరుమొళి" వ్యాఖ్యాఅవతారిక తెలియచేయుచున్నది.

ఇచట "గోపీవ్రతే తీవ్రతా" అను ఈ వాక్యము పై విషయమును స్పష్టముచేయుచున్నది. శార్దూలవిక్రీడిత-వృత్తము.

> అతీతభగవజ్జనుర్విషయ భద్ర సంధాయినీ
> క్షితావిహ గతే జలే కమపి సేతుబంధం వ్యథాః,
> వయం తు తవ శైశవప్రకృతిరిత్యలం మన్మహే
> విచిత్రమిదమత్ర సా బుధపరంపరా ముహ్యతి. 30

అమ్మా ! అతీతములగు ఏ భగవదవతారములు కలవో- ఆ అవతార విషయకమైన మంగళాశాసనముల నాచరించుచు (అన్నివ్వులగమళందాయ్ అడిపోత్తి- తిరుప్పావు-24) భూమియందు నీవు గతజలసేతుబంధనము చేసితివి. దీనిని మేము నీయొక్క బాల్యచేష్టగా తలంచుచున్నాము. కాని ఇట్టి నీ బాల్యచేష్టయందే పండితప్రకాండము కూడ మోహమును చెందుచున్న దను విషయము ఆశ్చర్యమును కలుగచేయుచున్నది.

పండితు లనగా ఇచట భగవద్విషయకమైన ప్రేమకలవారు. పైన ఉదహరించిన మంగళాశాసనపాశురమునకు (తిరుప్పావు-24) అర్థము.

1) త్రివిక్రముడవై లోకములను కొలచిన నీకు మంగళము.
2) శ్రీరాముడవై లంకపై దండెత్తి దానిని రూపుమాపిన నీకు మంగళము.
3) శ్రీకృష్ణా! శకటాసురుని సంహరించిన నీకు మంగళము.
4) వత్సాసురుని సంహరించిన నీ శ్రీపాదములకు మంగళము.
5) దేవేంద్రుని గర్వమడంచుటకై గోవర్ధనపర్వత మెత్తి శిలావర్షము నాపిన నీకు మంగళము.

8) శత్రువినాశకరమగు నీ ఆయుధము (బల్లెము)నకు మంగళము- అని-

ఇది గోదాదేవి, గడచిన అవతారములను గూర్చి చేసిన, మంగళాశాసనము. అదియే ఆమె చేసిన "గతజలసేతుబంధనము"గా వర్ణింపబడినది.

గతజలసేతుబంధ మనగా- నీరంతయు పోయిన తరువాత ఆనకట్ట కట్టుట. ఇచట అ యా అవతారములు ఈమె ఉన్న సమయమున లేక పోయినను జరిగిపోయిన అ అవతార విషయము ప్రస్తావించబడి మంగళాశాసనము చేయబడినది- కావున అది గతజలసేతుబంధనము. పృథ్వీ-వృత్తము.

యేషాం కులం తిలకితం సుభగే! భవత్యా
తే సూరయ స్తవ కిల ప్రకృతిం ప్రపన్నాః,
శృంగారరూప-భవదద్భుత భక్తిసింధు-
రింగ త్తరంగ-మరుదంకుర-తాడనేన. 31

అమ్మా! నీవు ఎవరి వంశమున జన్మించితివో ఆ ఆళ్వారులు నీయొక్క ప్రకృతినే పొందిరి. దానికి కారణము శృంగారరూపమైన అద్భుతమైన నీయొక్క భక్తి అనెడి సముద్రతరంగ-మరుదంకురములయొక్క తాడియే-

ఆళ్వారు లందరును నాయికాభావమును పొందుటకు కారణము "గోదాదేవి యొక్క భక్తిప్రభావమే" అని వర్ణింపబడినది.

వారి భక్తి భగవద్దత్తము. ఈమెభక్తి సహజము. ఈమె సహజముగా స్త్రీయై పరమాత్మను ప్రేమించినది. వారు (ఆళ్వారులు) అందరు పురుషులై యుండి తమయందు స్త్రీత్వమును (నాయికాత్వమును) ఆరోపించుకొని పరమాత్మను ప్రేమించిరి. పురుషుడు పురుషుని ప్రేమించుటకంటె ఒక స్త్రీ పురుషుని ప్రేమించుటలో ఔచిత్యము, విశేషము కూడ కలదు. కావుననే ఈమె గురువులకు కూడ గురువైనది. "భోక్తుం తవ" అను వేదాంతదేశికుల గోదాస్తుతి- 8వ శ్లోకములో కూడ ఈ విషయము చెప్పబడినది.

ఈ స్తోత్రముననే 1, 22, శ్లోకములలో కూడ ఈమెయొక్క గురుత్వము ప్రతిపాదింపబడినది. వసంతతిలకా-వృత్తము.

శ్రీవిష్ణుచిత్తమునిపుంగవ-గర్భజాతా
మాతా సతాం చ యతిచంద్రమసః స్వసా త్వమ్,
లక్ష్మీం జడధ్యుదరజాం కిమిహాతిశేషే
దోషాకరస్య భగినీం మదనైకపుత్రామ్ ।  22

అమ్మా! శ్రీ విష్ణుచిత్తమునిపుంగవుని కుమార్తెవై జనించి, భగవద్రామానుజులకు సోదరివై, సత్పురుషులకు మాతవైయున్న, నీవు, కేవలము జడధి (మందబుద్ధి-సముద్రము)కి జన్మించినట్టియు, దోషాకరు (దోషములకు ఆకరమైనవాడు- రాత్రినిచేయువాడు- చంద్రుడు) నకు సోదరియైనట్టియు, మదనుడొక్కడే పుత్రుడుగా కలట్టియు లక్ష్మిదేవిని, అతిశయించుచున్నావా !

ఇచట "లక్ష్మిదేవికంటె గోదాదేవియే మిన్న-" అని వర్ణింపబడినది- ఎట్లనగా—— లక్ష్మి జడధి (మందబుద్ధి) యొక్క కుమార్తె- జలధి అనగా సముద్రము- ఈ సముద్రముయొక్క కుమార్తెయైన లక్ష్మి లకార డకారములకు తేడా లేకపోవుటను బట్టి జడధియొక్క కుమార్తెగా వర్ణింపబడినది- మరి గోదాదేవియో- విష్ణుచిత్తమునిపుంగవుల కుమార్తె- జడధియొక్క కుమార్తె కంటె మునిపుంగవుల కుమార్తెకు అధిక్యత గదా !

మరియు లక్ష్మి దోషాకరుని సోదరి. "రాత్రి"కి "దోషా" అని కూడ ఒక పేరు- ఆ రాత్రిని కలుగచేయువాడు "దోషా+కరుడు" చంద్రుడు. అట్టి నింద్రుడు ఇచట సంధిలో విశేషమువలన "దోష- ఆకరుడు" (దోషములకు చలయమైనవాడు) గా వర్ణింపబడినాడు. అట్టివాని సోదరి లక్ష్మిదేవి. మరి గోదాదేవియో యతిసార్వభౌములైన భగద్రామానుజులకు సోదరి.

అట్లే లక్ష్మికి ఒక్కడే కుమారుడు. అతడు కూడ అందరను బాధపెట్టు స్వభావము కల మన్మథుడు. మరి గోదాదేవికో-సత్పురుష అందరును ఆమెయొక్క సంతానమే.

ఈ విధముగా లక్ష్మిదేవికంటె గోదాదేవియొక్క అధిక్యత ఇచట చమత్కరింపబడినది.

"అనపాయవిష్ణుపద" అను "యతిరాజసప్తతి–17" శ్లోకము యొక్క ఛాయ ఇందు గలదు. శ్లేష–రూపకాలంకారములు. వసంతతిలకా వృత్తము.

దేవ్యస్సన్తు సహస్రముల్బణగుణాటోపేన రూపేణ వా
యుక్తా త్వం బత! రంగిణస్తు చరమా పత్నీ సపత్నీ శ్రియః,
ప్రాయ స్త్వేష విధిం విధూయ మధురం రాగస్రవంతీమయం
బధ్నాతి స్వయమన్యదిక్షు హృదయం హిత్వా, న హి, త్వా హరిః.

విష్ణుమూర్తికి దేవేరులు వేసక వేలుందురు గాక– కాని గుణములను బట్టిగాని, రూపమును బట్టిగాని శ్రీరంగనాథునకు కనిష్ఠభార్యగా లక్ష్మీదేవికి సవతిగా నీవే తగినదానవు శ్రేష్ఠురాలవు కూడ. ఎందువల్లననగా- రంగపతిశయన కాలికమైన నియమమును (అనగా దక్షిణదిక్కును చూచుచు నిదురించరాదు అను నియమమును) కూడ, ఆఖరి భార్యవు, అందరికంటె ప్రియురాలవు– అయిన నీయందలి భావబంధము చేతనే వదలి, శ్రేష్ఠములైన తూర్పు, ఉత్తరము మొదలగు దిక్కులయందు సైతము హృదయమును వీడి నీ వవతరించిన దక్షిణ దిక్కునందే హృదయమును బంధించినాడు.

వేదాంతదేశికుల గోదాస్తుతిలోని "దిగ్దక్షిణాపి పరిపక్త్రిమపుణ్యల భ్యాత్-11" అను శ్లోకముయొక్క భావము ఇందు కనపడుచున్నది. శార్దూలవిక్రీడిత-వృత్తము.

పద్మాతిశాయి నయనం పరిభూతనీలం
ధమ్మిల్లరోచిరధరస్తు రసాతిరేకి,
ఏకైకతోఽవయవతః కిల దివ్యదేవీః
దేవి! త్వమత్ర నితరామతిలంఘితాసి. 34

దేవీ! పద్మాతిశాయి ([1]పద్మమును- [2]లక్ష్మిని- అతిశయించెడి) నేత్ర సౌందర్యము, నీలరుచిని ([1]ఇంద్రనీలమణిని- [2]నీలాదేవిని) తిరస్కరించు కేశ సౌందర్యము రసాతిరేకియైన ([1]ఎక్కువరుచిగల –[2]భూమిని అతిశయించిన) అధరము కల నీవు నీయొక్క ఒక్కొక్క అవయవశోభతో ఒక్కొక్క దివ్యమహిషిని అతిక్రమించినావు.

ఇచట పదములకు-

| | |
|---|---|
| 1) పద్మ అతిశాయి | 1) పద్మమును అతిశయించినది. |
| పద్మా అతిశాయి | 2) లక్ష్మిని అతిశయించినది. |
| 2) పరిభూతనీలం | 1) నల్లని ఇంద్రనీలమణిని తిరస్కరించినది. |
| | 2) నీలాదేవిని తిరస్కరించినది. |
| 3) రస అతిరేకి | 1) ఎక్కువ రుచి గలది |
| రసా అతిరేకి | 2) భూమిని తిరస్కరించునది. |

అని రెండేసి అర్థములను చెప్పుకొన్నచో [1]సంపద [2]ధమ్మిల్ల [3]అధర శోభలతో [1]శ్రీ [2]నీలా [3]భూదేవులను అతిక్రమించినది గోదాదేవి అను అర్థము వచ్చును-శ్రీహరిదేవేరులలో ప్రధానులు ఆ ముగ్గురే కదా- 32వ శ్లోకములో గోదాదేవి లక్ష్మిని అతిక్రమించినట్లు వర్ణించబడినది. 33, 34 శ్లోకములలో లక్ష్మీదేవితో పాటు విష్ణుమూర్తియొక్క ఇతర దేవేరులకంటె కూడ ఈమెకు ఆధిక్యత వర్ణింపబడినది. శ్లేషాలంకారము, వసంతతిలకా-వృత్తము.

శ్రేయో నః ఫలయతు దేవి! తే విచిత్రా
విస్ఫూర్జత్తరళతటిద్రుచిం వమంత్యామ్,
నిత్యాయా-మవయవపాళి - ధాళధళ్యాం
ఉన్నేయా మరకతభంగగర్భలక్ష్మీః. 35

దేవీ! విచిత్రముగా ప్రకాశించు చంచలమైన మెరపుయొక్క కాంతిని కలిగినట్టిదియు, ఎల్లప్పుడును అనశ్వరముగా నుండునట్టిదియు, అయిన నీ అవయవ సముదాయముయొక్క "ధళధళ" (నిగనిగ) యందు ఊహించదగిన మరకతభంగముయొక్క మధ్యయందలి కాంతివంటికాంతి మాకు శ్రేయస్సును కలిగించును గాక. ప్రహర్షిణీ-వృత్తము.

కరే కమలకుట్మలం కబరమండలే మాలతీ
ముఖే తిలకరేఖికా మృదుగళే తు ముక్తాస్రజః,
స్తనే చ మణికంచుళీ, కనకదామ మధ్యే, కటౌ
కడారవసనం, పదే కటకమంబ! మే భావనా. 36

అమ్మా! చేతియందు విలాసముకొరకైన కమలపుమొగ్గ, కేశపాశముల యందు మాలతీకుసుమము, ముఖమునందు తిలకము, సుకుమారమైన గళసీమ యందు ముత్యాలహారము, స్తనములయందు మణిమయమైన కంచుకము, నడుమున వడ్డాణము, కటియందు కడారవస్త్రము, కాలియందు కడియము- కల నీయొక్క రూపము నిత్యము నా కనులయందు సాక్షాత్కరించుచున్నది.

(ఇది ధ్యానశ్లోకము)

శ్రీగుణరత్నకోశమున "కనకరశనా-46" అను శ్లోకమున శ్రీపరాశర భట్టార్యులు కూడ ఇట్లే వర్ణించియున్నారు.

"సద్రత్నాంచితవిద్యోత విద్యుత్పుంజాభ శాటికా"

"అత్యర్కానలతేజోఽధిమణికంచుకధారిణీ" గోదా అష్టోత్తరమ్. స్వభావోక్తి అలంకారము. పృథ్వీ-వృత్తము.

యత్తే శిరీషకుసుమాత్ సుకుమారమంగం
స్స్పష్టుం కరేణ గిరిధారణకర్కశేన,
అస్పృష్టమప్యుదితరాగ భరేణ శౌరిః
పార్శ్వే పరిభ్రమతి, తే, నితరామశక్తః. 37

దేవి! శిరీషకుసుమపేశలము అస్పృష్టపూర్వము అగు నీ శరీరమును, ఉదయించిన అనురాగముచే నిండిన (ఎఱ్ఱబడిన) దైనను, పర్వతధారణమువలన కర్కశమైన చేతితో స్పృశించుటకు కూడ అశక్తుడై శ్రీహరి నీ చుట్టును తిరుగుచున్నాడు.

ఇందు గోదాదేవియొక్క శరీరసౌకుమార్యము, శ్రీహరికి ఆమెయందలి అనురాగము వర్ణించబడినవి. వసంతతిలకా-వృత్తము.

ముక్తాహేమమయం విభూషణమియం ధత్తే చ యత్తే తనుః
కల్యాణీ! హ పురాకృతాద్రిభరణాఖ్యానేన తే సాంప్రతమ్,
మామేతన్న సుఖాకరోతి నితరాముద్యచ్ఛిరీషావళీ-
సౌహార్దం తవ మార్దవం ముహురహో దృష్టం నవం శైశవమ్.

మంగళప్రదురాలా! పూర్వజన్మలో భూదేవిగా పర్వతాదులను భరించిన దానవగుటవలన ఇప్పుడు నీ శరీరము ముక్తాహేమమయములగు ఆభరణములను ధరించుట యుక్తమే. కాని శిరీషపేశలమైన నీ శరీరమునందలి మార్దవమును, నీ నవశైశవభావమును చూచుచున్న నాకు నీ అలంకారభరణము సుఖమును కలుగచేయుటలేదు.

అనగా "ఆ అలంకారములు ఆమె శరీరమునకు భారమును కలిగించుచున్నవి" అని అభిప్రాయము.

శ్రీగుణరత్నకోశము -"సామాన్యభోగ్యమపి-47" అను శ్లోకమున శ్రీభట్టరులు కూడ "అమ్మా! నీవు ధరించినచో నీకు భారముకలుగుననెడి ఉద్దేశ్యముతో కౌస్తుభము వైజయంతి-మొదలగు అలంకారములను పంచాయుధములను- శ్రీహరి తానే ధరించుచు నిన్ననుసరించుచున్నాడు " అని వర్ణించియుండిరి. శార్దూలవిక్రీడిత-వృత్తము.

పూరః కాంతేః, నవపరిణతిర్విభ్రమాణాం, మ్రదిమ్నః
క్రోడీకారః, కుసుమసురభేరుచ్ఛ్రయో, మాధురీణామ్,
ధారాపాతః(సారః), ప్రసదనవిధేః సంగ్రహస్తే, కిమేషా
వ్యక్తిర్మాతః! జయతి నితరాం కృష్ణసంపత్సమష్టిః. 39

జననీ! కృష్ణునియొక్క సంపదల సముదాయము- నీయందు సర్వోత్కర్షగా ఉన్నది. అదెట్లనగా: -కాంతియొక్క పూర్ణత్వము, విలాసాలయొక్క నూతనపరిణామము, సౌకుమార్యముయొక్క క్రోడీకారము, కుసుమగంధముల యొక్క అతిశయము, మాధుర్యముయొక్క ధారాపాతము లేదా ధారాసారము (ఎడతెరపిలేకుండ ఉండుట), అలంకరణలయొక్క సంగ్రహము—

ఈ విధముగా నీయందలి లక్షణములన్నియు పరమాత్మకొరకే అనునట్లు కనుపించుచున్నవి. అంతియేగాక అతనిని పొందుటకొరకై అతని(కృష్ణుని) యొక్క గుణములనే నీవు అలవరచుకొన్నట్లున్నది. మందాక్రాన్తా-వృత్తము.

గాత్రం కేవలపేశలం న తు సహం సంశ్లేషవిశ్లేషయోః
ఇత్యాలోచ్య తయోరసౌ తవ వపుఃపర్యస్తమధ్యాపయన్,
నిత్యం భావనపేశలో విలసితైః దృగ్గోచరాగోచరైః
చాతుర్యేణ నవం నవం న భవతీం పుష్ణాతి కృష్ణః స్వయమ్. 40

అమ్మా ! అత్యంతమృదువైన నీ శరీరము సంశ్లేషవిశ్లేషములను తట్టుకొనలేదనెడి భావనతో, పేశలమైన నీ భావనలోనుండి, కృష్ణుడు దృగ్గోచరాగోచరుడై చాతుర్యముతో నిన్ను క్రొంగ్రొత్తగా అలరింపచేయుచున్నాడు.

దృగ్గోచరాగోచరత్వ మనగా- మానససాక్షాత్కారమువలన కలిగిన ఆనందము- ఆ ఆనందము అనుభవమునకు రాకుండుట (అనగా యథార్థము కాకుండుట). శార్దూలవిక్రీడిత-వృత్తము.

త్వాం విష్ణుచిత్తతనయాం నభసి ప్రరూఢాం
కృష్ణాంకగామపి నిశాకమనీయరూపామ్,
ధౌతాంశుకామమలపాదసుధావతారాం
మన్యేఽహమంబ! బుధమాతరమిందులేఖామ్. 41

అమ్మా! విష్ణుచిత్తుల కుమార్తెవై కృష్ణుని ఆశ్రయించి, నిశాకమనీయరూపవై, స్వచ్ఛమైన వస్త్రములుకలిగి, శుభ్రములైన పాదములతో అమృతస్వరూపిణివై, బుధులకు తల్లివైన నిన్ను ఆకాశమున నున్న చంద్రలేఖవలె భావింతును.

ఇచట విశేషణములన్నియు శ్లిష్టములై గోదాదేవికిని చంద్రలేఖకును కూడ సరిపోవుచున్నవి- ఎట్లన,—

1) విష్ణుచిత్తతనయా 1) గోదాదేవి 2) చంద్రలేఖ.

1) గోదాదేవి విష్ణుచిత్తుల కుమార్తె.

2) చంద్రలేఖ విష్ణువుయొక్క మనసున పుట్టిన తనయ. "చంద్రమా మనసో జాతః" అని చంద్రుడు విష్ణువుయొక్క మనసునుండి పుట్టినవాడు. అయితే ఇక్కడ గోదాదేవికి ఉపమానముగా స్త్రీలింగముగా చంద్రలేఖ చెప్పబడినది.

2) నభసి ప్రరూఢా :—

1) శ్రావణమాసమున పుట్టినది- గోదాదేవి.

2) ఆకాశమున పుట్టినది- చంద్రలేఖ.

(గోదాదేవియొక్క ఆవిర్భావము- కర్కాటక పూర్వఫల్గునియందు- ఆమె యొక్క తిరునక్షత్రము ఒక్కొక్కప్పుడు శ్రావణమాసములో కూడ వచ్చుచుండును)

(3) (A) కృష్ణాంకగా (అపి) (B) నిశాకమనీయరూపా 1 (a) కృష్ణుని ఆశ్రయించినది (b) మరియు రాత్రివలె ప్రకాశించు (నీల) రూపము గలది- గోదాదేవి.

2 (a) నల్లని మచ్చగలదైనను (b) రాత్రియందు ప్రకాశించునది, చంద్రలేఖ. (ఈ అర్థమున విరోధాభాసాలంకారము.)

(4) ధౌతాంశుకా :- 1) తెల్లటి వస్త్రములు కలది- గోదాదేవి.

2) తెల్లటి కిరణములు కలది- చంద్రలేఖ.

(5) అమలపాదసుధావతారా :—

1) స్వచ్ఛములైన పాదములు కలిగి అమృతస్వరూపిణియైనది — గోదాదేవి.

2) స్వచ్ఛములైన అమృతస్వరూపములైన కిరణములు గలది— చంద్రలేఖ.

(6) బుధమాతః :—1) పండితులకు తల్లి —గోదాదేవి.

2) బుధునకు తల్లి -చంద్రలేఖ.

(బుధగ్రహమును చంద్రుని కుమారునిగా చెప్పుదురు. ఇచట చంద్రలేఖ స్త్రీలింగము కావున అదియే బుధునకు తల్లిగా చెప్పబడినది.)

ఈ విధముగా ఈ శ్లోకమున విశేషణము లన్నియు గోదాదేవికిని చంద్రలేఖకును కూడ వర్తించుచున్నవి. "త్వాం" "ఇందులేఖాం" అను పదములు విశేష్యములు.

ఇందు రూపకము, ఉత్ప్రేక్ష, శ్లేష, పరోధాభాన అను అలంకారములు కలవు.

"శ్యామా" "కృష్ణానురక్తా" "వేదార్థభావవిదితతత్త్వబోధాంఘ్రిపంకజా" గోదా అష్టోత్తర శతనామములలోని ఈ నామములు ఇందు వర్ణించును. వసంత తిలకా-వృత్తము.

విబుధాశ్రయణీయపాదపీఠాం
అతిసౌమ్యాం నవసౌరభాభిరామామ్,
భవతీం మహతీం వృషైకలభ్యాం
కలయే కాంక్షితదాత్రి! కల్పశాఖామ్. 42

విబుధులచేత ఆశ్రయించదగిన పాదపీఠము కలిగినట్టియు, సౌమ్య స్వరూపము కలిగినట్టియు, నూత్నసౌరభముతో మనోహరమైనట్టియు, "వృషైక లభ్య" అయినట్టియు, కోరినకోరికలను నెరవేర్చుటలో కల్పశాఖయైనట్టియు, గొప్పమాహాత్మ్యము కలిగినట్టియు నిన్ను సేవించెదను.

ఇచట విశేషణము లన్నియు గోదాదేవితోపాటు కల్పశాఖకు కూడ వర్తించును.

విబుధు లనగా పండితులు- దేవతలు- అని రెండర్థములు. పండితు లందరు గురుస్థానమున నున్న గోదాదేవి యొక్క పాదపీఠమును ఆశ్రయించె దరు. దేవతలు కల్పవృక్షముయొక్క పాదపీఠమును ఆశ్రయించెదరు.

(గోదాదేవి విషయమున కూడ "దేవతలచేత ఆశ్రయింపబడు పాద పీఠముకలది" అను అర్థము కూడ చెప్పుకొనవచ్చును శ్రీ-భూ-నీలాదేవులతో పాటు గోదాదేవి కూడ శ్రీహరిదేవేరులలో చేరినదే కావున ఆ విధముగా ఆమె దేవతలచేత కూడ నమస్కరించబడుచున్నది- అని సమన్వయము.)

అట్లే "వృషైకలభ్యాం" అను పదమునకు కూడ రెండర్థములు. శ్రీహరిచేత మాత్రమే పొందతగినది" "గోదాదేవి". ఇంద్రునిచేత మాత్రమే పొందతగినది." "కల్పశాఖ "వృషఏకలభ్యా" అనియు "వృషా ఏకలభ్యా" అనియు రెండర్థములలోను పదవిభాగము. వృషః=విష్ణువు

(తన వాక్కును వర్షించి తాపమును చల్లార్చువాడు) విష్ణుసహస్రనామము-314 (శిఖండీ నహుషో వృషః). ఇది విష్ణుపరము. అట్లే "వాసవో వృత్రహా వృషా" అమరకోశమున ఇంద్రపరమైన వృషాపదము.

ఈ విధముగా ఈ శ్లోకమున "విబుధ" "వృషైకలభ్యా" పదములకు ఒక్కొక్క పదమునకు రెండేసి అర్థములు. మిగిలిన పదములకు అర్థములు సమానములు. కావున శబ్దశ్లేష-అర్థశ్లేష కూడ ఇందు కలవు. ఔపచ్ఛందసిక-వృత్తము.

ఉభయభువనయోర్వా భూరిదానాత్ బుభుక్షోః
(ఉత) అథ! జనని! ముముక్షోః దృష్టిభూతేశదానాత్,
ద్రవిడవచనదానాత్ తాపశాంత్యై జగత్యాం
భవతి మమ నిధానం దేవి! గోదాభిధానమ్. 43

దేవీ! భోగానక్తునకు ఇహపరములలోని సమస్తము నిచ్చుటకు హేతువైనట్టియు, ముముక్షువునకు కావలసిన ఈశ్వరుని (పరమాత్మను) ఇచ్చుటకు (చూపుటకు) హేతువైనట్టియు, జగత్తునందు తాపశాంతికై ద్రవిడవచనముల (తిరుప్పావు) నిచ్చుటకు హేతువైనట్టియు, "గోదా" (అన్నింటిని-అన్నిసుఖములను-ఇచ్చునది) అను నామమే నాకు గల పెన్నిధి.

"గోదా" "మోక్షప్రదాననిపుణా" అని గోదా అష్టోత్తరమ్. మాలినీ-వృత్తము.

అహమాశ్రయామి గోదే!
పాదౌ తే పద్మపేశలప్రకృతీ,
అవనాయ మాదృశానా-
మిహ నూపురబంధబంధురావేతౌ. 44

గోదాదేవీ! పద్మమువలె సుకుమారములైన నీయొక్క పాదములను ఆశ్రయించుచున్నాను, అవెట్టివనగా —మాబోటివారలను రక్షించుటకో - అనునట్లుగా నూపురము అను బంధముతో ప్రకాశించుచున్నట్టివి.

బంధముతో నున్నవారలు ఎక్కడకును కదలలేరు. అట్లే ఇచట గోదా దేవికి నూపురమే బంధముగా వర్ణించబడినది- ఆ బంధము మరియొక విధముగా వచ్చినది కాదు. తానే స్వయముగా ఎప్పుడును భూమియందే ఉండి మనబోంట్లను రక్షించుటకై స్వయముగా వేసికొన్నది.

అనగా "భక్తజనులను రక్షించుటకు దీక్ష బూని నిత్యము ఈ భూమి యందే నివాస మేర్పరచుకొనిన గోదాదేవియొక్క పాదద్వయమును ఆశ్రయించు చున్నాను" అను శరణాగతి ఇందు సూచితము. ఈ శ్లోకమునుండి 93వ శ్లోకము వరకును గోదాదేవి యొక్క అవయవవర్ణన చేయబడుచున్నది.

రూపకాలంకారము-వ్యంగ్యశ్లేష. ఆర్యా-వృత్తము.

మధ్యేవారి ధృతాక్షమాలమనిశం తప్త్వా తపఃపంకజం
సాక్షాదంకమిషాన్నిధాయ నితరాం పంకం శశాంకే రిపౌ,
స్నిగ్ధే! దేవి! తవాననే చిరభృతం లావణ్యపుణ్యం తథా
ధౌతం సద్భజతే బతామృతమయం రేఖాత్మనా తే పదమ్. 45

స్నేహశీలవగు ఓ దేవీ! పద్మము బొడ్డు అనే అక్షమాలను ధరించి, ఎడతెగని తపస్సు చేసి తనయందున్న పాపరూపమైన బురదను అంకము అనే మిషతో శత్రువైన చంద్రునియందు పులిమి, చాలకాలమునుండి సంపాదించు కొనిన లావణ్య మను పుణ్యమును నీ ఆననమునందు ఉంచి, ఆ విధముగా స్వచ్ఛమైనదై, తత్ఫలమై అమృతమయమైన నీ పదమును రేఖాత్మగా పొందు చున్నది. (దివ్యస్థాన ప్రాప్తి).

ఇచట పద్మము తపస్సుచేసి సాధించినది గోదాదేవియొక్క పదము నందు రేఖాత్మగా స్థానము. అనగా ఆమెయొక్క పాదములయందు పద్మరేఖ లున్న వని ఒక అర్థము. (ఆమెపాదములు పద్మముతో సమానముగా నున్నవని మరియొక అర్థము) లేదా పద్మమే ఆమెయొక్క పాదముతో కొద్దిగా సామ్యమును పొందుచున్నది.

ఈ విధముగా ఇచట మిషాత్ అను పదప్రయోగమువలన అపహ్నవా లంకారము, పద్మమే పాదసామ్యమును పొందుచున్నదనుటవలన ప్రతీపాలం కారము కలవు.

మరియొక విధముగా- "తస్య పుత్రా దాయముపయన్తి- సుహృదః సాధుకృత్యాం -ద్విషన్తః పాపకృత్యాం" (మానవుని దేహక్షయమున పుత్రులు దాయమును, మిత్రులు పుణ్యఫలమును, శత్రువులు పాపఫలమును పొందుదురు) అను శ్రుతి ననుసరించి ఇచట పద్మము తన పాపఫలమైన బురదను శత్రువైన చంద్రునియందును, పుణ్యఫలమైన లావణ్యమును గోదాదేవియొక్క ముఖము నందును ఉంచినట్లు వర్ణింపబడినది. స్నిగ్ధే! అను సంబోధనము మిత్రత్వమును సూచించుచున్నది మరియు ఈ "స్నిగ్ధే" అను పదము సప్తమీవిభక్తి, ఏక వచనముగా అననమునకు విశేషణము కూడ అగుచున్నది. అప్పుడు కూడ అననమునకు మిత్రత్వము సిద్ధించును. అట్లే పంకజ -శశాంకపదములు కూడ సార్థకములు.

"పద్మము ఎంత తపస్సుచేసినను గోదాదేవియొక్క పాదస్థానమును రేఖా మాత్రముననే పొందుచున్నది" అను ఈ వర్ణన– "ఈ చిలుక నీ అధరముతో సమానమైన దొండపండును కొరకుటకు ఎంత తపస్సుచేసినది?" అన (కవుల) వర్ణనతో సమానముగా నున్నది. "అధరముతో సమానమైన దొండపండును కొరకుటకే అంత తపస్సుచేయవలసిరాగా సాక్షాత్తు అధరమును కొరకుటకు ఇంకా ఎంత తపస్సుచేయవలసివచ్చునో" అని– "శిఖరిణి క్వను నామ కియచ్చిరం" అనునది ఆ శ్లోకము.

ప్రస్తుతము ఈ శ్లోకమున కూడ "ఆమెపాదములయందు రేఖాత్మగా స్థానమును పొందుటకే అంత తపస్సుచేయవలసిరాగా– పూర్తిగా ఆమెపాదముతో సామ్యమును పొందుటకు పద్మము– ఇంకను ఎంత తపస్సు చేయవలసివచ్చునో?" అని చెప్పుకొనవచ్చును.

మరియు ఈ శ్లోకమున "అశ్రిత్య మానమమృతద్యుతయః" అను అప్పయ్యదీక్షితుని "వరదరాజస్తవము"నందలి శ్లోకముయొక్క ఛాయ కనపడు చున్నది.

"పంకజము తపస్సుచేసి ఆమెయొక్క పదమును (స్థానమును) పొందు చున్నది" అని వర్ణించుట ద్వారా "ఒక ముముక్షువుయొక్క దేహక్షయమున

దివ్యదేశప్రాప్తి" వ్యక్తమగుచున్నది. ముముక్షువు కూడ అవసానదశలో తన పాపఫలమును శత్రువులకు, పుణ్యఫలమును మిత్రులకు పంచి, ఏమియు మిగ లనివాడై, పరమపదమును పొందును

ఈ విధముగా ఇచట ప్రకృతమైన పంకజవృత్తాంతము ద్వారా అప్రకృత ముముక్షువృత్తాంతము గమ్యమానమగుచున్నది. కావున — సమాసోక్తి — అలంకా రము.

లేదా- స్తోత్ర ప్రాశస్త్యమును బట్టి పంకజము అప్రకృతము, ముము క్షువు ప్రకృతము కాబట్టి- అప్రకృతపంకజవృత్తాంతము ద్వారా ప్రకృత ముముక్షువృత్తాంతము గమ్యమానమగుచున్నది- కావున- అప్రస్తుతప్రశంసా లంకారము.

లేదా వర్ణనను బట్టి పంకజము, స్తోత్రమును బట్టి ముముక్షువు- రెండును ప్రకృతములే, అనుకొనినచో ప్రకృతమైన పంకజవృత్తాంతము ద్వారా ప్రకృత మైన ముముక్షువృత్తాంతము గమ్యమానమగుచున్నది కావున- ప్రస్తుతాంకురా లంకారము ఈ మూడింటిలో అప్రస్తుతప్రశంసకే ప్రాధాన్యము.

ప్రథమద్వితీయపాదములలో అనుప్రాస కూడ కలదు. శార్దూలవిక్రీడిత- వృత్తము.

పద్మాప్రియస్య హి విధోర్దశధావతారః
కార్యో న సంశయ ఇతీహ సుదాకరేణ,
సంకల్పితాన్నఖమిషేణ దశావతారాన్
పశ్యంతి దేవి! కవయః పదయోః ప్రపన్నాః. 46

దేవి, నీయొక్క- పాదములయందు ప్రపన్నులైన కవులు "పద్మా(లక్ష్మి) ప్రియుడైన విధువు(శ్రీహరి) పది అవతారములను ఎత్తినట్లుగా, పద్మాప్రియు డను(పద్మప్రియ) విధువును అయిన నేను (చంద్రుడు) కూడ పది అవతార ములను ఎత్తుదును" అని సంకల్పించిన చంద్రునిచేత నీ పాదనఖరూపములతో, పది అవతారములను ఎత్తబడినట్లుగా భావించుచున్నారు.

అనగా ఆమె కాలిగోళ్ళు చంద్రరేఖ వలె స్వచ్ఛముగా నున్న వని భావము. విధుః (= శ్రీహరి, చంద్రుడు) (విధుః శ్రీవత్సలాంఛనః-విష్ణువు, (విధుః సుధాంశుః శుభ్రాంశుః- చంద్రుడు) - అని అమరకోశము.

పద్మాప్రియ శబ్దమునకు లక్ష్మికి భర్త, పద్మములకు అప్రియుడు (పద్మా, ప్రియ-పద్మ, అప్రియ) అను పదవిభాగముచే శ్రీహరికి చంద్రునకు సంబంధించిన అర్థములు వచ్చును. ఈ విధముగా పద్మాప్రియశబ్దము శ్లిష్టము. ఉత్ప్రేక్షాలంకారము.

"చంద్రఖండనఖాంచితా" గోదాఅష్టోత్తరమ్. వసంతతిలకా-వృత్తము.

మృదునోః స్తవాంఘ్రితలయోః
ఉపమానం నేతి కిం వృథా గర్వః,
అచిరాత్పల్లవగర్భే!
మాతరుదేత్యేవ పల్లవః కోఽపి. 47

అమ్మా! మృదువులైన నీ అంఘ్రితలములకు (అరికాళ్ళకు) ఉపమానము లేదని వృథా గర్వ మేల?

త్వరలోనే పల్లవగర్భమున ఒక పల్లవము ఉదయించ గలదు.

ఇచట గోదాదేవి యొక్క అరికాళ్ళయొక్క సౌకుమార్యము (మార్దవము) వర్ణించబడినది.

ఆమె యొక్క పాదములయొక్క మార్దవము పరికించినచో అతిసుకుమారమైన పల్లవముకూడ దానికన్న కఠినముగా కనిపించుచున్న దని అర్థము. "నీ శరీరమార్దవము ముందు మాలతి, చంద్రలేఖ, అరటిచెట్టు మొదలైనవి కఠినములుగా కన్పించుచున్నవి" అని చంద్రాలోకము.

మరియు "పల్లవము ఉదయించగలదు" అని వర్ణించుటవలన "ఆమె అరికాళ్ళకు ఉపమానముగా ఏదైనను పుట్టవలసినదే తప్ప— లోకములో ఇంతవరకును ఉన్నవేమియు ఉపమానములుగా అనర్హములు" అని చెప్పినట్లయినది.

ఆర్యా-వృత్తము.

పిబతి కమలగర్భో దుర్భరం వారిపూరం
ధ్రువమిహ తవ జంఘాద్యోతవిద్రావితోఽయమ్,
ఇదమపి తదవస్థం మారతూణీరయుగ్మం
భజతి శరసమూహాపూరితస్వాత్మగర్భమ్. 48

అమ్మా! నీయొక్క జంఘలకాంతిచేత పారద్రోలబడినదై కమలము యొక్క కేసరములతో కూడిన "బొడ్డు" దుర్భరమైన వారిపూరమును త్రాగు చున్నది. అట్లే శరసమూహముతో నిండిన మన్మథుని తూణీరద్వయము (అమ్ముల పొదులజంట) కూడ అదే అవస్థను పొందుచున్నది.

ఇతరులతో పోటీచేసి ఓడిపోయి పారిపోయినవారిని "నీళ్ళు త్రాగాడు" అంటారు. ఇచట కమలగర్భము స్వతః నీళ్ళలో ఉండునదే అయినను గోదాదేవి యొక్క జంఘలకాంతిచేత పారద్రోలబడిన కాంతిగలదగుటవలన నీళ్ళు త్రాగు చున్నదిగా వర్ణించబడినది.

అట్లే మన్మథుని తూణీరద్వయము కూడ- ఇచట- "శరసమూహాపూరిత స్వాత్మగర్భం" అనునపుడు శ్లేషచే జలముతో నింపబడిన మధ్యభాగ మనియు, (శర = నీరు, బాణము) రెండర్థములను బోధించుచు, ప్రకృతవర్ణన కుపకరించు చున్నది. ఈ శ్లేషతోపాటు ''బాణములతో నిండి ఉండుటయే నీరు త్రాగుట'' అను రూపకము కూడ ఇచట ''తూణీరద్వయము నీరు త్రాగుచున్న'' దను ఉత్ప్రేక్షకు ఉపకారకముగా ఉన్నది- ఈ విధముగా ఆమెయొక్క జంఘలు మన్మథునియొక్క అమ్ములపొదుల (జంట)తో సమానముగా ఉండి కమలగర్భముయొక్క సౌకుమార్యమును కలిగయున్న వని వర్ణించుట ఈ శ్లోకసారాంశము.

రామరాజభూషణుడు తన వసుచరిత్రలో నాయికయైన గిరికను వర్ణించుచు

కలమగర్భహిరణ్యకాహళులు దొరయ
నీతలును మోతలును చూపి యెలమి మకర-
కేలి లోగొని దొనల శరాళిముంచి
యబల మృదుజంఘికా ప్రకాశాఘ మదరు.

(వసుచరిత్ర. 2వ ఆ. 86.ప.)

(ఆమె యొక్క జంఘలు ధాన్యపుకంకు లనుబంగారు బాకాలను అతిశ యించుచున్నవి) అని వర్ణించినాడు-

ప్రకృతశ్లోకమున ఈ కవిగారు గోదాదేవి యొక్క జంఘలచేత కమల గర్భము- మన్మథ తూణీరద్వయము జయింపబడినట్లు వర్ణించినారు. శ్లేష-రూపక-ఉత్ప్రేక్షాలంకారములు. ''మీనకేతన తూణీర చారుజంఘా విరాజితా'' గోదా అష్టోత్తరమ్. మాలినీ-వృత్తము.

అసారమపి పామరప్రముఖమారుతాపూరితం
కిమంబ! తవ జంఘికాభజనదోహళం కాహళమ్,
పురస్సరతి భూభుజాం విజయముద్రయా భద్రయా
న తత్ర పరిదృశ్యతే సుషిరవారణం కారణమ్. 49

అమ్మా ! జడమై పామరముఖవాయుపూరితమైన కాహళము (బాకా) కూడ నీ జంఘికలను సేవించునట్టిదై రాజుల విజయముద్రకలదై అగ్రేసరత్వ మును పొందినది. (అనగా ముందుపోవుచు గౌరవమును పొందినది.) కాని దాని యందు గల చిల్లులను మూయుటకు గల కారణమేమో తెలియకున్నది.

(ఊదునపుడు రంధ్రములను మూయుచు తెరచుచుండుట సహజము. రంధ్రములను కప్పికొన్నచో తాను (కాహళము) ఆమె జంఘలతో పూర్తిగా సామ్యమును పొందవచ్చు నని భ్రమపడి ఉండవచ్చును). అనుప్రాస- పృథ్వీ- వృత్తము.

లక్ష్మీరంబుజపీఠమర్దనరుషా ఛిద్రాత్మనా నిర్గతా
యాముత్సృజ్య మృదూరుకాండయుగళం దేవి! త్వదీయం గతా,
సా ఘోణా ద్విరదస్య సంభృతవనాన్యుద్గచ్ఛతి, స్థైర్యతో
హీనా నూనమనేకధూళిపటలం ధత్తే విధత్తే రవమ్. 50

తనదగు పద్మపీఠమును మర్దనము గావించిన దను కోపముతో అందలి లక్ష్మి- ఏ తొండమును వదలి (ఛిద్ర) రంధ్రమార్గమున నిర్గమించి నీ మృదు వగు ఊరుయుగము నాశ్రయించినదో, ఆ ఏనుగు తొండము పిల్వబడినసీటితో

నిండినదై ధైర్యము సళింపగా, వనములో తిరుగుచున్నది, దుమ్ములో పొరలుచున్నది, బొబ్బలు పెట్టుచున్నది (ఘీంకారము చేయుచున్నది).

ఇచట సహజములైన ఏనుగుతుండముయొక్క లక్షణములు 1) నీరు సింపుకొనుట 2) చంచలత్వము, 3) దుమ్ముకొట్టుకొనుట, 4) శబ్దముచేయుట (ఘీంకారము) — లక్ష్మిలేకపోవుటవలన వచ్చినవిగా ఉత్ప్రేక్షింపబడినవి. ఉత్ప్రేక్షాలంకారము. శార్దూలవిక్రీడితంవృత్తము.

ముహురనిలవిధూతా ధౌతకర్పూరఖండాన్
భృశమిహ కలయంత్యప్యాస్రవం ముంచతీవ,
కిము బత! కదళీయం యత్త్వదీయోరుమృత్యోః
జనని! నిభృతమాప్తా దర్శనం స్పర్శనం వా! 51

అమ్మా! ఈ కదళి నీయొక్క ఊరువు అనెడి మృత్యుదేవతయొక్క దర్శనమును గాని స్పర్శనమును గాని పొందినదా? ఏమి? లేనిచో వాయువుచే మరల మరల కంపించుచు, శరీరమున అంగాంగపీడను హరించు కర్పూరాదిలేపనము కలిగియున్నప్పటికిని మాటిమాటికిని కన్నీటి నేల విడచుచున్నట్లున్నది?

ఊరువులను అరటిచెట్లతో పోల్చెదరు. "ఈమెయొక్క ఊరువులు అరటిచెట్లకంటె ఎక్కువ శోభ కలిగియున్నవి" అని ఇందు చెప్పబడినది.

కాళిదాసు కుమారసంభవమున పార్వతియొక్క ఊరువులను వర్ణించుచు—

"నాగేంద్రహస్తాః త్వచి కర్కశత్వాత్
ఏకాంతశైత్యాత్ కదలీవిశేషాః,
లబ్ధ్వాపి లోకే పరిణాహి రూపం
జాతస్తదూర్వోరుపమానబాహ్యాః.

(ఏనుగుతొండములు కఠినమైన చర్మము కలిగియుండుటవలనను, అరటిచెట్లు ఎల్లప్పుడు చల్లగానుండుటవలనను, ఆమెఊరువులకు ఉపమానత్వము పొందుయోగ్యత వాటికి లేకపోయినది) అని వర్ణించినాడు.

ఇచట ఈ కవివర్యులు కూడ 50వ శ్లోకమున ఏనుగతొండములను జయించినట్లును, ఈ (51) శ్లోకమున అరటిచెట్లను జయించినట్లును గోదాదేవి యొక్క ఊరువులను (తొడలను) వర్ణించియున్నారు. "స్వర్ణరంభాభసక్థికా" గోదా అష్టోత్తరమ్. మాలినీ-వృత్తము

త్వదూరులక్ష్మ్యాపహృతే స్వసారే
కౌమోదకీ కృష్ణకరావలంబా,
నాధోముఖీ కిం తు విహాయ చ స్వం
నాథోముదా తాం భజతీతి నూనమ్. 52

అమ్మా! స్వామివారి హస్తముననున్న కౌమోదకి (గద), నీయొక్క ఊరువులయొక్క కాంతిచేత జయింపబడినదైనను, ఆ కారణముగా అధోముఖి కాలేదు. కాని స్వామివారు తనను వదలి నీ ఊరు లక్ష్మిని పొందినా రను భావన తోనే అధోముఖియైనది. (ఇచట ఊరువులకు గదతో సామ్యము).

ఇచట గదయొక్క సహజమైన అధోముఖిత్వము మరియొక విధముగా వచ్చినట్లుగా ఉత్ప్రేక్షింపబడినది. ఉత్ప్రేక్షాలంకారము ఉపజాతి-వృత్తము.

మదనస్య పుష్పరథ ఏవ కేవలం
జఘనం ఘనం తవ నితంబమండలే,
దృఢచక్రకే, తదనుబంధయుగ్యగ-
శ్రియమూరు కాండయుగమేతి శోభనే. 53

మంగళప్రదురాలా! నీ ఘనమగు జఘనము మన్మథుని పుష్పరథమే దాని చక్రములు వెనకనుండు రెండు నితంబములు. నీ ఊరుకాండముల జంట ఆ మన్మథరథమునకు చెందిన యుగముయొక్క కాంతిని పొందుచున్నది.

ఇచట యుగము అనగా బండి, రథము, మొదలగు వాహనములకు చెందిన పొడవైన అగ్రదండము. ఇరుసు పైనుండి ముందుకు సాగిన ఈ దండము ఒకటిగను రెండుగను ఆయా ప్రాంతములలో ఉండును. "యుగము" అనగా "కాడి" అని కూడ అర్థము.

ఈ విధముగా ఇచట గోదాదేవియొక్క జఘనము మన్మథుని పుష్ప రథముగను, ఊరుకాండ (నితంబ) యుగము రెండుచక్రములుగను వర్ణించబడి నది. రూపకాలంకారము-మంజుభాషిణీ-వృత్తము.

తవ లావణ్యఝరిణ్యాం
పూర్ణాయాం జఘనసైకతవ్యక్తేః,
యదుహంసహర్షహేతోః
కా వా శరదాగతా దేవి! 54

దేవి! పూర్ణమైయున్న నీయొక్క లావణ్యము అను సరస్సునందు' జఘనము అను సైకతము (ఇసుకతిన్నె) వ్యక్తము కాగా కృష్ణుదను హంసకు హర్షము కలిగించుటకు ఏ శరత్పూర్ణిమ వచ్చినది ?

ఇచట లావణ్యము సరస్సుగను, జఘనము సైకతముగను, కృష్ణుడు హంసగను వర్ణింపబడిరి. "శరత్" శబ్దమునకు రెండర్థములు (వయస్సు-శరత్కాలము) అని- అట్లే "పూర్ణా" శబ్దమునకు కూడ (నిండుదనము-పూర్ణిమ) అని, రెండర్థములు.

శరత్కాలమున సరస్సులలో నీరు తగ్గియుండి ఇసుకతిన్నెలు కనుపించును. అందు హంసలు తిరుగుచు సంతోషించు చుండును. ఇచట గోదాదేవి యొక్క లావణ్యము సరస్సు అయి ఉండగా అందు జఘనము అను సైకతము వ్యక్తమయినట్లు వర్ణించబడినది. ఆ జఘన మనే సైకతము కృష్ణు డనే హంసకు హర్షాన్ని కలుగజేస్తోంది. ఆ విధంగా హర్షాన్ని కలగచెయ్యటానికి ఏమి శరత్తు వచ్చినది ? అని,

శరత్-శబ్దమునకు "వయస్సు" అను అర్థము కూడ ఉన్నది కదా. అందువలన "నీ యౌవనవయస్సు కృష్ణునకు ఆనందదాయక మగుచున్నది" అను అర్థము వచ్చును. అట్లే శరత్పూర్ణిమ హంసకు ఆనందదాయకము.

యదుహంస అనగా 1) యదుశ్రేష్ఠడనియు. 2) కృష్ణడే హంస యనియు కూడ చెప్పుకొనవచ్చును. ఇచట రూపకమునకు రెండవ అర్థమే ఉచితము.

మొత్తముమీద "దేవీ! నీ యౌవన వయస్సు లావణ్యపూర్ణమై సర్వావయవసౌందర్యయుక్తమై నీ ప్రియుడైన శ్రీకృష్ణభగవానునకు ఆనందమును కలుగచేయుచున్నది" అని సారాంశము. శ్లిష్టసావయవరూపకము. "విశాల జఘనా" గోదా అష్టోత్తరమ్. ఆర్యా-వృత్తము.

ఆచ్ఛాదితప్రస్ఫురదుత్తరాంగం
తవాంబరం రంగపురందరేణ,
నిపీయతే దృగ్భిరిదం సదా తత్
పీతాంబరం తం కథయన్తి సన్తః. 56

తల్లీ! నీయొక్క ఉత్తరాంగమునందు (నడుముక్రిందిభాగమున) ప్రకాశించు వస్త్రము శ్రీరంగేంద్రునిచేత కళ్ళతో త్రాగబడుచున్నది. (తదేక దీక్షగా చూడబడుచున్నది) - ఆ విధముగా త్రాగబడుటచేతనే పండితులు అతనిని "పీతాంబరుడు" అని చెప్పుచున్నారు.

విష్ణువు (శ్రీరంగనాథుడు) పసుపుపచ్చని వస్త్రమును ధరించుట ప్రసిద్ధి. అందువలన ఆయనను "పీతాంబరుడు" (పచ్చని వస్త్రమును ధరించినవాడు) అని అందురు. కాని ఇచట కవిగారి ఉత్ప్రేక్ష అనన్యసామ్యమై చమత్కారయుక్తముగా నున్నది.

గోదాదేవి ధరించిన వస్త్రమునే తదేకదీక్షగా చూచుటవలన ఆతనిచే ఆ వస్త్రము త్రాగబడినదా! అనునట్లుండెను. అందుకనియే ఆతడు "పీతాంబరుడు" (త్రాగబడిన వస్త్రము కలవాడు) అయ్యాడు- అని- వస్త్రమును త్రాగుటయనగా "తదేకదీక్షగా శ్రద్ధగా ఆసక్తితో చూచుట" అని అర్థము. "ఆ విధముగా వస్త్రమును త్రాగుటవలననే శ్రీరంగనాథుడు పీతాంబరుడైనాడు" అని కవిగారి ఉత్ప్రేక్ష (పీత=(1) పసుపుపచ్చని, (2) త్రాగబడిన- అని రెండర్థములు) ఉపజాతి వృత్తము.

చంద్రాబ్జకోశాదిసమానకక్ష్యం
ప్రత్యక్షతామేతి ముఖస్తనాది,
మధ్యం తు తే విష్ణుపదానుకారి
పాపీయసాం నః కథమక్షిలక్ష్యమ్? 57

గోదాదేవీ! చంద్రుడు పద్మకోశములు మొదలగువానితో సమానములైన నీ ముఖము స్తనములు మొదలైనవి ప్రత్యక్షముగా కనపడుచున్నవి. నీ నడుము మాత్రము విష్ణుపదమును అనుకరించుచున్నది కావున పాపాత్ములమగు మా కెట్లు కనుపించును?

ఇచట గోదాదేవియొక్క ముఖము చంద్రునితోను- స్తనములు పద్మ కోశములతోను, పోల్చబడినవి. అవి అందరకును ప్రత్యక్షముగా కనుపించు చున్నవి. కాని నడుముమాత్రము "విష్ణుపదము"తో పోల్చబడినది. విష్ణుపద- శబ్దమునకు రెండర్థములు (అకాశము-వైకుంఠము- అని).

నడుము సన్నగా నున్నట్లు వర్ణించుట కవిసమయప్రసిద్ధము. అకాశ మనగా -శూన్యము (ఏమియు లేదు) అని అర్థము. ఇచట నడుమును అకాశ ముతో పోల్చుటవలన "నడుము కనబడుటలేదు" అని తెలియుచున్నది.

మరియు "వైకుంఠము" అను అర్థము చెప్పుకొనినప్పుడు- "వైకుంఠ మెట్లు పాపాత్ములకు కనపడదో- అట్లే ఆమెయొక్క నడుము కూడ". "అది కేవలము పుణ్యాత్ములైన శ్రీహరికే గోచరము- పాపాత్ములమైన మనబోటివారికి అగోచరము" అని భావము వచ్చును.

"ఆమెనడుము సన్నగా ఉన్నది-" అని వర్ణించుట ఇచట కవితాత్ప ర్యము. విష్ణుపద-శబ్దము వద్ద శ్లేష-ఉపమాలంకారము వ్యంగ్యము. ఇంద్ర వజ్రా-వృత్తము.

జనని! వయమ మిథ్యావాదిన స్తథ్యమేతత్
భవతు, నయనవీథీం తే వలగ్నం న లగ్నం,
స్ఫురత ఇహ కుచాదేః పూర్వదేహస్య వృత్తేః
తదిదమనుపపత్త్యా సర్వథా కల్పయామః. 57

తల్లీ! మేము మిథ్యావాదులము కాము. ఇది ముమ్మాటికిని నిజమగుగాక, నీయొక్క నడుము కనపడుటలేదు. అయినను పూర్వదేహమున ప్రకాశించుచున్న కుచాదులకు అధారముగా తప్పక నడుము ఉండియుండవలయు నని కల్పించు చున్నాము.

ఇచట చమత్కారముగా "అంతా మిథ్య" అనే వాదము నిరసింపబడి నది. "జగత్తు మిథ్య" "ఎదురుగా కనపడునది కూడ మిథ్య" అని ఆ వాద సారాంశము.

అయితే కనపడనివాటిని కూడా అనుమానాది ప్రమాణముల ద్వారా తెలిసి కొని "ఉన్నాయి" అని చెప్పటం ఇచట కవికి తన అమిథ్యావాదానికి నిదర్శనం.

గోదాదేవి నడుము సన్నగా నున్నదని వర్ణించుట ఇట ప్రధానాంశము. ఆ నడుము అసలు కనపడుటలేదు. అయినను దానిపై కనుపించెడి కుచాదుల వలన, అవి ఏ విధమైన ఆధారము లేకుండ ఉండుటకు అవకాశము లేదు కాబట్టి "వాటికి ఆధారముగా నడుము ఉన్నది" అని ఊహించిచెప్పుట జరిగినది. అది కూడ చమత్కారముగా చెప్పబడినది. మాలినీ-వృత్తము.

ముష్టిం నిబద్ధాం తవ లక్ష్యపూర్వే
మధ్యే యదా తాం ప్రముమోచ శౌరిః,
తదా తవైవైత దదృష్టమాసీత్
శౌరేస్తు మాయా కియతీ బతైషా. 58

చిన్నతనమున కనుపించిన నీ మధ్యమును శ్రీహరి పిడికిలిలో బిగించి ఎప్పుడు వదలెనో అప్పుడు ఆ నడుము నీకు కూడ కనపడకుండపోయినది. శ్రీహరి మాయ ఎంతటిదో గదా!

ముందు కొద్దిగా కనువించిన నడుమును శ్రీహరి తన పిడికిలిలో బిగించి వదలగా- అది గోదాదేవికి కూడ కనుపించకుండ పోయెనట. ఇది శ్రీహరి యొక్క "మాయ" లేక "ఇంద్రజాలము"గా చెప్పబడినది.

ఈ విధముగా ఇచట కూడ నడుముయొక్క సన్నదనమే మరియొక విధ ముగా వర్ణింపబడినది. ఉపజాతి-వృత్తము.

తవాంగవంక్తౌ తనుమధ్యమేతత్
అసత్యమిత్యేవ గృణన్తి లోకాః,
మద్వత్సలస్వామిని! హేమకాంచీ-
వ్యాజస్థితాం కుండలనామవేక్ష్య. 59

నాయందు వాత్సల్యముగల ఓ అమ్మా! నీ శరీరపంక్తిలో నడుమున "బంగారు వడ్డాణము" అను మిషతో నున్న కుండలీకరణమును చూచి ఆ నడుము అసత్య మనియే లోకములు భావించుచున్నవి.

సత్య మనగా ఉన్నది అసత్య మనగా లేనిది. లేనివానికి కుండలీకరణము చేయుట (సున్నచుట్టుట) లోకసహజము. ఆ విధముగా ఆమెయొక్క అవయవ పంక్తిలో లేని నడుమునకు కుండలీకరణము చేయబడినది. "ఆ కుండలీకరణమే-బంగారువడ్డాణము- అను మిషతో నున్నది" అని ఇచట చమత్కృతి.

గుండ్రముగా నున్న వడ్డాణము ఇక్కడ నడుముకు "లేదని చుట్టబడిన సున్నవలె" చెప్పబడినది. ఈ విధముగా ఇచట కూడ నడుము సన్నగా ఉండుట మరియొకరీతిలో వర్ణింపబడినది. అపహ్నువాలంకారము. వ్యంగ్యఉత్ప్రేక్ష. ఉపజాతి-వృత్తము.

జఘనోద్ధతస్య నూనం
లావణ్యఝురస్య తే వళీరోధాత్,
ఆవర్త ఏవ భద్రే!
గాంభీర్యసనాభిరూర్జితా నాభిః. 60

మంగళప్రదురాలా! నీయొక్క జఘనముచేత ఎగురగొట్టబడిన లావణ్యమనెడి ప్రవాహమునకు వళులనెడి తరంగములు అడ్డురాగా అక్కడ ఏర్పడిన సుడిగుండమే గంభీరమైన నీ నాభిగా ఏర్పడినది. ఇది నిజము.

అనగా నాభి లోతుగా నున్నదని వర్ణించుట. రూపకోత్ప్రేక్షలు. ఆర్యా-వృత్తము.

కామశ్రియస్సహచరేణ మదావిలేన
ప్రాప్తేన దివ్యతనునూతనకల్పశాఖాం,
హే దేవి! తే విహరతా వయసాభిక్ల్పం
నీడం గభీరమివ మే ప్రతిభాతి నాభిః. 61

దేవి! నీ నాభి, నీ దివ్యశరీర మనెడి కల్పవృక్షపు కొమ్మను పొందిన, మన్మథశోభతో నలరారెడి, మదావిలమైన, తిరుగాడుచున్న, వయస్సు అను పక్షి చేత ఏర్పరచుకొనబడిన గంభీరమైన గూడువలె నాకు తోచుచున్నది.

ఇచట వయశ్శబ్దము శ్లిష్టమై వయస్సును, పక్షిని చెప్పుచున్నది. "ఒక పక్షి కట్టుకున్న గూడు" అను భావమును కలుగచేయుచున్నదై యౌవనవయస్సుతో కుప్తమైన ఆమెయొక్క నాభి గభీరమై యొప్పుచున్న దని భావము. శ్లేష-రూపకము-ఉత్ప్రేక్ష-అలంకారములు. వసంతతిలకా-వృత్తము.

స్ఫూర్జద్వళీసహితలక్ష్మణచాపరేఖా-
బాహ్యం బలాదపజహార సుమధ్యలక్ష్మీమ్,
మాయీ వయోమిష ఇదం మహదంబ! చిత్రం
నాభిచ్ఛలాదపట మద్భుతమీక్ష్యతే హి. 62

ప్రకాశించువళులతో కూడిన లక్ష్మణచాపరేఖకంటె బాహ్యమైన (చాప రేఖను అతిక్రమించిన) సుమధ్యలక్ష్మిని వయస్సు అను మారువేషముతో ఒక మాయి(మాయావి) అపహరించెను. అందువలననే అచ్చట "నాభి" అనే మిషతో అద్భుతమైన "గుంట" కనపడుచున్నది (చూడబడుచున్నది).

లక్ష్మణచాపరేఖను అతిక్రమించిన సీతాదేవిని- మాయి అయిన రావణుడు అపహరించుటచేత అక్కడ పంచవటిలో ఏ విధమైన "గుంట" ఇప్పటికిని కన పడుచున్నదో, అట్లే "వళిత్రయము" అను లక్ష్మణచాపరేఖను దాటిన సుమధ్య లక్ష్మిని కూడ "వయస్సు" అనే వేషంలో ఒక మాయావి అపహరింపగా- "నాభి" అనే మిషతో ఒక గుంట ఇప్పటికిని కనపడుచున్నదిట. ఇచట కూడ నాభియొక్క లోతు వర్ణించబడినది. వళిత్రయమే లక్ష్మణచాపరేఖ. ఉపమారూప కాపహ్నవాలంకారములు. వసంతతిలకా-వృత్తము.

క్రీడావరాహపురుషస్య కరాళదంష్ట్రా-
టంకేన యా క్షితిరతీవ సముద్ధృతా ప్రాక్,
సైవ త్వమిత్యుపదిశత్యనఘే! గభీరం
మధ్యే బిలం కిమపి నాభిమిషేణ నూనమ్. 63

క్రీడావరాహమైన శ్రీమన్నారాయణునియొక్క భయంకరమైన దంష్ట్రా టంకముచేత, పూర్వము ఎక్కడో సముద్రమధ్యమున దాచబడిన ఏ భూమి ఉద్ధరించబడినదో, "ఆ భూమి నీవే" అని, నాభిరూపముగా మధ్యనున్న బిలము (రంధ్రము) ఉపదేశించుచున్నట్లుగా ఉన్నది.

ఈ శ్లోకమున కూడ నాభివర్ణనతోపాటు "గోదాదేవి భూమియొక్క అవతారము" అను విషయము కూడ మరల సూచింపబడినది. రూపకాపహ్నవనిదర్శనాలంకారములు. "ఆనందసాగరావర్తగంభీరాంభోజనాభికా" గోదా అష్టోత్తరమ్. వసంతతిలకా-వృత్తము.

స్తనయుగళముదారం గర్భలావణ్యనీర-
ప్రభవకమలకోశాద్వైతశంకావిధాయి,
మఘవమణిశిలాకాస్పర్ధినీ లోమరేఖా
జనని! జయతి నాళభ్రాంతిమాపూరయంతీ. 64

జననీ! ఉదారమైన నీ స్తనయుగళము, ఉదరముయొక్క లావణ్యము అనెడి నీటియందు పుట్టిన కమలకోశముల జంటయా? అను శంకను కలిగించుచున్నది.

రోమరాజి కూడ ఇంద్రనీలమణిశిలాకతో సమానమైనదై "ఆ కమలము యొక్క నాళమా?" అను భ్రాంతిని కలిగించుచున్నది.

ఇచట స్తనములు పద్మకోశములుగను, రోమరాజి నాళముగను వర్ణింపబడినవి.

"నవవల్లీరోమరాజి:" గోదా అష్టోత్తరమ్. మాలినీ-వృత్తము.

యదంబురుహకుట్మలం తవ కుచశ్రియం వీక్ష్య హి
త్రపాముపగతం సర:పతితమంబ! మర్తుం పున:,
తదేవ తవ పాణినా ఖలు సముద్ధృతం వత్సలే!
మృదుస్తు సహతే పరం స జడజాతమప్యాపది. 65

వాత్సల్యము గల ఓ అమ్మా! ఏ పద్మకోశము నీయొక్క స్తనసౌందర్యమును చూచి సిగ్గుపడి మరణించుటకు నిశ్చయించినదై సరస్సులో మునిగినదో,

అది వాత్సల్యగుణముగల నీయొక్క పాణితో గ్రహింపబడినదై ఉద్ధరింప బడినది.

మృదుస్వభావము గల వ్యక్తి "ఆపదలో కొట్టుమిట్టాడుచున్న" జడ (జల) జాతినైనను సహింపదు.

అనగా ఆపదలో ఉన్న వ్యక్తి ఎట్టివాడైనను అతనిని రక్షింపబూనుట మృదుస్వభావముకలవారి లక్షణ మని భావము. అర్థాంతరన్యాసాలంకారము, పృథ్వీ-వృత్తము.

రేఖావీచివిచిత్రితారుచిఝరిణ్యేకా గళాదాగతా
నాభ్యావర్తవళీతరంగకలితా చైకోదరాదాగతా,
సంఘర్షాదురసి ద్వయోరివ తయోరుజ్జృంభిత స్తే స్తనో-
ద్దేశో దేవి! భుజౌ నిజావుభయతః పాథఃప్రపూరావివ. 66

దేవీ! రేఖ లనెడి తరంగములతో కూడియున్న కాంతి అనెడి ఒక సరస్సు కంఠమునుండి ఉద్భవించినది. అట్లే నాభి యనెడి సుడియొక్క వళు లనెడి తరంగములతో కూడినదై మరియొక సరస్సు ఉదరమునుండి ఆవిర్భవించినది.

ఈ విధముగా కంఠమునుండియు, ఉదరమునుండియు వెలువడిన రెండు సరస్సులయొక్క సంఘర్షణము వలననా! అనునట్లు స్తనోద్దేశము ఉవ్వెత్తుగా ఎగసినది. అట్లే రెండు వైపుల నున్న భుజములు సంపూర్ణములైన ప్రవాహముల వలె ప్రకాశించుచున్నవి. ఉపమారూపకోత్ప్రేక్షలు. శార్దూలవిక్రీడిత-వృత్తము.

వక్షోజశైలశిఖరాదభిపత్య నాభీ-
వాపీమథాపి తదిదం పునరాదురుక్షోః,
ఆభాతి మన్మథవటోశ్చరణానులగ్న-
శైవాలరాజిరివ సుందరి! రోమరాజిః. 67

సుందరీ! నీయొక్క రోమరాజి వక్షోజము లనెడి శైలములయొక్క శిఖరములనుండి, నాభి యను దిగుడుబావియందు పడి, మరల పైకెగబ్రాకుటకు ప్రయత్నించుచున్న మన్మథు డను వటువుయొక్క పాదముల కంటిన నాచు సముదాయమువలె ప్రకాశించుచున్నది.

ఇచట రోమరాజి నాచుతో పోల్చబడినది. ఆ నాచు కూడ మన్మథు డను పటువుయొక్క కాలికి అంటుకొనినది. అతని కాలికి ఎందు కంటుకొనినది ? స్తనము లనెడి పర్వతములయొక్క శిఖరములనుండి నాభియనెడి దిగుడుబావిలో పడి మరల పైకెగబ్రాకుటకు ప్రయత్నించుచుండగా అంటుకొనినది. ఇది మన్మథుని కష్టచేష్ట.

ఇచట స్తనముల ఔన్నత్యము, నాభియొక్క గాంభీర్యము, వీటితోపాటు నవరోమరాజియొక్క సౌందర్యము మూడును కలిపి వర్ణింపబడినవి.

కాళిదాసు పార్వతీదేవియొక్క రోమరాజిని వర్ణించుచు "అది మన్మథుని యొక్క ఆరోహణమునకై నవయౌవనముచేత ఏర్పరుపబడిన సోపానముల వలె ఉన్న దని" వర్ణించినాడు. వసంతతిలకా-వృత్తము.

హరేరుదయమీయుషో హృదయపుష్కరే దేవి! తే
భయా త్తిమిరరేఖికా బహిరుపేత్య నాభీబిలాత్,
సులోమలతికాచ్ఛలాత్ చికురబంధనం ప్రస్థితా
ముఖేందుచకితా స్థితా కిము కుచాచలప్రాంతతః. 68

దేవీ! నీ హృదయము అనెడి ఆకాశమునందు ఉదయించుచున్న హరి (విష్ణువు-సూర్యుడు)యొక్క భయమువలన తిమిరరేఖ కుచాచలప్రాంతమునుండి నాభీబిలముద్వారా రోమరాజి యనెడి మిషతో బైటకువచ్చి -సజాతియైన చికుర బంధము వద్దకు బయలుదేరి అచట మరల ముఖచంద్రుని చూచి చకితురాలై ఉన్నదా? అన్నట్లున్నది (ఉత్ప్రేక్ష).

ఇక్కడ రోమరాజియొక్క సౌందర్యము చీకటితో పోల్చబడినది. హృదయ మనునదే ఆకాశము- అనునది రూపకాలంకారము. హరి-శబ్దము శ్లిష్టము, ఆమె హృదయమున ఉదయించినవాడు- విష్ణువు. ఆకాశమున ఉదయించినవాడు- సూర్యుడు. ఈ విధముగా శ్లేష-రూపకోత్ప్రేక్షలు ఇందు గలవు. పృథ్వీ-వృత్తము.

లావణ్యసింధౌ భుజమధ్యపూర్ణే
పాతాన్మనోజే హృదయం ప్రవిష్టే,
సముత్థితం బుద్బుదమండలం హి
దేవ్యాః ప్రకృష్టం స్తనమండలం తత్. 69

భుజమధ్యములయందు నిండుగా నున్న లావణ్యమనెడి సముద్రమునందు పడుటవలన, మన్మథుడు హృదయముయొక్క మధ్యలో ప్రవేశించగా అచట పుట్టిన బుడగల వలె గోదాదేవియొక్క ప్రకృష్టమైన స్తనమండలము ప్రకాశించు చున్నది. ఇచట గోదాదేవియొక్క లావణ్యపరిపూర్తి వర్ణింపబడినది.

ఒక మనుజుడు నీటిమధ్యలో పడి మునిగినచో అచట బుడగలు పుట్టు చుండును. అట్లే మన్మథుడు ఇచట ఆమెయొక్క భుజమధ్యమున నున్న లావణ్య మనెడి సముద్రమునందు పడగా ఉత్పన్నములైన బుడగలుగా స్తనములు వర్ణించబడినవి. ఉపజాతి-వృత్తము.

గిరిభారమసహమానాం
జాతా-మత్రాప్యురోజగిరిభారః,
నమయత్యనుభోక్తవ్యం
హ్యావర్జనీయం స్వయం భువోఽపి స్యాత్. 70

సామాన్యముగా గిరిభారమును సహించలేని భూమిని ఆమె గోదాదేవిగా జన్మించినప్పటికిని ఇక్కడ కూడ ఆ గిరిభారము వదలలేదా? అన్నట్లుగా ఉరోజము లనెడి గిరుల భారము వంచుచున్నది.

అనుభవించవలసివచ్చినచో బ్రహ్మకైనను కర్మానుభవము తప్పదు కదా!

ఇచట ఉత్ప్రేక్ష-అర్థాంతరన్యాసాలంకారములు కలవు. "భూదేవిగా ఉన్నప్పుడు పర్వతములు భారమై ఆ భారమును వదల్చుకొనుటకై గోదాదేవిగా జన్మించినను ఈ జన్మలో కూడ ఆమెను గిరిభారము వదలలేదా!" అనునది ఉత్ప్రేక్ష.

"ఎవరైనను కర్మఫలము అనుభవించవలసినదే" అనునది అర్థాంతర న్యాసము. ఆర్యా-వృత్తము.

పాణిపంకరుహయోరివ నాళే
అంగుళీదళయుజో స్తవ బాహూ,
స్రోతసీ గళసరద్రుచిసింధోః
పార్శ్వగే ఇవ కుచాద్రిశిరోధాత్. 71

అమ్మా! వ్రేళ్లు అనెడి దళములను పొందిన చేతు లనెడి పద్మముల యొక్క నాళముల వలె నున్న నీ బాహువులు, కుచము లనెడి పర్వతములు అడ్డు కొనగా రెండుగా చీలి ప్రక్కగా ప్రవహించిన, కంఠమున ప్రకాశించెడి కాంతి యనెడి సముద్రముయొక్క ప్రవాహములా? అనునట్లున్నవి.

జలప్రవాహమునకు కొండలు అడ్డువచ్చినచో రెండుగా చీలి ప్రవహించును. ఇచట కాంతి అనెడి సముద్రప్రవాహమునకు కుచము లనెడి కొండలు అడ్డు రాగా రెండు బాహువులుగా చీలినట్లు వర్ణింపబడినది. రూపకోత్ప్రేక్షలు. స్వాగత-వృత్తము.

అయే శంఖః ప్రేంఖద్ధ్రువదమలకంఠై కరమయా
హృతే స్వాంతస్సారే జనని! భృశమాపాండురతనుః,
ముఖే స్థిత్వా నిత్యం నను భగవతో విశ్వకమితుః
ముహుః కృత్వా ఘోషం పరహృదయభేదం జనయతి. 72

అమ్మా! స్వచ్ఛమై ప్రకాశించుచున్న నీయొక్క కంఠముయొక్క కాంతి చేత తన అంతఃసారము హరింపబడగా, శంఖము, తెల్లగాపాలిపోయినదై, భగవంతుడైన శ్రీమన్నారాయణునియొక్క ముఖమునందే ఉంటున్నదై, మాటిమాటికి ఘోష పెట్టును, ఇతరుల(శత్రువుల) హృదయములను భేదించుచున్నది.

ఇచట సహజముగా నున్న శంఖముయొక్క తెల్లదనము, గోదాదేవియొక్క కంఠముయొక్క కాంతిచేత జయింపబడుటవలన పాలిపోయి వచ్చిన తెల్లదనముగా వర్ణించబడినది.

అట్లే విష్ణుమూర్తిని ఆశ్రయించి ఘోషపెట్టుచు ఇతరులకు హృదయభేదనము కలుగచేయుచున్నట్లు వర్ణింపబడినది. విష్ణుమూర్తి శంఖధ్వనిచేసిన శత్రువుల

గుండెలు బ్రద్దలగు ననెడిది సహజము. దాని నిచట క[illegible] చమత్కరించినారు.

"ఓడిపోయినవాడు పాలిపోయి, ఇతరులను ఆశ్రయించి, వాళ్ళ ఎదుట తాను మోసపెట్టుచు- ఇతరులకు కూడ బాధను కలిగించును" అను విషయము ఇచట వ్యంగ్యమర్యాదగా చెప్పబడినది.

"కంబుకంఠీ" గోదాఅష్టోత్తరమ్. శిఖరిణీ-వృత్తము.

ఇహ చంద్రకాంతముకురం
మన్యే మాతః కపోలఫలకం తే,
అత ఏవ తదిదమీషత్
విధుకరపాతేఽపి జాయతే స్విన్నమ్. 73

అమ్మా! నీయొక్క కపోలఫలకమును, చంద్రకాంతమణులతో తయారు చేయబడిన అద్దమునుగా ఊహించుచున్నాను. అందువలననే "విధుకరపాతమునసే" చెమటపట్టిన దగుచున్నది.

కపోలములను అద్దముగా చెప్పుట కవిసమయప్రసిద్ధము. అందునను చంద్రకాంతముకురములుగా ఇచట గోదాదేవియొక్క కపోలములు చెప్పబడినవి. చంద్రకాంతములు చంద్రకిరణములు తమపై పడుటవలన స్రవించును. అట్లే ఈమెయొక్క కపోలములు కూడ విష్ణువుయొక్క హస్తస్పర్శవలన చెమటపట్టిన వగుచున్నవి.

"విధుకరపాత" శబ్దము ఈ రెండర్థములను తెలుపుచున్నది. (విధుః= విష్ణువు, చంద్రుడు) (కరము=హస్తము, కిరణము) అని. ఈ విధముగా గోదాదేవి యొక్క కపోలముల స్వచ్ఛత ఇందు వర్ణింపబడినది. శ్లేష-ఉత్ప్రేక్ష-అలంకారములు. ఆర్యా-వృత్తము.

కిము వా కపోలపాశేః
అపరాద్ధం దర్పణేన మాతస్తే,
నో చేదిదమేవ కథం
భస్మాధీనప్రకాశమిహ జాతమ్ ? 74

తల్లీ! ఈ అద్దము నీ చెక్కిళ్ళ కేమి అపరాధము చేసినది? ఇది భస్మాధీన ప్రకాశమయినది?

ఆమెచెక్కిళ్ళముందు అద్దము దుమ్ముకొట్టుకొనినట్లు ప్రకాశము లేకుండ పోయిన దని భావము.

బూడిదతో తుడిచినచో అద్దము స్వచ్ఛమగుట లోకప్రసిద్ధము. అదియే ఇచట "భస్మాధీనప్రకాశము"గా వర్ణించబడినది.

"సుముఖీ" "దర్పణాకార-విపులకపోలద్వితయాంచితా" అని గోదా అష్టోత్తరమ్. ఆర్యా-వృత్తము.

అంతర్బహిశ్చ నవపంకజరాగలక్ష్మీం
సాక్షాదపూర్వ-మమృతద్రవమాదధానమ్,
పక్వం ఫలం తవ లతాధరబింబమంబ !
పుణ్యద్రుమస్య కిము రంగశయాభశౌరేః ? 75

అమ్మా! లోపలను వెలుపలను కూడ నూత్నశోభను, అపూర్వ మగు అమృతద్రవమును ధరించునట్టి నీ లతాధరబింబము, శ్రీరంగేశయుడైన (శ్రీరంగ శాయియైన) శ్రీరంగనాథునియొక్క, పుణ్యము అను ద్రుమము (వృక్షము) యొక్క పండిన పండా? అనునట్లున్నది. ఉత్ప్రేక్షాలంకారము. వసంతతిలకా-వృత్తము.

స్మితాతిరసచంద్రికాం సముపయుజ్య చంచూపుటైః
అపాటవజుషశ్శుభే! ప్రసభమోషధీనాం పతిః,
చకోరపృథుకాని మానవతి కౌముదీకైతవం
కషాయమయ-మౌషధం విరచయన్నిదానీమపి. 76

ఓ మంగళప్రదురాలా! ఓషధులకు పతియైన చంద్రుడు, నీయొక్క స్మిత మనెడి అతిరుచికరమైన చంద్రికను ఉపయోగించి, వెన్నెల అను మిషతో కషాయ మయమైన ఔషధమును ఇప్పటికిని తయారుచేయుచు, చంచూపుటశక్తిలేని ఈ చకోరపు పిల్లలను రక్షించుచున్నాడు.

## విశేషములు

1) చిరునవ్వును వెన్నెలగా వర్ణించుట కవిసమయప్రసిద్ధము.

2) ఇచట గోదాదేవియొక్క చిరునవ్వే ఒక అత్యంతరుచికరమైన వెన్నెల.

3) దానిని ఓషధీపతియైన చంద్రుడు ఉపయోగించుకొనుచున్నాడు.

4) దానికి (స్మితమునకు) తాను ఓషధీపతియగుటవలన తనను చూచి రాత్రి ప్రకాశించు ఓషధుల (మూలికల) వగరును కలిపి కౌముది అను మిషతో ఒక ఔషధమును ఇప్పటికిని తయారుచేయుచున్నాడు.

(అనగా అతడు గోదాదేవినుండి స్వీకరించిన స్మితము అనెడి రుచిగల చంద్రికయొక్క ప్రభావము ఇప్పటికిని తరగకుండగ ఉన్నదని భావము).

5) ఆ విధమైన ఔషధమును తయారుచేసి చంచూపుటసామర్థ్యము లేని చకోరవుపిల్లలను తాను రక్షించుచున్నాడు.

6) చకోరములకు వెన్నెలయే జీవనము.

7) వాటి కిచ్చుటకు వెన్నెల, చంద్రునకు గోదాదేవియొక్క స్మితము నుండి లభించినది.

8) అది తరగని గనిగా ఇప్పటికిని ఉపయోగపడుచున్నది.

9) అనగా చంద్రునియందు మన మిప్పుడు చూచు వెన్నెల సహజము కాదనియు, అది గోదాదేవియొక్క స్మితమునుండి తెచ్చికొన్నదనియు, కవిగారి ఉత్ప్రేక్ష.

10) "కౌముదీకైతవం" అను నపుడు అపహ్నవాలంకారము.

11) ఇచట చంద్రుని వృత్తాంతముద్వారా -ఒక పక్షి ఎగురుటకుశక్తిలేని తన పిల్లలను పోషించువృత్తాంతము, అట్లే వైద్యుడు అచ్చటచ్చట తెచ్చిన సామగ్రిని(మూలికలువగైరా), ఔషధముగా తయారుచేయు

వృత్తాంతము గమ్యమానమగుచున్నది. కావున సమాసోక్తి అలంకారము.

12) "ఓషధీనాం పతిః-" అనగా- చంద్రుడు-వైద్యుడు కూడ. (అర్థ శ్లేష)

13) "స్మితాతిరసచంద్రికా" అనుచోట రూపకము.

14) గోదాదేవియొక్క స్మితమే వెన్నెలగా మారి చకోరపక్షులకు ఉజ్జీవక మగుచున్నదనుటవలన, పరిణామాలంకారము.

15) ఈ విధముగా ఈ శ్లోకమున -రూపక, పరిణామ, ఉత్ప్రేక్షా-పహ్నవ, శ్లేష, సమాసోక్త్యలంకారములు వర్ణించబడినవి.

16) ఈ విధముగా ఈ శ్లోకమున గోదాదేవియొక్క "స్మిత" "వైభవము" "వైశిష్ట్యము" వర్ణించబడినవి,

17) "శుభే!" అను సంబోధనము కూడ మంగళప్రదమైన చిరునవ్వును లోకమునకు పంచుటద్వారా సార్థకము.

18) అట్లే "సముపయుజ్య" "ఓషధీనాం పతిః" అను పదములు కూడ సార్థకములు.

19) "ముక్తాశుచిస్మితా" గోదా అష్టోత్తరమ్.

20) పృథ్వీవృత్తము.

శకలావివ భ్రువౌ తే
మధ్యత్రుటితస్య మదనకార్ముకస్య,
సహితః పూర్వస్రస్తః
చంపకశర ఏవ దేవి! నాసా చ. 77

అమ్మా! నీయొక్క కనుబొమలు మధ్యలో విరిగిన మన్మథుని ధనుస్సు యొక్క ముక్కలవలె ఉన్నవి. (ఉత్ప్రేక్ష.)

నీయొక్క నాసిక అంతకుముందుఉండి తరువాత) ఆ ధనుస్సునుండి క్రిందకు జారిన సంపంగి బాణమా? అనునట్లున్నది. (ఉత్ప్రేక్ష-రూపకము).

మన్మథుని అయిదుబాణములలో సంపంగి లేకపోయినను కవి ఇట్లు ఉత్ప్రేక్షించినారు. నాసికను సంపంగిపూవుతో సమానముగా వర్ణించుట కవి సమయప్రసిద్ధము.

చారు-చాంపేయనిభనాసికా" గోదా అష్టోత్తరమ్. ఆర్యా-వృత్తము.

నేత్రద్వైతమిదం సరోజపటలీసర్వస్వపాటచ్చరం
బాఢం శృంఖలితం బతాంజనకళాలీలాచ్ఛలేన ధ్రువమ్,
నాసాచంపకసన్నివేశచకితాశ్చైతే కటాక్షాలయః
శంకే దేవి! విలోచనాంతపదవీమాయాంతి తే సంతతమ్. 78

అమ్మా! నీయొక్క నేత్రద్వంద్వము పద్మములయొక్క సర్వస్వమును దొంగిలించినది. (ఆ శోభనుమించిన శోభగలది). ఆ దొంగతనమునకు ఫలితముగా- అయ్యో పాపము! కాటుక అనెడి గొలుసులచేత బంధింపబడినది.

మరియు నీ నాసిక అనెడి సంపెంగపూవుయొక్క ఉనికివలన భయపడినవైన నీ కటాక్షము లనెడి తుమ్మెదలు నేత్రములయొక్క చివరిభాగములకు వెళ్ళిపోవుచున్నవి [పారిపోవుచున్నవి]. ఇది నిశ్చయము.

ఇచట నేత్రములకు పద్మసామ్యము, కటాక్షములకు భ్రమరసామ్యము వర్ణించబడినవి. [తుమ్మెదలతో సామ్యము]- తుమ్మెదలు సంపంగిపూవుద్దకు వెళ్ళవు. ఇచట కూడ ఈమెయొక్క నాసిక అనెడి సంపెంగపూవును చూచి కటాక్షము లనెడి తుమ్మెదలు నేత్రముల చివరకు పారిపోవుచున్నవట. [క్రీగంటి ప్రసారములు]

మరియొక విశేషము -ఇచట నేత్రద్వయము ఒక దొంగగా వర్ణింపబడినది. ఏమిటా దొంగతనము? అనగా పద్మసమూహమునందలి శోభాసర్వస్వమును దొంగిలించుట. అందుకనియే వానికి సంకెలలు వేయబడినవి. కాటుకయే ఆ సంకెల.

రెండు కంఠ్ణయందును అలంకరించుకొనిన కాటుక శృంఖలాబంధము [సంకెల]వలె ప్రకాశించుచున్నది- అని భావము. రూపకోత్ప్రేక్షాలంకారములు. శార్దూలవిక్రీడిత-వృత్తము.

నిపీయ నిపుణం శ్రవశ్శిఖరమాలతీమంజరీ-
మధూని మధురాణి తే నిభృతమాగళం గర్వితైః,
అపాంగశిశుబంభరైః అసురభిత్తమాలద్రుమః
శుభాంగి! పరిఝుంకృతస్తత ఇతో రజో ముంచతి. 79

అమ్మా! శ్రీకృష్ణ దనెడి తమాలవృక్షము, నీయొక్క శ్రవఃశిఖరము నందున్న మాలతీమంజరులయందలి మధువులను గ్రోలి మత్తెక్కిన అపాంగము లనెడి చిరుతుమ్మెదల ఝుంకారముతో కూడినదై అటు ఇటు రజస్సును [పరాగ మును-అనురాగమును] వదలుచున్నది.

మధువును గ్రోలినవాడు మత్తెక్కి రజోగుణమును చూపించుట లోక సహజము. అది ఇచట శ్రీకృష్ణునకు వర్ణింపబడినది.

శ్రీకృష్ణుడే తమాలవృక్షము- అని రూపకము. తమాలవృక్షము వదలునది రజస్సు పరాగము-శ్రీకృష్ణునకు వర్ణించినది అనురాగము- ఈ విధముగా రజ శ్శబ్దము వద్ద శ్లేష, అపాంగములే చిరుతుమ్మెదలు, ఇట కూడ రూపకము,

ఇచట శ్రీకృష్ణునకు గోదాదేవియందు అనురాగము వర్ణింపబడినది. పృథ్వీ-వృత్తము,

పలాశమృగసంకులం కమలచంద్రరూపం గృహం
విహాయ భవదాననం న్యవిశదిందిరామందిరమ్,
యదా ఖలు తదాఖిలం తదుభయం తు నక్తం దివం
ప్రకాశవిధురం దురాసదరజస్తమోదూషితమ్. 80

అమ్మా! నాచుతోను, మృగముతోను కూడియున్న కమలము-చంద్రుడు- అను, గృహమును వదలి, లక్ష్మి (శోభ, కాంతి) నీయొక్క ముఖ మనెడి గృహ మును ఎప్పుడు ప్రవేశించెనో అప్పుడు చిన్నబోయిన ఆ రెండును (పద్మము-

చంద్రుడు వరుసగా రాత్రి-పగలు- ప్రకాశములేనివై గొప్ప రజస్సు- (రజో గుణము-పరాగము), తమస్సు- [తమోగుణము-చీకటి] లతో దూషితములై ఉన్నవి.

పద్మము రజస్సుతోను, చంద్రుడు తమస్సుతోను దూషితులైరి.(మరియు పద్మము నాచుతోను, చంద్రుడు మృగము[మచ్చ]తోను కప్పబడియున్నందున శోభ వాటినివదలినది.)

అనగా గోదాదేవియొక్క ముఖకాంతితో పద్మము[1], చంద్రుడు[2] కూడ జయింపబడి, ఒకరు[పద్మము] రాత్రి[1], ఒకరు[చంద్రుడు] పగలు[2] ప్రకాశించని వారై రజస్తమోగుణములతో దూషింపబడిరి.

వారిద్దరి ప్రకాశము ఏదో ఒక సమయముననే. గోదాదేవి ముఖము మాత్రము రాత్రింబవళ్ళు ప్రకాశించుచున్నది. అట్లే పద్మముయొక్క, చంద్రుని యొక్క గుణము లన్నియు ఈమెముఖమునందు ప్రకాశించుచున్నవి- అని అర్థము. ఆ రెండింటియందును ఒక్కొక్కదానియందు ఒక్కొక్కగుణమే కలదు. ఆ రెండింటియొక్క గుణములు ఈమెముఖమునందు కలవు. అని సారాంశము.

కాళిదాసు పార్వతియొక్క ముఖమును వర్ణిస్తూ—

"చంద్రం గతా పద్మగుణాన్ న భుంక్తే
పద్మాశ్రితా చాంద్రమసీమభిఖ్యామ్,
ఉమాముఖం తు ప్రతిపద్య లోలా
ద్విసంశ్రయాం ప్రీతిమవాప లక్ష్మీః."

(లక్ష్మీః=శోభ- చంద్రుని పొందినపుడు పద్మముల గుణములను, పద్మమును పొందినపుడు చంద్రునికాంతిని, పొందలేక పోయినది. పార్వతియొక్క ముఖమును పొంది, ఆ రెండింటిని [చంద్రుడు-పద్మము] ఆశ్రయించిన ప్రీతిని పొందినది) అని వర్ణించినాడు. ప్రకృతశ్లోకము కూడ అదే ఛాయతో ఉన్నది. యథాసంఖ్యా [క్రమా]లంకారము. పృథ్వీ-వృత్తము.

ముఖేనాబ్జావేతౌ కిమపి పరిభూతౌ తవ తయోః
సుదుర్దర్శేఽన్యస్మిన్ పతతి తపనాంగారశకటీమ్,
సరఃపాతిత్వే కం పరిలఘు సజీవం ప్లవనతః
పునర్జాతాత్తస్మాత్ అనుభవతి వైరేణ దురితమ్. 81

ఓ దేవీ! నీట బుట్టిన ఈ రెండును, [చంద్రుడు-పద్మము] నీ ముఖముచే జయింపబడి అవమానింపబడినవి. ఆ రెండింటిలో ఒకడైన చంద్రుడు అమావాస్య రోజున సూర్యుడను కుంపటిలో పడగా, రెండవదైన పద్మము చాలా తేలికై నదగుట వలన, నీళ్ళలో పడినదైనను, తేలుటవలన జీవించినదై, అగ్నిలోపడి ఆత్మహత్య గావించుకొని మరల పుట్టిన చంద్రునితో వైరముగొని, పాపము ననుభవించుచున్నది.

చంద్రుడు అమావాస్యరోజున సూర్యునితో కలియుటయు, మరల శుద్ధ విదియనాడు కనువించుటయు ప్రసిద్ధము. చంద్రుని చూచి పద్మము ముడుచు కొనుటయే పాప మనుభవించుట.

చంద్రునకు పద్మమునకు గల సహజవైరము ఈ విధముగా చమత్క-రించబడినది. రెండును నీటబుట్టినవే యైనను [అప్జః = నీట బుట్టినవాడు-చంద్రుడు, అప్జం= నీట పుట్టినది పద్మము] ఆ రెండింటికి వైరము ప్రసిద్ధము కదా—

ఈ శ్లోకమున కూడ గోదాదేవియొక్క ముఖము- చంద్రునియొక్క-పద్మముయొక్క శోభలతో ప్రకాశించుచున్నదని మరియొక విధముగా చెప్ప బడినది. శిఖరిణీ-వృత్తము.

యద్వా త్వన్ముఖనిర్జితం తు కమలం వాపీం ప్రవిష్టం తదా
దేవి ! ప్రౌఢపలాశతాముపగతం జాతాళికోలాహలమ్,
ఆసీద్ధూళిముదస్య పాతభయతః కిం దంతమంత్రాక్షరం
సద్వీక్షాక్షసరం జపోద్యదధరం జాతం తదేవాననమ్. 82

లేదా, ఓ గోదా! నీ ముఖముచే నిర్జింపబడిన కమలము- దిగుడుబావిలో ప్రవేశించినదై, పలాశత్వమును [ఎక్కువదళములను కలిగియుండుటను, మాంస

భక్షణమును) పొందినదై, తుమ్మెదల కోలాహలముకలదై, ధూళిధూసరము కూడ అయి, ఆ విధమైన పాతభయమును నివారించుకొనుటకై, నీయొక్క దంతము లనెడి మంత్రాక్షరములతోను, నీయొక్క కటాక్షములు [చల్లనిచూపులు] అనెడి జపమాలతోను, జపించుటకు ప్రయత్నించు అధరముతోను, ప్రకాశించు నీ ముఖముగా మారినదా ఏమి?

కమలము అనగా వేయిరేకులు గలది. ఆ కమలము గోదాదేవి యొక్క ముఖకాంతిచే జయింపబడినది. ఆ విధముగా జయింపబడిన ఆ కమలము—దిగుడుబావిలో దిగుట- కోలాహలముచేయుట- ధూళిధూసరమగుట - దానియొక్క పతనమునకు కారణములు. ఆ విధమైన పతనమును పొందిన ఆ కమలము పలాశత్వమును [మాంసభక్షణముచేసి] పొంది, బలముపుంజుకొని పతితపావనియైన గోదాదేవియొక్క ముఖముగా మారినదా? అని—

ఆ విధముగా మారుటకు కొంత తపస్సు చేయవలసిఉన్నది. ఆ తపస్సులో మంత్రాక్షరములు గోదాదేవియొక్క దంతములే- జపమాల- ఆమెయొక్క కటాక్షములు (చల్లనిచూపులు]- దళములవలె ఉండు అధరముల కదలిక జపించుటకు ఆరంభించుట- అని చెప్పబడినది

ఇచట కూడ గోదాదేవియొక్క ముఖము పద్మము యొక్క కాంతిని తిరస్కరించినదని చెప్పుటతోపాటు పతితపావనత్వముకూడ సూచించబడినది. రూపకోత్ప్రేక్ష. శార్దూలవిక్రీడిత-వృత్తము.

దృష్ట్వే ముఖేందౌ స్మితచంద్రికాభిః
దోర్మధ్యలావణ్యసముద్రపూరః,
ఉజ్జృంభితస్తే స్తనబింబదంభాత్
న లంఘితే సుందరి! బాహువేలే. 83

సుందరీ! నీయొక్క ముఖ మనెడి చంద్రుని చూచి, స్మితము లనెడి వెన్నెలలతో, దోర్మధ్యలావణ్య మనెడి సముద్రపూరము, నీయొక్క స్తనము లనెడి మిషతో విజృంభించినది. అయినను నీయొక్క బాహువు లనెడి వేలలను (హద్దులను) దాటలేదు.

చంద్రునియొక్క వెన్నెలలు చూచి సముద్రము ఉప్పొంగును. అయినను వేలను(చెలియలికట్టను) దాటదు- అట్లే ఇచట కూడ గోదాదేవియొక్క ముఖమే చంద్రుడు. చిరునవ్వులే వెన్నెలలు. రెండు బాహువులకు మధ్యనున్న భాగము యొక్క సౌందర్యమే సముద్రపూరము. ఆ సముద్రపూరము విజృంభించుటయే స్తనముల ఔన్నత్యము.

సముద్రము వేలను దాటి పైకి రానట్లే స్తనౌన్నత్యము కూడ బాహుద్వయమును దాటి పైకిరాలేదు. అనగా అంతవరకు (బాహువులవరకు) వ్యాపించిన స్తనౌన్నత్యము కలది- గోదాదేవి- అని భావము. రూపకాలంకారము.

శ్రీపరాశరభట్టరులు కూడ శ్రీగుణరత్నకోశమున "అమర్యాదమకంటకం స్తనయుగం- 48", ఇత్యాది శ్లోకములయందు ఇట్టి వర్ణనలనే చేసియున్నారు. ఉపజాతి-వృత్తము.

దేవి ! త్వన్ముఖగర్హితేన గరళే పీతే కళంకచ్ఛలాత్
అంశేనాష్టతనోః కృతాన్యజనుషా జైవాతృకేనేందునా,
మధ్యేసాగరముష్ణతేజసి పరం పాతే పునర్జీవతా
తేనానేన హిమాస్రబిందునికరైరద్యాపి కిం తుష్యతే? 84

ఓ దేవీ! నీ ముఖగర్హితుడై (నిర్జితుడై- లేదా- తిరస్కరింపబడి) కళంకమను మిషతో విషము త్రాగి, చనిపోయిన చంద్రుడు, ఈశ్వరునియందున్న అంశతో చిరంజీవియై మరల జన్మించి, మరల సముద్రములో బడబాగ్నిమధ్యయందు పడి, మరల జీవించినవాడై, ఆ సంతోషముతో ఆనందబాష్పములను (మంచు అను కన్నీళ్ళు) వదలుచున్నాడా ఏమి?

ఇచట "చంద్రుడు ఎన్ని పర్యాయములు మరణించుటకు ప్రయత్నించినను- ఆతడు మరణించుట లేదు" అను విషయము జైవాతృక (చిరంజీవి) శబ్దము ద్వారా సూచితము. శార్దూలవిక్రీడిత-వృత్తము.

లావణ్యగౌరవవివిత్సురయం విధాతా
చంద్రం ముఖం చ తులయా కలయాంచకార,
తత్రేందు రర్థగత ఏవ పరం లఘీయాన్
ఏతన్ముఖం భువి తవాంబ! గురుత్వరాజత్. 85

అమ్మా! బ్రహ్మ, లావణ్యమునందలి గౌరవమును తెలిసికొనదలచిన వాడై, చంద్రుని, నీయొక్క ముఖమును- త్రాసులో ఉంచెను. అప్పుడు నీ యొక్క ముఖము గురుత్వముతో భూమియందే ప్రకాశించగా, చంద్రుడు లఘువై ఆకాశమునకు పోయెను.

ఈ శ్లోకమున గోదాదేవియొక్క గురుత్వమును- చంద్రుడు లఘువై ఆకాశమునకు వెళ్లుటయు చమత్కారముగా వర్ణింపబడినది. రెండు వస్తువులను త్రాసులో ఉంచినపుడు బరువైనది క్రిందకు వచ్చుటయు తేలికైనది పైకి పోవుటయు జరుగును.

ఆ విధముగా ఆమెముఖమునందలి గురుత్వమువలన ఆమె భూమియందే ఉండిపోయినది, చంద్రుడు ఆకాశముననే ఉండువాడే అయినను, గోదాదేవి ముఖముముందు తేలికయైనవాడై ఆకాశమునకు పోయినవాడుగా వర్ణింపబడినాడు. ఉత్ప్రేక్షాలంకారము. వసంతతిలకా-వృత్తము.

త్వదాస్యచంద్రో ధ్రువమేక ఏవ
లోకే, పరో యః ప్రతిభాతి చంద్రః,
న చాక్షిదోషః తిమిరార్తన్యాణాం
చంద్రద్వితా కిం జగతి ప్రసిద్ధా? 86

అమ్మా! నీయొక్క ముఖము అనెడి చంద్రుడు ఒక్కడే లోకమున ప్రసిద్ధుడు. రెండవవాడుగా ఆకాశమున కనుపించువాడు- అతడు నిజముగా చంద్రుడు కాడు. అది కేవలము తిమిరదోషముతో (చీకటితో) బాధపడెడి జనుల యొక్క నేత్రదోషము తప్ప వేరుకాదు.

ప్రపంచమున ఇద్దరు చంద్రులు లేరు కదా.

"నీ ముఖచంద్రుడే చంద్రుడు- ఇతరులు కా"దని ఇచట వర్ణించుటవలన -సామాన్యముగా కనపడు చంద్రునికంటె ఈమెయొక్క ముఖచంద్రునియందు వైశిష్ట్యము వర్ణింపబడినది.

మరియు ఈ శ్లోకమున "ప్రసిద్ధుడైన చంద్రుడు చంద్రుడు కాదని ఈమె ముఖచంద్రుడే చంద్రు"దని వర్ణించుటవలన అపహ్నవాలంకారము. "పూర్ణచంద్రాననా" గోదా అష్టోత్తరమ్. ఉపజాతి-వృత్తము.

దేవి! త్వదీయాననచంద్రపీతం
తమోవిషం కుంతలపం క్తిదంభాత్,
ఉన్మస్తకం వీక్ష్య సభీతికంపా
నాసామణిశ్చంచతి రోహిణీవ. 87

దేవీ! నీయొక్క ఆనన మనెడి చంద్రునిచే త్రాగబడిన చీకటి యను విషము కుంతలముల వరుస అనెడి రూపముతో శిరసున నుండుట(నెత్తికెక్కి కూర్చుండుట) చూచి, భయముతోకూడిన కంపముగలదై ముక్కునత్తు(ముక్కెర), రోహిణివలె ప్రకాశించుచున్నది.

ఇచట గోదాదేవియొక్క ముక్కెర రోహిణిగా వర్ణించబడినది. రోహిణి చంద్రుని భార్య, ఆమె ఎప్పుడును చంద్రుని వదలదు. గోదాదేవియొక్క ఆననమే చంద్రుడు కాబట్టి ముక్కెర రోహిణిగా వర్ణింపబడుట సమంజసమే. ఆ ముక్కెరయొక్క కదలిక "విషమును త్రాగిన చంద్రుని చూచి భయపడి కంపించుచున్న రోహిణివలె ఉన్నది". చంద్రుడు త్రాగిన విషము- చీకటి. ఈమెయొక్క ముఖచంద్రుడు త్రాగిన విషము- అలకలయందలి నల్లదనము.

ఈ విధముగా ఆమెయొక్క శిరోజముల "నిగనిగ" కూడ ఇందు వర్ణింపబడినది. ఉపమారూపకాలంకారములు, ఉపజాతి-వృత్తము.

అలకతిమిరైః స్వస్మిన్ దోషేణ గుంఫితమౌ క్తిక-
ప్రకరమిషతస్తారా బందీకృతా ఇతి దుర్మనాః,
కృపణవపుషా నాసారత్నచ్ఛలేన గతో విధుః
లుఠతి హసితే లీనాం జ్యోత్స్నామవేక్ష్య తవాధరే. 88

అమ్మా! అలకలనెడి చీకట్లచేత తనయందలి దోషము కారణముగా "గుచ్చబడిన ముత్యములు" అను మిషతో నక్షత్రములు బందీకృతము లైనవని బాధపడినవాడై, నీ ముక్కెర అను మిషతో చిన్న శరీరమును దాల్చిన చంద్రుడు

నీయొక్క అధరమునందలి చిరునవ్వులో లీనమైన వెన్నెలను చూచి అచటనే దొంగలుచున్నాడు.

ఈ శ్లోకమున చంద్రుడే గోదాదేవియొక్క ముక్కెరగా వర్ణింపబడినాడు ఆమెయొక్క ముక్కెర చంద్రునివలె స్వచ్ఛముగా ప్రకాశించుచున్న దని భావము. మరియు ఆమె ధరించిన హారమునందలి ముత్యములే నక్షత్రములుగా వర్ణితములు.

ఆమె ముక్కెర పూర్వశ్లోకమున రోహిణిగాను, ఈ శ్లోకమున చంద్రుడుగాను వర్ణించబడినది. అపహ్నవాలంకారము-హరిణీ-వృత్తము.

సీమంతస్థగితమణేః
అతిపీతాలకవిషాంధకారస్య,
ఉద్గారమేవ మన్యే
కస్తూరీతిలక మంబ! తే ఫాలే. 69

అమ్మా! నీయొక్క ఫాలమునందున్న కస్తూరీతిలకము- అలకలయందలి నీకటి యనెడి విషమును బాగుగా త్రాగిన, సీమంతమునందు దాల్చబడిన మణియొక్క ఉద్గారమునుగా (వమనమునుగా) తలంచుచున్నాను.

కస్తూరీతిలకము నల్లగా ఉంటుంది. ఆ తిలకమునకు పైననే సీమంతమణి (పాపటపట్టి) ఉంటుంది. ఈ కస్తూరియొక్క నల్లదనము ఆ మణియొక్క వమనము (వాంతి) వలె ఉన్నది. ఆ మణికి వమనము వచ్చుటకు కారణము- విషమును త్రాగుట. అలకలకు దగ్గరలోనున్నది కావున అలకలయందలి నల్లదనమే (అంధకారమే) ఆ మణి త్రాగిన విషము.

విషము త్రాగిన వెంటనే బైటకు వచ్చినట్లుగా ఈ అంధకారమును కూడ ఆ మణి త్రాగిన వెంటనే లోపల ఇముడ్చుకొనలేక పైకి వదలినది. ఆ వదలుటయే (వమనమే) ఈ కస్తూరీతిలకమయినట్లుగా వర్ణింపబడినది.

ఇచట కస్తూరీతిలకముయొక్క నీలిమ, దానితోపాటు అలకల నీలిమ, మణియొక్క స్వచ్ఛత, బాగుగా వర్ణింపబడినవి. మణికి విషమును త్రాగుటయు,

త్రాగిన ఆ విషమును బైటకువదలి స్వచ్ఛమగుటయు లోక ప్రసిద్ధము. రూపకము ఉత్ప్రేక్ష—అలంకారములు.

(1) "ధగద్ధగాయమానోద్యన్మణి సీమంతభూషణా"

(2) "విలసత్కస్తూరీతిలకోజ్జ్వలా" గోదా అష్టోత్తరమ్.

ఆర్యా-వృత్తము.

పశ్యంతి సీమంతయుతాముదారాం
శిరోజపంక్తిం తవ మాతరేతామ్,
వోఢుః కుమారస్య యదూద్వహస్య
కళిందపుత్రీమివ దత్తమార్గామ్. 90

అమ్మా ! పాపటగా తీయబడిన నీయొక్క ఉదారమైన శిరోజపంక్తిని, శ్రీకృష్ణుని తీసి(మోసి)కొని పోవుచున్న వసుదేవునకు రెండు పాయలై మార్గము నిచ్చిన యమునానదిగా తలచుచున్నారు.

ఇచట నల్లగానుండుట, రెండుగా చీలియుండుట, అనునవి శిరోజపంక్తికిని యమునకును సమానములు. ఉత్ప్రేక్ష ఉపజాతి-వృత్తము.

ఉపేయుషీ వక్రగతిం ప్రకృత్యా
యా కృష్ణగోమండలపీయమానా,
నీలాంబరోత్పన్న భయోపపన్నా
కళిందకన్యా కిము తేఽలకాళిః? 91

అమ్మా ! సహజముగనే వక్రమైనట్టిదియు, నల్లటి కేశసంపదచే అందముగా కనపడునదియు, నీలిరంగు గల ఆకాశముయొక్క శోభతో కూడినదియు, అయిన నీ అలకసమూహము,

సహజముగనే వంకరగా నున్నట్టియు, కృష్ణునియొక్క ఆవులచేత (లేదా కపిలగోవులచేత) త్రాగబడునట్టిదియు, బలరామునియందలి భయముకలిగినట్టిదియు, అయిన యమునానదియా? అన్నట్లున్నది.

అలకలను నల్లగా నుండునట్లు వర్ణించుట కవిసమయప్రసిద్ధము. ఆ విధముగా నల్లగానుండు యమునానదితో ఇచట గోదాదేవియొక్క అలకలు పోల్పబడినవి.

ఇచట "గోమండల" శబ్దమునకు [1]కేశములతో దర్శనీయ మనియు, [2]ఆవుల సమూహ మనియు, "నీలాంబర" శబ్దమునకు [1]నల్లటి ఆకాశమనియు [2]బలరాము డనియు, "భయోపపన్నా" అను పదమునకు [1]భా అనగా కాంతి-దానితో కూడిన దనియు [2]భయముతో కూడినదనియు -రెండేసి అర్థములు చెప్పికొన్నచో- మొదటి అర్థము అలకలకును, రెండవ అర్థము యమునకును వర్తింపును. ఈ విధముగా ఇందు శ్లేష-ఉత్ప్రేక్షాలంకారములు కలవు. ఉపజాతి-వృత్తము.

ఋజ్వీం విహాయ జనని! ప్రకృతిం త్వదీయాం
హై! వక్రిమా చికురబంధముపాగతస్తే,
యస్మాత్తమోభయముపేత్య సమాశ్రితానాం
నావిష్కరోతి నిబిడం తిమిరం స ఏషః. 92

అమ్మా! నీయొక్క ఋజువైన ప్రకృతిని వదలి వక్రిమ చికురబంధమును పొందినది. (వక్రత అలకలయందే గాని స్వభావమునందు లేదనుట.) ఏందువల్లననగా నీయొక్క ప్రకృతి తమోభయముచే ఆశ్రయించినవారలకు తిమిరమును ఆవిష్కరింపచేయుటలేదు.

అనగా స్వభావసిద్ధమైన నీ ఋజుస్వభావము ఆశ్రయించినవారల అజ్ఞానమును పోగొట్టి వారలకు మోక్షము నిచ్చుటకు మార్గదర్శకమగుచున్న దని భావము.

హై- ఆశ్చర్యమును- ఆనందమును సూచించుచున్నది. "నీలకుటిలాలకభితా" గోదా అష్టోత్తరమ్. వసంతతిలకా-వృత్తము.

ధమ్మిల్లబంధకృతబాంధవబంధురాణాం
ప్రాణేశమౌళిభరణోద్వ్యదహంయుతానామ్,
గంధేన మజ్జనని! తే సుమనస్సరాణాం
ఆగాంసి నస్త్వపసరం(త్వతి)త్విహ మాంసలాని. 93

అమ్మా ! నీయొక్క ధమ్మిల్లముతో సహవాసము చేసి, మనోజ్ఞములై, నీయొక్క విభుడు శిరస్సున దరించుటచే గర్వించుచున్న — పూలదండలయొక్క గంధముచేత మాయొక్క అత్యుత్కటములైన పాపములు కూడ నశించును గాక-

(ఆముక్తమాల్యదవైన నీయొక్క మాల్యముల సువాసనలు మాయొక్క పాపములను పోగొట్టును గాక.)

"చంపకాశోకపున్నాగమాలతీవిలసత్కచా"

"మల్లికాపారిజాతాది దివ్యపుష్పస్రగంచితా" -గోదా అష్టోత్తరమ్.

నేహ సంసరణరోగసంభృతిః
జాయతే శతభిషక్చికిత్సయా,
అంతరేణ శతవైరికంధరా-
లంబమానవకుళస్రజాం రజః.

అను ఈ నక్షత్రమాలికలో కూడ- "శతవైరికంఠసీమలోని పుష్పమాలికా రజస్సుతో తప్ప -వందమంది వైద్యుల చికిత్సతో కూడ సంసారరోగము నయము కాదు" అని చెప్పబడుట గమనించతగినది. వసంతతిలకా-వృత్తము.

(అహమాశ్రయామి- 44శ్లో. అను శ్లోకమునుండి ఈ(98) శ్లోకమువరకును గోదాదేవియొక్క సర్వావయవవర్ణన చేయబడినది. సాధారణముగా మానవుల వర్ణనను శిరస్సుప్రారంభించుకుని పాదములవరకును, దేవతలవర్ణనను పాదములు ప్రారంభించుకుని శిరస్సువరకును, చేయుట కవిసంప్రదాయము.

దీని ననుసరించియే "చికురప్రకరా జయన్తి తే" అని శ్రీహర్షుడు తన నైషధకావ్యమున దమయంతీవర్ణనను శిరస్సుతోను, కాళిదాసు తన కుమారసంభవకావ్యమున పార్వతీవర్ణనను "అభ్యున్నతాంగుష్ఠనఖప్రభాభిః" అని పాదములతోను ప్రారంభించియున్నారు- అట్లే ఇతర కవులు కూడ ఈ సంప్రదాయము ననుసరించిరి.

ఆ విధముగనే ఇచట కవిగారు కూడ 44వ శ్లోకమునుండి గోదాదేవి యొక్క పాదములు- అందలి విశేషములతో ప్రారంభించి, శిరస్సు అందలి

విశేషములతో ఈ శ్లోకమువరకు ఆమెయొక్క పాదాది-శిరఃపర్యన్తవర్ణన చేసి యున్నారు. అందునను ఒక్కొక్క అవయవవర్ణన అనేక కోణములలో చేయుట కూడ వీరి ప్రత్యేకత.

అపనయతు దేవి! భవతీ
భవతీవ్రదవానలేన సంజాతమ్,
చేతోగతం సమంతాత్
అనాదిసంతాపమమృతధారేవ. 94

దేవీ! సంసార మనెడి తీవ్రదవానలముచేత కలిగిన మనస్సునందలి అనాదిసంతాపమును అమృతధారవలె నీవు పోగొట్టుదువు గాక—

భవతీ - భవతీ వ్ర - యమకము.
అమృతధారవలె - ఉపమాలంకారము.
సంసారమే తీవ్రదవానలము - రూపకాలంకారము.

ఆర్యా-వృత్తము.

గుణకణికాపరాఙ్ముఖమసారమసారవపు—
శ్చపలమపారపాతకనికాయనికామకృతమ్,
అపి బత! మాం పునీహి సహసా బహు సాహసికం
భగవతి! తే పదద్వయపయోజపయోజవతః. 95

ఓ భగవతీ! గుణలేశమునందు కూడ పరాఙ్ముఖుడైనట్టియు, (ఏ విధము లైన గుణములు లేనట్టి)— అసారమైన శరీరమునందు చపలుడనైనట్టియు, అపార ములైన పాపములకు కర్తనైనట్టియు, నన్ను— నీ పదపద్మములనుండి స్రవించెడి నీటియొక్క (మధు-అమృత-ధారల) వేగముతో నా సాహసమును (తొందర పాటును) పోగొట్టి పవిత్రునిగా చేయుము.

ఈ శ్లోకమున నాలుగుపాదములయందును (మసార-మసార, నికాయ-నికామ, సహసా-బహుసా, పయోజ-పయోజ) యమక మను శబ్దాలంకారము కలదు.

కవిగారు ఇచటనుండి చివరవరకు స్వనైచ్యమును చెప్పుకొనుచున్నారు. విశిష్టాద్వైతసిద్ధాంతమున శ్రీయామునాచార్యులు మొదలైనవారు అందరును స్వనైచ్యానుసంధానమును చేసికొనియున్నారు.

1) అమర్యాదః క్షుద్రః-ఆళవందార్ స్తోత్రం – శ్లో. 62

2) వృత్త్యా పశుర్నరవపుః-యతిరాజవింశతి – శ్లో. 8

3) నిత్యం త్వహం పరిభవామి-యతిరాజవింశతి - శ్లో. 9

4) హా హన్త హన్త – యతిరాజవింశతి – శ్లో. 10

5) ప్రేమార్ద్రార్ద్ర విహ్వలగిరః - శ్రీవైకుంఠ స్తవం – శ్లో. 10

ఇత్యాదులు. ఇవి యన్నియు వారియందు లేకపోయినను ఉన్నట్లు భావించుకొని చెప్పుకొనినవి. వైష్ణవులకు నైచ్యానుసంధానము జన్మసిద్ధము. నర్కుటక– వృత్తము.

అలం ముహురహం బహుప్రకృతిహేయతాబోధనే
ధనే పరవధూజనే లగతి మే పరం మానసమ్,
న విశ్వసితుమర్హతి ప్రసభమంబ! నిత్యం వృథా
నయామి నయచాతురీనియత ఏష మాయానటః. 96

అమ్మా! బహుస్వభావములుకల ఈ ప్రపంచముయొక్క హేయత్వమును మాటిమాటికిని బోధించుటయందు నేను సమర్థుడనే -నాయొక్క మనస్సు మాత్రము- ధనమునందును పరవధూజనమునందును, తగుల్కొనుచున్నది. ఆ విధముగా విశ్వాసపాత్రముగాని మనస్సుతో మాయానటునివలె జీవితమును గడపుచున్నాను.

("మాయానటః" అను పదమువద్ద– "సన్" అని గాని- "ఇవ" అని గాని పదమును అధ్యాహారము చేసికొనవలయును. అట్లే "ఏషః" అను పదము తర్వాత "అహం" అను పదమును అధ్యాహారము చేసికొనవలయును. లేదా -"నయామి నయచాతురీం నియత ఏవ మాయానటః" అని నాలుగవపాదమును మార్చుకొనవలయును.) పృథ్వీ-వృత్తము.

ఆగామ్యనర్థపరిశీలనశీలదూరం
　　ఆరాధ్య మామిహ పతన్తమథో వధూషు,
ఏతే ధ్రువం భగవతి! స్వయమప్రతీపం
　　దీపేషు రూపచపలాశ్శలభాః పతన్తి. 97

దేవీ! రాబోవు అనర్థములను తెలిసికొనలేనట్టియు, వధూజనాసక్తుడనైనట్టియు, నన్ను ఆరాధించి రూపచపలములైన ఈ శలభములు, (మిడతలు) అడ్డులేకుండగ స్వయముగ దీపములయందు పడుచున్నవి. భగవతీ! ఇది నిజము.

ఇక్కడ రూపములయందు భ్రాంతులైన కవిగారిని ఆరాధించి శలభములు, రూపములయందు (కాంతియందు) భ్రమపడి, గుడ్డిగా దీపములయందు పడుచున్న వని వర్ణింపబడినది. రూపములయందు భ్రాంతిని పొందుటలో తాము శలభములకు మార్గదర్శకుల మని కవిగారు చెప్పుకొనుచున్నారు.

ప్రాకృతవిషయాసక్తులైన తాము దీపములయందు రూపభ్రాంతితో పడు మిడతలవలె మాడిపోవుటకు సిద్ధముగా ఉన్నామనియు, కాబట్టి తమ రక్షణభారము గోదాదేవిదే అనియు ఇక్కడ కవిగారి అభిప్రాయము. వసంతతిలకావృత్తము.

రాగప్రరోహనవసూత్రసమర్పణేన
స్వేచ్ఛావశంవదమధీరముదారశీలే।
కృత్వా నితాంతమబలాజనహాసపాత్రం
మామత్ర నాటయతి మన్మథసూత్రధారః. 98

ఉదారస్వభావముగల ఓ తల్లీ! మన్మథు డనెడి సూత్రధారుడు, రాగాంకురము అనెడి క్రొత్తసూత్రముతో బంధించి, అధీరుడనై ఆతనికి వశుడనైన నన్ను, పూర్తిగా అబలాజనులకు హాసపాత్రునిగా చేసి, ఇచట నటింపచేయుచున్నాడు. రూపకాలంకారము. వసంతతిలకావృత్తము.

మమ మతిరుపదేశైః దేశికానాం న చ స్యాత్
భగవతి! న విచిత్రం పాత్రదోషో బలీయాన్,
అపి సరళపయోదావర్జితైః వృష్టిపాతైః
ఉదయమిహ శిలాయామంకురః కిం కరోతి? 99

భగవతీ! గురువుల ఉపదేశముచే నాకు జ్ఞానము కలగకున్నది. ఇది విచిత్రము కాదు. పాత్రదోషము బలమైనది కదా- సరళములైన మేఘములవలన వచ్చిన వర్షముతోనైనను, రాతియందు అంకురము మొలకెత్తదు గదా!

ఇచట గురూపదేశము సరళవృష్టిగను, కవిగారి మనస్సు కఠినశిలగను వర్ణింపబడినవి. "సరళవృష్టిపాతముచేతనైనను- శిలయందు అంకురము మొలవనట్లే, సరళములైన గురూపదేశవాక్కులచేత కూడ తమ బుద్ధి వికసించలేదు" అని కవిగారు చెప్పుకొనుచున్నారు దృష్టాన్తాలంకారము.

భవభూతి ఉత్తరరామచరిత్రలో—

వితరతి గురుః ప్రాజ్ఞే విద్యాం యథైవ తథా జడే
న చ ఖలు తయోః జ్ఞానే శక్తిం కరోత్యపహన్తి వా,
భవతి చ పునర్భూయాన్ భేదః ఫలం ప్రతి తద్యథా
ప్రభవతి శుచిర్బింబగ్రాహే మణిర్న మృదాం చయః.

(గురువు అజ్ఞునికి ప్రాజ్ఞునికి ఒకే విధముగా విద్య బోధిస్తాడు. కాని వారిద్దరికిని గ్రహించటంలో చాలా తేడా ఉంది. స్వచ్ఛమైన అద్దం బింబాన్ని గ్రహిస్తుంది కాని మట్టిముద్ద గ్రహించలేదు కదా!)

అని చెప్పిన శ్లోకమును ఇచట అన్వయించుకొనవచ్చును. పృథ్వీ-వృత్తము.

కులం కలుషసంకులం దురితయాతనా చేతనా
వపుస్తు రిపురాత్మనః ప్రళయయామినీ కామినీ,
కుజల్పితవికల్పితవ్యసనసింధవో బంధవః
కిమత్ర శరణం భవచ్చరణమంతరేణాంబ! మే? 100

నావలన కులము(గృహము) కలుషితమైనది. ప్రాణము మహానరక యాతనను అనుభవించుచున్నది. నా శరీరము నాకే శత్రువైనది. భార్య ప్రళయ కాలపు రాత్రియైనది. బంధువులు కుజల్పితములతో కూడిన ఆపద లనెడు సముద్రములు. కావున ఓ జగజ్జననీ! ఈ సందర్భమున నీ యొక్క చరణములు తప్ప నాకు వేరు శరణ మేది?

"అన్యథా శరణం నాస్తి త్వమేవ శరణం మమ (వేరు దిక్కు లేదు- నీవే నాకు దిక్కు) అని గోదాదేవియొక్క చరణములయందే శరణు పొందబడినది.

అనుప్రాస శబ్దాలంకారము. రూపకము అర్థాలంకారము.

శ్రీకులశేఖరుల ముకుందమాలలోని ఈ క్రింది శ్లోకమున కూడ ఇదే విషయము చెప్పబడినది—

తృష్ణాతోయే మదనపవనోద్ధూత మోహోర్మిమాలే
దారావర్తే తనయసహజ గ్రాహసంఘాకులే చ,
సంసారాఖ్యే మహతి జలధౌ మజ్జతాం నస్త్రిధామన్ !
పాదాంభోజే వరద ! భవతో భక్తినావం ప్రయచ్ఛ.

([1]ఆశ యనెడి [2]నీరు, [1]మదనుడను, [2]గాలిచేత, ఎగురగొట్టబడిన [1]మోహ మనెడి [2]తరంగములు, [1]భార్య యను [2]సుడిగుండము, [1]సంతానము [1]సోదరులు అను [2]మొసళ్ళు గల [1]సంసార మనెడి [2]సముద్రమునందు మునిగితేలుతున్న మాకు ఓ వరదా ! నీయొక్క పాదపద్మములయందు [1]భక్తి అనెడి [2]నావను నీవే ఇమ్ము) -అని.

1) సంసారమునకు వర్తించునవి.

2) సముద్రమునకు వర్తించునవి.

ఈ ముకుందమాలా శ్లోకమున సంసారమే సముద్రముగా చెప్పబడినది. సముద్రమును దాటుటకు నావ ఎట్లో సంసారమును దాటుటకు భక్తి అట్టిది.

ప్రకృతశ్లోకము కూడ కొద్దిగ ఈ ఛాయలో ఉన్నది. పృథ్వీ-వృత్తము.

అసంకుచితసంచితం వ్యసనహేతుకం పాతకం
సమస్తజనతాతిరస్కరణభాజనం తే జనమ్,
అకించనమవంచనస్ఖలితయా దయాధారయా
రయాదవనధీరయా జనని! మామిమం పాలయ ! 101

ఏ విధమైన సంకోచములేకుండగ వ్యసనమే కారణముగా పాతకము సంపాదించబడినది. ఆ కారణముగా అందరి తిరస్కారమునకును పాత్రుడనైన,

దీనుఁడనైన, నీవాఁడనైన, నన్ను- ఓ జననీ! సహజముగా స్రవించునట్టిదియు రక్షించుసామర్థ్యముకలదియు, అయిన, నీయొక్క దయాధారతో (అపారకరుణతో) నత్వరమే పాలింపుము. అనుప్రాస. పృథ్వీ-వృత్తము.

దిశి దిశి మృగతృష్ణాం తృష్ణయా కృష్ణసారో
రభసమధిగతో వా ? విందతే మందతేజాః ?
ఇహ ముహురహమేవం విభ్రమభ్రామితస్త్రీ–
చపలచపలతేజాః క్వాపి నోపేతసౌఖ్యః. 102

కృష్ణసార మనెడి మృగము దాహముకొన్నదై ప్రతి దిక్కు తిరుగుచు చివరకు ఎండమావులను చూచి "నీరు" అని భ్రమించినను నీటిని పొందగలదా? (పొందలేదు- దాని దాహము తీరదు)-

అట్లే నేను ఈ లోకమున విలాసాలతోకూడిన స్త్రీలయందు లగ్నమైన మనస్సు కలవాఁడనై ఎక్కడను సౌఖ్యమును పొందలేకపోతిని.

అనుప్రాసాలంకారము. మొదటిపాదమున "ష్ణ" అను అక్షరము. రెండవ పాదమున "ంద" అను అక్షరము. మూడవపాదమున "హ" "భ్ర" అను అక్షరములు పునరుక్తములైనవి.

నాలుగవపాదమున "చపల-చపల" అనుచోట మాత్రము యమకము. మాలినీ-వృత్తము.

కింపచానమనుకంపయా యది
స్వీకరోషి- బత ! మామత స్తవ,
శ్లాఘ్యతా భవతి దేవి! కిం తృణ–
గ్రాహిణో జయతి నో మణేర్గుణః ? 103

దేవీ! దుర్మార్గుడనగు నన్ను నీవు దయతో స్వీకరించినచో నావలన నీకు కీర్తికూడ వచ్చును. (పతితపావనత్వవ్రతము వలన వచ్చుకీర్తి).

అమ్మా! లోకమున తృణమును గ్రహించినను మణియొక్క గుణములు సర్వోత్కృష్టము లగుట లేదా ?

అనగా "పెద్దలైనవారు చిన్న విషయమును స్వీకరించినను వారి పెద్దరిక మునకు లోటురానట్లే —తమను స్వీకరించినను ఆమెయొక్క గొప్పతనమునకు హీనతకలుగదు" అని కవిగారి అభిప్రాయము. దృష్టాన్తాలంకారము. రథోద్ధతా-వృత్తము.

క్షుద్రం దరిద్రాణమిమం గుణేన
మాం చేదవత్యాం మహితే! భవత్యామ్,
కీర్త్యా హరిశ్చందనచర్చయేవ
ధత్తే నవానందమమందమేషః. 104

మాహాత్మ్యముగల ఓ తల్లి! నీచుడను గుణహీనుడను అయిన నన్ను నీవు రక్షించినచో, చందనచర్చవలన హరివలె, వీడు కూడ(కవిగారు), నీచే రక్షింపబడినా డను నూతనానందమును పొందగలడు.

ఉపమా—అనుప్రాస—అలంకారములు. ఇంద్రవజ్రా-వృత్తము.

ఇహ సంసృతికాననే చరిష్ణుః
జనని! త్వత్కృతరక్షణాతిపాతీ,
పశువత్ స్మరలుబ్ధకేన బద్ధో
వనితాదీర్ఘకటాక్షవాగురాభిః. 105

జననీ! ఈ లోకమున సంసార మనెడి అరణ్యములో పశువువలె తిరుగుచు, నీవు చేయు రక్షణను కూడ అతిక్రమించినవాడనై, మన్మథ డను కిరాతునిచే వనితల దీర్ఘకటాక్షములు అను వలలతో బంధింపబడినాను.

కావున రక్షించుటకు నీవు తప్ప వేరు దిక్కు లేదు. ఉపమారూపకాలంకారములు. ఔపచ్ఛందసిక-వృత్తము.

సత్యం సత్యం విషయవిషయే మేదురా మే దురాశా
ఆశాదేశేష్వధికమధికం చారయంత్యశ్చరంత్యః,
ఆసామాసం వ్యసనవివరం సంగతస్సంగతోఽహం
మాతః! స్ఫీతస్ఫురణకరుణాలీలయా పాలయాశు. 106

అమ్మా! శబ్దాదివిషయములయందు నిత్యము నా దురాశ చాల ఎక్కువగా ఉన్నది. ఆశలు అన్ని దిక్కులయందును సంచరించుచున్నవై నన్ను కూడ త్రిప్పుచున్నవి. నేను పూర్తిగా వ్యసనసముదాయమునకు ఖనిసనై యున్నాను. ఇది నిజము. కావున ఓ మాతా! నీయొక్క అపారకరుణాలీలచే నన్ను శీఘ్రముగ పాలించుము. అనుప్రాస. మందాక్రాన్తా-వృత్తము.

తవ ప్రయాసస్తు కటాక్షమాత్రం
ఉజ్జీవనం మే బత! యావదాత్మ్యమ్,
అజ్ఞస్య విజ్ఞాపనమేతదేవ
దేవి! త్వమేతత్ విదుషీ క్షమస్వ. 107

దేవీ! నీకు ప్రయాస కేవలము క్రీగంటిప్రసారము మాత్రము. (చల్లని చూపులు), కాని అది నాకు ఆత్మ ఉన్నంతకాలము ఉజ్జీవనము. ఈ అజ్ఞుని యొక్క విజ్ఞాపనమును విదుషివైన నీవు తెలిసికొని క్షమించవలసినది.

ఇచట "విదుషీ" పదము సార్థకమైనది. "అందరి అన్ని విషయములను తెలిసికొనునది" అని. అందువలననే తమ విషయములను కూడ తెలిసికొని క్షమించుమని వేడికొనుచున్నారు. ఉపజాతి-వృత్తము.

గోదే! స్వరూపే శ్రితరక్షణే చ
దోషవ్రజానాం సహనే క్షమా త్వమ్,
కుతశ్చిదప్యక్షమమంజసా మాం
సీమాం నయ త్వత్పదపల్లవస్య. 108

అమ్మా! గోదా! నీవు సుఖస్వరూపురాలవు. స్వరూపమునను ఆశ్రిత రక్షణమునను, దోషసముదాయమును సహించుటయందును నీవు క్షమవు. (సహన శీలివి-భూమివి) -ఏ విధముగాను క్షమకు అర్హుడుకాక పోయినను నన్ను నీయొక్క నిర్హేతుకకృపచే నీ పదపల్లవములయొక్క సన్నిధికి చేర్చికొనుము.

లక్ష్మీదేవిని దయాస్వరూపిణిగను, గోదాదేవిని క్షమాస్వరూపిణిగను చెప్పుదురు.

"గుణకణికా-95" అను శ్లోకము ప్రారంభించుకుని ఈ శ్లోకమువరకు స్వనైచ్యానుసంధానముచేసి —"అట్టి తమను రక్షించుటకు గోదాదేవియొక్క-క్షమయే శరణ్యము అను శరణాగతితో కవిగారు తమ స్తోత్రమును ముగించుచున్నారు.

శ్రీపరాశరభట్టర్ కూడ - తమ శ్రీగుణరత్నకోశమును ముగించుచు "శ్రీరంగే శరదశ్శతం" అను ఆఖరి శ్లోకమున—

"త్వమంబా పితా, సర్వం చ త్వమసి,
త్వమేవ భవ నః, స్వీకుర్వకస్మాత్ కృపామ్."

(నీవే తల్లివి- నీవే తండ్రివి- అన్నియు నీవే- కావున నీ నిర్హేతుకమైన దయను నాయందు చూపుము) అని లక్ష్మీదేవిని ప్రార్థించియున్నారు. ఉపజాతి-వృత్తము.

ఫలశ్రుతిః

మోచారసాలమధుదుగ్ధరసాతిశాయి
గోదా స్తవం కృతమిహాప్పలదేశికేన,
మౌద్గల్యవంశకలశాబ్ధిసుధాకరేణ
లోకాః పఠంతి యది ముక్తభవా భవన్తి. 109

మౌద్గల్యవంశ మనెడి పాలసముద్రమునకు చంద్రుడైన అప్పలదేశికుని చేత రచింపబడినదియు, అరటిపండు, తియ్యమామిడిపండు, తేనె, పాలు, వీటి రుచిని అతిశయించిన రుచికలిగినట్టిదియు, అయిన ఈ గోదా స్తవమును ఇహలోకమున చదివిన జనులు — సంసారబంధమునుండి వెంటనే ముక్తినీ పొందెదరు. వసంతతిలకా-వృత్తము.

శ్రీగోదా స్తవము, సౌరభవ్యాఖ్య-

సమాప్తము.

అండాళ్ తిరువడిగళే శరణమ్

శ్రీః

శ్రీ హయగ్రీవాయ నమః
శ్రీమతే రంగనాథాయ నమః
శ్రీమత్యై గోదాదేవ్యై నమః
శ్రీమతే రామానుజాయ నమః
అస్మద్గురుభ్యో నమః

శ్రీ

# గోదాస్తోత్రమ్

ఉ.వే. శ్రీమాన్ నల్లాన్ చక్రవర్తుల సంపత్కుమారజగన్నాథ
తిరువేంకటాచార్యులు

(ఉ.వే. శ్రీమాన్ నల్లాన్ చక్రవర్తుల కృష్ణమాచార్యులు AIR విజయవాడ
వారి పితృపాదులు)
గారిచే రచింపబడినది.

భావములు :

**K. V. R. Narasimhacharyulu**
China Nindra Kolanu,
W. Godavari Dist. 534 408.

విశేష సూచనలు :
ఉ.వే. శ్రీమాన్ ఎన్. సి.హెచ్. కృష్ణమాచార్యులుగారు
విశ్రాంతవాయులీనవిద్వాంసులు
ఆకాశవాణి, విజయవాడ

ప్రచురణ :
శ్రీ గోదా గ్రంథమాల
మునునూరు, కృష్ణాజిల్లా.

# గోదాస్తోత్రమ్

శ్రీవిష్ణుచిత్త తనయా వినయార్జవాది-
భూషావిశేష సమలంకృత చిత్తవృత్తిః,
స్వప్నేఽప్యవిస్మృత ముకుందపదానురాగా
దద్యాన్మమాఖిలషితం శ్రితకల్పవల్లీ. 1

ఆశ్రితకల్పలతయైనట్టిదియు, వినయము-ఆర్జవము, మొదలైన గుణములే అలంకారములుగా అలంకరింపబడిన చిత్తవృత్తి కలిగినట్టిదియు, స్వప్నములో కూడ ముకుందపదారవిందములను వదలనట్టిదియు, శ్రీవిష్ణుచిత్తుల కుమార్తెయైనట్టియు, అయిన, శ్రీగోదాదేవి నాయొక్క అభిలషితమును ఇచ్చుగాక. (నా కోర్కెను నెరవేర్చి- నాకు మోక్షమును ప్రసాదించును గాక.)

సంపత్త్యా భుజయోర్వినిర్జితబిసా రామానుజార్యస్వసా
దివ్యానాం దశసూరిణాం ప్రియసుతా దీవ్యద్దయాసంభృతా,
సౌందర్యాదిగుణాన్వితాఽఖిలహితా విద్వద్గణైస్సేవితా
ఊరుభ్యాం పరిభూతవారణబుసా గోదా జయత్వత్ర సా. 2

తామరతూడును తిరస్కరించిన భుజసౌకుమార్యము కలిగినట్టియు, శ్రీరామానుజుల సోదరియైనట్టియు, పదిమంది ఆళ్వారులకు సుతప్రాయయైనట్టియు, దయతో కూడియున్నట్టియు, సౌందర్యము-సౌకుమార్యము మొదలగు గుణములతో కూడినట్టియు, అందరకు హితురాలైనట్టియు, విద్వాంసులచేత సేవింపబడుచున్నట్టియు, ఊరుసౌందర్యముచేత జయింపబడిన అరటిస్తంభములు కలిగినట్టియు, ఆ గోదాదేవి ఇచట సర్వోత్కర్షగా ఉండు గాక—

పరీక్ష్య యద్వత్ శబరీ ఫలానాం
రుచిం దదౌ తాని రఘూత్తమాయ,
తథానుభూయ స్వయమాత్మభర్త్రే
గోదార్పయామాస సుపుష్పమాలాః. 3

శబరి ఫలములయొక్క రుచిని పరీక్షించి ఏవిధముగా శ్రీరామునకొసగి నదో, అట్లే శ్రీగోదాదేవికూడ ముందుగా తాను అనుభవించిన పుష్పమాలను తన విభునకు ఒసంగినది— (అర్పించినది)—

నిలింపానాం ముఖ్యో హరిరితి వినిశ్చిత్య మునయో
యథా భక్త్యుద్రేకా త్తమిహ హృది నిక్షిప్య న జహుః
తథా పుణ్యక్షేత్రే ష్వతి శయితమాలోచ్య బహుధా
ఉవాస శ్రీరంగే తదధిపతిమాశ్రిత్య తరసా. 4

శ్రీమన్నారాయణుడే దేవతలలో ముఖ్యుడని నిశ్చయించి ఆతనియందలి భక్త్యతిశయమువలన మునులు ఏ విధముగా ఆతనిని హృదయముననే ఉంచికొని వదలలేదో, అట్లే శ్రీరంగమును పుణ్యక్షేత్రములలో ముఖ్యమైన దానినిగా భావించి (తలచి) శ్రీరంగాధిపతియైన ఆ శ్రీరంగనాథునే ఆశ్రయించి శ్రీగోదా దేవి ఆయనను వదలక అచటనే నివసించెను.

లోకాస్సర్వే ఽప్యమరవశగా స్తే వశాశ్చక్రపాణేః
స ప్రాప స్వాశ్రితజనవశం తే చ దివ్యస్థలేషు,
శ్రీరంగే తాన్యపిసమభవన్ భాగశ స్తస్యనాథో
లగ్నో గోదాస్రజి తదుపభుక్తోజ్ఝితాయాం కథం తత్. 5

లోకములన్నియు దేవతల వశములు. ఆ దేవతలు శ్రీమన్నారాయణునకు వశులు. ఆతడు ఆశ్రితులకు వశుడు. (భక్తపరాధీనుడు)- ఆ ఆశ్రితులుకూడ దివ్యస్థలములకు వశులైయున్నవారలు. [ఆళ్వారులు]- ఆ దివ్యస్థలములన్నియు శ్రీరంగమున వశమువై (అంతర్భవించి)- కలవు. ఆ శ్రీరంగమునకు నాథుడు గోదాదేవి తా ననుభవించి సమర్పించిన పుష్పమాలలకు వశుడైనాడు. ఇదియే అత్యంతాశ్చర్యకరమైన విషయము.

"దైవాధీనం జగత్సర్వం" అను ప్రక్రియలో గోదానుభూత పుష్పమాలి కలు సర్వోత్కృష్టములు" అని సారాంశము,

అవలంబ్య చ గోపికానుకారం
  వ్రతమాస్థాయ హరే రనుగ్రహార్థమ్,
ఉపదిశ్య నిజాశయం జగత్యై
  మనుజానుద్ధృత వత్య సౌ భవార్తాన్. 6

గోపికాభావమును అవలంబించి, శ్రీమన్నారాయణుని అనుగ్రహముకొరకై వ్రతమాచరించి, తనయొక్క ఆశయమును లోకమునకు ఉపదేశించి, సంసార దుఃఖపీడితులైన మనుజులను ఈ గోదాదేవి ఉద్ధరించినది.

తవ వచాంసి మణీన్ గణయన్తు నో
తవ మనో న వరం స్పృహయత్వపి,
కిముపలబ్ధమిహాస్య జనస్య భో!
జనని! తే హృది వత్సలతా న చేత్ ? 7

జననీ! నీయొక్క వాక్కులు మణులను లెక్కచేయకుండుగాక. (మణుల కన్న గొప్పవి) -నీయొక్క మనస్సును శ్రీరంగనాథునితప్ప మరొకరిని కోర కుందనిమ్ము. నీ హృదయమునందు వాత్సల్యమే లేకపోయినచో ఈ జనులచేత ఏమి పొందబడినది? (నీ వాత్సల్యమే చేతనులకు ఉద్ధారకము.)

తపః కీదృగాఖ్యా హి తే తాతపాదే?
తులస్యాలవాలస్య కిం పావనత్వమ్ ?
కుతో జన్మ తే ప్రాప్త మేతస్య దాస్యా-
స్త్వయా కల్పనేఽప్యస్తి కిం మే న తావత్ ? 8

అమ్మా! నీవు జన్మించుటకు తులసివనము, నిన్ను పెంచిపెద్దచేయుటకు శ్రీభట్టనాథులు ఏమి తపస్సుచేసిరో చెప్పుము తల్లీ! భట్టనాథులు తులసియు నీ జన్మకు కారణ మెట్లయిరి? అట్లే నీ వేదేని కల్పింపదలచినచో నా కా మాత్రము ఉండదా?

(నన్ను నీ భక్తునిగా గ్రహింపు మని - భావము).

న కేవలము పాశ్రితా వ్రజనితంబినీభూమికా
త్వయోపనిషదామపి, వ్రతమపేక్ష్య సా స్వీకృతా,
ఇయం తు పరమార్థవిజ్ఞ మనోగతార్థాన్ బహూన్
నివేద్య కలికల్మషాపహరణం విధాతుం ధృతా 9

అమ్మా! నీచేత కేవలము గోపికావేషము మాత్రమే స్వీకరింపబడలేదు. ఉపనిషత్తులయొక్క వేషముకూడ స్వీకరింపబడినది. గోపికావేషము వ్రతము నపేక్షించి స్వీకరింపబడినది. ఈ ఉపనిషత్తులవేషము పరమార్థమును తెలిసినవారి (పండితుల)యొక్క మనోగతములయిన అనేకార్థములను జనులకు తెలిపి కలి కల్మషమును పోగొట్టుటకే నీచేత ధరించబడినది.

శ్రుతిశతశిరస్సిద్ధమయిన పారార్థ్యమును అధ్యయనము చేయించినది కావున- ఈమె ఉపనిషత్ భూమికను ధరించినది— అని ఇచట విశేషము.

రమామనోహరస్య రంగనాయకస్య యన్మనః
త్వయాహృతం తదేవదేవి! కిం న్వశక్యమస్తి తే?
తదేవకారణం కిమస్య తే గుణాభివర్ణనే
పటుత్వమర్పితం త్వయా న చేదిదం కథం భవేత్? 10

అమ్మా! లక్ష్మీవల్లభుడైన శ్రీరంగనాథునియొక్క మనస్సునే హరించిన నీకు అశక్యమైనది ఏది?

ఈ నీ గుణాభివర్ణనలో నా సామర్థ్యమునకు కూడ నీవే కారణము. నీ దయలేనిదే నా కవిత్వమే లేదు.

బహుషు జనిషు శ్రీర్భర్తారం యథానుససార సా
తదిహ భవతీ తస్య క్షేత్రేష్వభూదనపాయినీ,
కిమభిలషితం తస్యాస్తే చేతి చింతయతః స్ఫుటం
హృదయరసమధ్యస్థం దేవం ప్రసాదయితుం బలాత్. 11

శ్రీమన్నారాయణునియొక్క అన్ని జన్మలయందును లక్ష్మీదేవి ఆయనను అనుసరించినది. అట్లే నీవుకూడ ఈ లోకమున అయన ఉన్న దివ్యక్షేత్రములలో ఆయనను విడువనిదానివైతివి.

అట్లు అనుసరించుటలో మీ ఇరువురి అభిలాష ఏమిటి? అని ఆలోచించి నచో నాకిట్లు తోచినది. మీఇద్దరు (శ్రీగోదాదేవులు) కరుణా క్షమాస్వరూపిణులై నిగ్రహానుగ్రహములను ఉభయరసవద్యస్తుడైన దేవదేవుని బలవంతముగా చేతనులయందు అనుగ్రహయుక్తునిగా చేయుటకే-అని.

స్వామికి "న క్షమామి వసుంధరే" అనునిగ్రహము, దానితో అనుగ్రహము రెండును కలవు. ఒకప్పుడు చేతనులయందు నిగ్రహపు పాలు ఎక్కువైనపుడు శ్రీగోదాదేవు లిద్దరును కలిసి కరుణా క్షమా స్వరూపిణులై స్వామిచేత బలవంతముగా చేతనుని అనుగ్రహింపచేయుదురు.

చూ. వేదాంతదేశికుల గోదాస్తుతి. శ్లో. 24.

స్వామియొక్క ఉభయరసములు నిగ్రహానుగ్రహములే.

తవ శిరసి ధృతా స్రక్ భూషయామాస కంఠం
కమితురితి తదేతత్ నాద్భుతం నాభినంద్యమ్,
అపి తు తవ పదాబ్జే లగ్నముద్ధృత్య దేవో
యది వహతి నిజాంకే మాం తదేవ ప్రశస్తమ్. 12

అమ్మా! గోదా! నీయొక్క శిరస్సున ధరించిన మాల శ్రీరంగనాథుని కంఠమును అలంకరించెననుట- అది అద్భుతమూ- అభినందించవలసిన విషయమూ- కూడ కాదు.

కాని నీ పదాబ్జములయందు లగ్నమైన నన్నుద్ధరించి శ్రీరంగనాథుడు తన అంకమునందు చేర్చికొన్నచో అదియే అద్భుతమూ- అభినంద్యమూ- కూడ- అగును.

ఇచట ఆమెయొక్క ఉత్తమాంగమున (శిరస్సున) ఉన్న మాలిక క్రిందకు దిగి స్వామియొక్క కంఠమునలంకరించినది. అది గొప్ప ఎట్లగును? కాదు కదా?

కాని ఆమె పాదములయందు (అధమాంగమునందు) లగ్నమైన చేతనుడైన కవిగారిని- స్వామి- ప్రేమతో ఉద్ధరించి తన అంకమున చేర్చుకొనుటయే

గొప్ప. పైనున్న వస్తువు క్రిందకు దిగుట అద్భుతము- అభినంద్యమూ- కాదు. ఇచట శిరసున ధరించినపూల కంఠము వరకు క్రిందకు దిగుట గొప్పకాదు. కాని క్రిందనున్న వస్తువు పైకి వెళ్ళుటగొప్పతనమునకు నిదర్శనము కావున ఆమె పాదములయందు లగ్నమైన జీవుని, చేతనుని (కవిగారిని), పైకి తీసికొని అంక మున చేర్చికొనుటయే అద్భుతము- అభినంద్యమూ- అగును అని ఇచట కవి గారి అభిప్రాయము.

అట్టడుగుననున్న చేతనుడు ఉద్ధరింపబడుటయే ఇచట గొప్పతనమునకు కారణము.

ఆదిమేవటచ్ఛదాధిశాయిసేవనం కృతం
మధ్యమే చ నందగోపనందనస్సమాశ్రితః,
అంతిమే చ రంగరాడ్వివాహకౌతుకం దధౌ
ఏవమీశితుః బహుస్వరూపతా నిరూపితా. 13

అమ్మా! నీచే మొదట వటపత్రశాయి సేవ చేయబడినది. మధ్యలో శ్రీకృష్ణుడు ఆశ్రయింపబడినాడు. చివరలో శ్రీరంగపతి వివాహకంకణమును ధరించినాడు. ఈ విధముగా నీచేత శ్రీమన్నారాయణునియొక్క "బహు స్వరూపత" నిరూపించబడినది.

"గోదాదేవి శ్రియఃపతియొక్క స్వరూపనిరూపకురాలు" అను పెద్దల నుడి ఈ కవిగారిచే ఇట్లు వర్ణింపబడినది.

స్త్రీప్రాయం విశ్వమేతత్ పురుష ఇహ హరిర్నాన్య ఇత్యేవ పూర్వే
సర్వే నిశ్చిత్య మత్వా భగవదనుగ్రహప్రాప్తికాలే సతీత్వమ్,
స్వస్మిన్నారోప్య తృప్తా ఇవ, తదఖిలమప్యాత్మబుద్ధ్యా విచార్య
భూత్వా స్త్రీరేవ గోదా సమభవదధునా తాంప్రపన్నోఽస్మి దేవీమ్. 14

పూర్వాచార్యులు శఠారి మొదలగువారు "ఈ ప్రపంచమంతయు స్త్రీప్రాయము-హరి ఒక్కడే పురుషుడు" అని భావించి అతనిని పొందుటకు

తమయందు స్త్రీత్వమును ఆరోపించుకొని సేవించిరి. అదియంతయు మనమున నిడికొని శ్రీగోదాదేవి తాను సహజముగ స్త్రీత్వమునే పొంది శ్రీమన్నారాయణుని సేవించి ఆనందించినది. అట్టి గోదాదేవిని శరణుపొందెదను.

గర్వోద్రిక్త ఇహాస్మి భో ! జనని ! మే మాతా హి గోదా పితా
రంగేశోఽపి చ, భట్టనాథమునిరాణ్మాతామహో రాజతే,
మాతామహ్యతిపావనీ తులసికా, రామానుజో మాతులః
సర్వం చైతదవేక్ష్య సంసృతిభయం నాస్త్యేవ నాస్త్యేవ మే. 15

అమ్మా ! "నాతల్లి గోదాదేవి. తండ్రి శ్రీరంగనాథుడు. విష్ణుచిత్తముని పుంగవులు మాతామహులు, అతి పవిత్రమైన తులసి మాతామహి. భగవద్రామానుజులు మేనమామ" అని గర్వపడుచున్నాను. ఇవి యన్నియు తలచి "నాకు సంసారభయమే లేదు- లేదు" అని కూడ నేను గర్వపడుచున్నాను.

కథమన్యదాభిగమనం
విముఖానప్యభిముఖీకరోతి తే వాక్,
ఏవం లబ్ధవ్యం కిం ?
మాదృగ్జనరక్షణం వినా మాతః ! 16

అమ్మా ! నీయొక్క వాక్కు విముఖులను కూడ అభిముఖులను చేయుచున్నది. (ఇక వేరుదైవమును ఆశ్రయించుట ఎట్లు జరుగును ?)

నీకు కూడ మా బోంట్లను రక్షించుటవలన వచ్చు కీర్తికంటె వేరే పొంద తగిన దేమున్నది ?

మేము నిన్నే శరణు పొందవలయును.
నీవు మమ్మొలనే రక్షించవలయును.

బాంధవ్యమభ్యేత్య యథాకథంచిత్
త్వత్తః కృతార్థాః బహవో హి గోదే !
ఏకోఽకృతార్థః కిమహం భవేయం
ఏవం యది హ్రీః కిల తే చ మే చ. 17

అమ్మా! గోదా! ఏదో విధముగా (భక్తితో) నీతో బాంధవ్యమును పొంది లోకములో చాలమంది కృతార్థులైరి—నేనొక్కడనే కృతార్థుడను కాలేనో? కాకున్నచో ఇది నీకును నాకును కూడ సిగ్గుచేటు.

స్వోపభుక్తమాలికాప్రదానతః కియత్ ఫలమ్
నోపభుక్త ఏవ దేవతాంతరేణ కేనచిత్,
ఈదృశం సమర్పయాద్య మాం విభోః పదాబ్జయోః
ఏవమీప్సితం మమాస్తు తే మహత్ఫలం భవేత్. 18

అమ్మా! నీ వనుభవించిన మాలికలను రంగపతికి ఇచ్చుటచేత నీ కేమి ఫలము? (ఏమిగొప్ప?). నేను ఏ దేవతాంతరముచేత అనుభవింపబడలేదు. (నిన్ను తప్ప మరొకరిని ఆశ్రయించలేదు నేను) –ఇట్టి నన్ను శ్రీరంగనాథుని పదాబ్జములయందు సమర్పించుము. ఈ విధముగా నా కోరిక నెరవేరును. నీకును గొప్ప పుణ్యము లభించును.

భగవంతునకు సాధారణముగా ఉపభుక్తముకాని వస్తువు నర్పించుట పుణ్యము కదా, కావున గోదాదేవి తాను అనుభవించి స్వామికి అర్పించిన మాలల కంటె- శ్రీరంగనాథుని పదాబ్జములయందు ఇంతవరకు ఏ దేవతాంతరము చేతను అనుభవింపబడని ఈ భక్తుని సమర్పించుట గొప్ప పుణ్యము– అని ఇచట కవిగారి అభిప్రాయము - అవ్యభిచారభక్తి ఇట వర్ణితము.

రంగపురరాణ్మహిషి! భట్టపతిపుత్రి!
శ్రీసఖి! జగజ్జనని! పంకరుహనేత్రి!
వాగమృతనిర్ఝరిణి! భో రుచిరగాథే
నిత్యభగవత్సుగుణకీర్తనసనాథే 19

శ్రీరంగనాథుని పట్టమహిషీ! విష్ణుచిత్తుల పుత్రికాదగ్నమా! లక్ష్మీదేవికి సఖివైనదానా! జగన్మాతా! పద్మములవంటి నేత్రములు కలదానా? వాక్కు అనే అమృతప్రవాహము కలదానా! సురుచిరసుందరగాథ (తిరుప్పావు) కలదానా! నిత్యము భగవత్ సుగుణములనే కీర్తించుదానా!

(నన్ననుగ్రహింపుము)- లేదా (20వ శ్లోకముతో అన్వయము)

తవ ముఖశశివీక్షణేన భర్తుః
వికసనమృచ్ఛతి నాక్షిపద్మయుగ్మమ్,
అఘటనఘటనాసమర్థతేయం
తవ, కిము, తే, కమితుశ్చ, కిం ? న జానే ? 20

అమ్మా! నీయొక్క ముఖచంద్రుని చూచుటవలన శ్రీరంగనాథుని నేత్రములనెడి పద్మములు ముడుచుకొనుటలేదు. ఈ అఘటితఘటనాసామర్థ్యము నీదా ? శ్రీరంగనాథునిదా? తెలిసికొనలేకున్నాను.

లోకములో చంద్రుని చూచిన, పద్మములు ముడుచుకొనును. కాని ఇచట గోదాదేవియొక్క ముఖచంద్రుని చూచిన శ్రీరంగనాథుని అక్షిపద్మయుగ్మము ముడుచుకొనకపోగా వికసించుచున్నట్లు వర్ణింపబడినది. అదియే అఘటితఘటనా సామర్థ్యముగా కవియొక్క వర్ణన.

ముఖమును చంద్రునితోను, నేత్రములను పద్మములతోను పోల్చుట కవిసమయప్రసిద్ధము. గోదాదేవియొక్క ముఖమును చూచినతో శ్రీరంగనాథునకు పరమానందము కలుగుచున్నదని సారాంశము.

శ్రీమన్నారాయణుని పుండరీకాక్షుడు (పద్మములవంటి నేత్రములుకలవాడు) అని అందురు.

బహవస్సుతాః కిల వసంతి తేఽంబికే!
వివిధేషు తేష్వవరజోఽహమస్మి మామ్,
అపటుం దురాచరణశీలమప్యముం
న జహాతుమర్హసి కదాపి దూరతః. 21

అమ్మా ! నీకు చాలమంది కుమారులు (భక్తులు) కలరు. వారిలో నేను చివరివాడను- అసమర్థుడను- దుర్మార్గుడను కూడ అయిన నన్ను - నీవు దూరముగా వదలుట తగదు.

సామాన్యముగా నైచ్యానుసంధానముతోపాటు—
"త్వద్భృత్యభృత్య పరిచారకభృత్యభృత్య
భృత్యస్య భృత్య ఇతి మాం స్మర లోకనాథ"

(నీ భృత్యులలో చివరివానిగా నన్ను స్మరించుము) అని శ్రీకులశేఖరులు చెప్పిన విషయముకూడ ఇందు చెప్పబడినది.

పితా శ్రీభట్టేశో యదపి జననీ చాపి తులసీ
యతిశ్రేష్ఠో భ్రాతేత్యఖిలమభిమానేన కిల తే,
స్వయం ప్రాదుర్భావా త్తవ కిము నిసర్గోత్థమితి చేత్
శ్రుణుష్వైతత్— దాసోఽహమితి— స చ రంగీ పతిరితి. 22

అమ్మా! "నీయొక్క తండ్రి విష్ణుచిత్తులవారు- తల్లి తులసిమాత- రామానుజులు సోదరులు-" అనెడివన్నియు స్వయం ఉత్పన్నవైన (అయోనిజవైన)- నీవు అభిమానించి కల్పించుటచేతనే కదా- ఇవి స్వతస్సిద్ధములైనవా? కావు.

స్వతస్సిద్ధములైనవి ఏవందువా? వినుము. "నేను నీ దాసుడ ననునది- శ్రీరంగనాథుడు నీ భర్త అనునదియును___"

ఫలశ్రుతి

పఠనీయమిదం నిత్యం
గోదాస్తోత్రమనుత్తమమ్,
శ్రీమన్ నల్లాన్ చక్రవర్తి-
తిరువేంకటకర్తృకమ్.

శ్రీమన్నల్లాన్ చక్రవర్తుల తిరువేంకటాచార్య కృతమైన, గొప్పదైన, ఈ గోదాస్తోత్రము- నిత్యము అందరిచేత పఠించదగినది.

గోదాస్తోత్రమును—దాని భావవివరణమును కూడ ముగిసెను.

—:o:—

శ్రీమతే రంగనాథాయ నమః
శ్రీమత్యై గోదాదేవ్యై నమః

శ్రీమద్వేదాంత దేశికుల

# గోదాస్తుతి

ఉ. వే. శ్రీమాన్ కె. వి. రాఘవాచార్యులుగారు
(రిటైర్డు తెలుగు లెక్చరర్ - సిద్ధిపేట)
రచించిన పరిమళవ్యాఖ్యనుండి వారి అనుమతితో తీసుకొన్న
భావములతో (వారికి కృతజ్ఞతలతో)

వారి ప్రస్తుత విలాసము
శ్రీమాన్ కె. వి. రాఘవాచార్యులు గారు
ఇం. నం. 16-11-16/2d
శ్రీపురం కాలనీ, హైదరాబాదు-500 036.

ప్రచురణ
గోదాగ్రంథమాల
ముసునూరు, కృష్ణా జిల్లా.

శ్రీమద్వేదాన్తదేశికుల

# గోదా స్తుతి

శ్రీవిష్ణుచిత్తకులనందనకల్పవల్లీం
శ్రీరంగరాజహరిచందనయోగదృశ్యామ్,
సాక్షాత్ క్షమాం కరుణయా కమలామివాన్యాం
గోదామనన్యశరణశ్శరణం ప్రపద్యే. 1

శ్రీవిష్ణుచిత్తుని వంశ మనే నందనవన మందున్న కల్పలతిక, శ్రీరంగరాజనే హరిచందనతరువుతో నల్లుకోవడంచేత చూడసొంపైనదై, అపరలక్ష్మిలా దయామయియై, సాక్షాత్తుగా క్షమాస్వరూపిణియైన గోదాదేవిని, ఇతరులను రక్షకత్వం వేడనివాడనై ప్రపత్తి చేస్తున్నాను.

వైదేశికః శ్రుతిగిరామపి భూయసీనాం
వర్ణేషు మాతి మహిమా న హి మాదృశాం తే,
ఇత్థం విదన్తమపి మాం సహసైవ గోదే!
మౌనద్రుహో ముఖరయన్తి గుణాస్త్వదీయాః. 2

ఓ గోదాదేవి! అనేక వేదవాక్కులు కూడా చక్కగా పొగడజాలని నీ మహిమను, నావంటివాడు వర్ణింపజాలునా? చేతకాదనుకొని నేను నోరే తెరవలేదు. కానీ నీ సౌశీల్యసౌందర్యవాత్సల్యాది గుణాలే నా మౌనాన్ని భంగపరచి నిన్ను స్తుతింప చేస్తున్నవి.

త్వత్ప్రేయసః శ్రవణయోరమృతాయమానాం
తుల్యాం త్వదీయమణినూపురశింజితేన,
గోదే! త్వమేవ జనని! త్వదభిష్టవార్హాం
వాచం ప్రసన్నమధురాం మమ సంవిధేహి. 3

ఓ తల్లీ! గోదాదేవీ! నిన్ను స్తుతింపదగిన ప్రసన్నమైన మధురమైన భాషను నీవే నాకు ప్రసాదించుము. శబ్దార్థాలు మణులు తాపిన నీకాళ్ళ అందెల సవ్వడిని నరితూగాలి-నిన్ను పొగడే మాటలు నీ ప్రియునికి వీనుల విందుగా ఉండాలి-

కృష్ణాన్వయేన దధతీం యమునానుభావం
తీర్థైర్యథావదవగాహ్య సరస్వతీం తే,
గోదే! వికస్వరధియాం భవతీ కటాక్షాత్
వాచః స్ఫురంతి మకరందముచః కవీనామ్. 4

ఓ గోదాదేవీ! నీ సరస్వతి శ్రీకృష్ణునితో సంబంధం ఉన్న యమునానది అనుభవవైభవాన్ని కీర్తించింది. నీ రచనలను ఆచార్యులద్వారా సముచితంగా అవగాహనచేసికొని, వికసించే ప్రజ్ఞగల కవులకు, నీ కటాక్షంవల్ల మకరంద ధారలొలికే మాటలు స్ఫురిస్తాయి.

అస్మాదృశామపకృతౌ చిరదీక్షితానాం
అహ్నాయ దేవి! యదసౌ దయతే ముకుందః,
తన్నిశ్చితం నియమిత స్తవ మౌళిదామ్నా
తంత్రీనినాదమధురైశ్చ గిరాం నిగుంఫైః (ఫైః). 5

ముక్తి నిచ్చేవాడు ముకుందుడు. భగవంతునిపట్ల భక్తికలిగి లోకానికి మేలు చేసేవారికి ముక్తి లభిస్తుంది. కాని ఏండ్ల తరబడి సమాజానికి కీడుచేయటానికే అంకితమైన మాలాంటి కళంకితులను కూడ ముకుందుడు దయతో రక్షిస్తున్నాడంటే ఇందుకు కారణం నీవే అనక తప్పదు.

దేవీ! నీ కురులలో తురుముకొన్న తరువాత సమర్పించిన పూలమాలచే ముకుందుణ్ణి బంధించావు- కమ్మని గళం విప్పి తీయగా పాటలు పాడి ఆయన మనస్సునే వశపరచుకొన్నావు. కాబట్టి నీమాటలను బట్టి మాలాంటివారిని, ముకుందుడు, అనుగ్రహిస్తున్నాడనడం నిశ్చయం.

శోణాఽధరేఽపి కుచయోరపి తుంగభద్రా
వాచాం ప్రవాహవిభవేఽపి సరస్వతీ త్వమ్,
అప్రాకృతైరపి రసైర్విరజా స్వభావాత్
గోదాఽపి దేవి! కమితుర్నను నర్మదాఽసి. 6

దేవీ, నీ అధరమండలి అరుణిమతో నీవు శోణానదివి. ఎత్తైన భవ్యమైన కుచద్వయంవల్ల తుంగభద్రవు. గంభీరమైన వాగ్ధరిలో సరస్వతీనదివి. ప్రసన్నమైన దివ్యరసామృతంచే విరజానదివి. స్వభావంతో గోదవే అయినా నీకాంతునికి శృంగారచేష్టలతో నర్మదవు కదా!

వల్మీకతశ్శ్రవణతో వసుధాత్మనస్తే
జాతో బభూవ స మునిః కవిసార్వభౌమః,
గోదే! కిమద్భుతమిదం యదమీ స్వదన్తే
వక్త్రారవిందమకరందనిభాః ప్రబంధాః. 7

ఓ గోదా, నీవు భూదేవివే కదా. నీ చెవ్వే కదా పుట్ట-నీ చెవ్వునుంచి పుట్టిన మునియే కవిసార్వభౌముడయ్యాడు. ఇక నీ ముఖకమలం నుంచి స్రవించిన మకరందంలా నీ ప్రబంధాలు రుచిస్తున్నాయనడంలో ఆశ్చర్యమేముంది?

భోక్తుం తవ ప్రియతమం భవతీవగోదే!
భక్తిం నిజాం ప్రణయభావనయా గృణన్తః,
ఉచ్చావచైర్విరహసంగమజైరుదన్తైః
శృంగారయన్తి హృదయం గురవస్త్వదీయాః. 8

నీ గురువులు నీ ప్రియతముడైన భగవంతుణ్ణి నీవలె అనుభవించటం కోసం తమ భక్తిని ప్రేమగా మలచుకున్నారు. కాబట్టి ఎడబాసినప్పుడుగానీ కలిసినప్పుడుగానీ చిత్రవిచిత్రమైన అనేకప్రవృత్తులచే భాషనూ భావాన్ని అందంగా సింగారింపచేశారు.

మాతస్సముత్థితవతీమధివిష్ణుచిత్తం
విశ్వోపజీవ్యమమృతం వచసా దుహానామ్,
తాపచ్ఛిదం హిమరుచేరివ మూర్తిమన్యాం
సన్తః పయోధిదుహితుస్సహజాం విదుస్త్వామ్. 9

ఓ జననీ! విష్ణుచిత్తోద్భవమైన నీవు మాటలచేతనే లోకాలను జీవింపచేసే అమృతాన్ని వర్షిస్తావు. కాబట్టి విద్వాంసులు నిన్ను తాపాన్ని పోగొట్టే శీతాంశువైన చంద్రుని మారురూపంలా, క్షీరాబ్ధిపుత్రియైన లక్ష్మీదేవికి చెల్లెలుగా భావిస్తున్నారు.

తాతస్తు తే మధుభిదః స్తుతి లేశవశ్యాత్
కర్ణామృతైః స్తుతిశతైరనవాప్తపూర్వమ్,
త్వన్మౌలిగంధసుభగాముపహృత్య మాలాం
లేభే మహత్తరపదానుగుణం ప్రసాదమ్. 10

ఏ కొంచెము స్తుతిచేసినా ఎవరికిరిగి కటాక్షించేవాడు మధుసూదనుడు నీ తండ్రి వందలస్తోత్రాలను వీనులవిందుగా చేసినా మొదట పెద్దపేరు పొందలేదు. నీ నెత్తిలో పెట్టుకోవటంవల్ల కమ్మనితావి అబ్బిన అందాలపూలమాలను మాత్రం సర్వేశ్వరునికి సమర్పించి మంచిపేరు గడించాడు.

దిగ్దక్షిణాపి పరిపక్త్రిమ పుణ్యలభ్యాత్
సర్వోత్తరా భవతి దేవి! తవావతారాత్,
యత్రైవ రంగపతినా బహుమానపూర్వం
నిద్రాలునాపి నియతం నిహితాః కటాక్షాః. 11

ఓ దేవి! పండిన పుణ్యఫలమైన నీ ఆవిర్భావంవల్ల దక్షిణదిక్కు కూడా సర్వోత్తరంగా రాణిస్తున్నది. కాబట్టి నిద్రలో ఉన్నా శ్రీరంగనాథుని దయా వృక్కులు మారకుండా ఆ దక్షిణం దిక్కే సాదరంగా ప్రసరిస్తున్నాయి.

ప్రాయేణ దేవి! భవతీ వ్యపదేశయోగాత్
గోదావరీ జగదిదం పయసా పునీతే,
యస్యాం సమేత్య సమయేషు చిరం నివాసాత్
భాగీరథీప్రభృతయోఽపి భవన్తి పుణ్యాః. 12

ఓ గోదాదేవి! నీ పేరుతో వ్యవహరించటంవల్ల గోదావరి తన ప్రవాహ జలంలో జగత్తును పవిత్రం చేస్తున్నది. గంగ యమున కావేరి మొదలగు నదులు కూడ వర్షకాలాల్లో గోదావరితో కలిసి చిరకాలం ఉండటంవల్లనే పుణ్యనదు లవు తున్నవి.

నాగేశయస్సుతను! పక్షిరథః కథం తే
జాతః స్వయంవరపతిః పురుషః పురాణః?
నైవం విధాస్సముచితం ప్రణయం భవత్యా-
స్సందర్శయన్తి పరిహాసగిరస్సఖీనామ్. 13

"ఓ శోభనాంగీ! నీవు స్వయముగా వరించిన మగడు చాలా వృద్ధుడు, పాముమీద పడుకునేవాడూ - పక్షిమీద పయనించేవాడూ - నీ కెట్లు లభించినాడే?" అని చెలికత్తెలు పరిహసించే మాటలు- "నీ ప్రేమ సముచితమే" అని వెల్లడిస్తున్నాయి

త్వద్భుక్తమాల్యసురభీకృతచారుమౌళేః
కా వా భుజాంతరగతామపి వైజయన్తీమ్,
పత్యుస్తవేశ్వరి! మిథః ప్రతిఘాతలోలాం
బర్హాతపత్రరుచిమారచయన్తి భృంగాః. 14

ఓ రాణీ! నీవు అలంకరించుకుని సమర్పించిన మాలికలనే నీ భర్త శిరసావహించాడు ఆయన తలకు అందమూ సుగంధమూ హెచ్చింది. కొబట్టి తుమ్మెదలు ఆయన వక్షఃస్థలంలో శోభిస్తున్న వైజయంతిమాలనుంచి లేచి ముమ్మరంగా తలమీద తిరుగుతున్నాయి. ఆ దృశ్యం మయూరపింఛాలతో చేసిన ఛత్రశోభలాంటి శోభను కల్పిస్తున్నది.

ఆమోదవత్యపి సదా హృదయంగమాపి
రాగాన్వితాపి లలితాపి గుణోత్తరాపి,
మౌలిస్రజా తవ ముకున్దకిరీటభాజా
గోదే! భవత్యధరితా ఖలు వైజయన్తీ. 15

ఓ గోదాదేవీ! మంచిదారంతో సువాసనగల రంగు రంగుల పూలను లలితంగా చేర్చి కూర్చబడిన వైజయంతిమాల, ముకుందుని వక్షఃస్థలంలో నిత్యమూ శోభించేది- అయినా ముకుందుని మకుటాన్ని చేరిన నీ శిరస్స్రజము వైజయన్తిస్థాయిని అధః కరించినది కదా!

"లేదా"

వైజయన్తి నిత్యసంతోషిణి- అనురాగిణి- సుకుమారి- లావణ్యవతి- శీలవతి- కూడా- ముకుందుని గుండెను హత్తుకుని ఉండేది- ఉత్తమురాలే అయినా ముకుందుడు నెత్తికెక్కించుకున్న నీ శిరోమాలిక వైజయంతి గౌరవాన్ని కించపరిచిందికదా ___

త్వన్మౌళిదామని విభోశ్శిరసా గృహీతే
స్వచ్ఛన్దకల్పితసపీతిరసప్రమోదాః,
మంజుస్వనా మధులిహో విదధుః స్వయం తే
స్వాయంవరం కమపి మంగళతూర్యఘోషమ్. 16

దేవీ ! నీశిరోమాలికను శ్రీరంగనాథుడు తలమీద ధరించే సమయంలో ఇంపుగా మ్రోగే తుమ్మెదలు. ఇష్టమున్నంత కల్పించిన పూదేనెను సముదాయంగా త్రాగి తృప్తి చెందాయి. కాబట్టి నీస్వయం వరానికి యోగ్యమైన మంగళ వాద్యధ్వనిని తమంతతామే చేశాయి

విశ్వాయమానరజసా కమలేన నాభౌ
వక్షఃస్థలే చ కమలా స్తనచందనేన,
ఆమోదితోఽపి నిగమైః విభురంఘ్రియుగ్మే
ధత్తే నతేన శిరసా తవ మౌళిమాలామ్. 17

విశ్వరచనచేసే పరాగమున్న తామరపూవుతో నాభి, శ్రీదేవి స్తన చందనం వల్ల వక్షః స్థలమూ, వేదాలవల్ల పాదాలూ పరిమళిస్తున్నాయి. అయినా విశ్వపతి నీవు తలలో ధరించుకుని ఇచ్చిన పూలమాలికలను తలవంచి వేసికొంటాడు.

చూడాపదేన పరిగృహ్య తవోత్తరీయం
మాలామపి త్వదలకైరధివాస్య దత్తామ్,
ప్రాయేణ రంగపతిరేష బిభర్తి గోదే !
సౌభాగ్యసంపదభిషేకమహాధికారమ్. 18

ఓ గోదా! ఈ రంగనాయకుడు నీవు వేసుకున్న అంగవస్త్రాన్ని, నీ అలల్లో తులికి అధికంగా పరిమళించే మాలను, నీవు సమర్పించగానే తన తలకు పట్టుకున్నాడు. దీనివల్ల బహుశః తాను సౌభాగ్యసంపదలతో పట్టంకట్టుకునే యోగ్యతయ్యాడు.

తుంగైరకృత్రిమగిరస్స్వయముత్తమాంగైః
యం సర్వగన్ధ ఇతి సాదరముద్వహన్తి,
ఆమోదమన్యమధిగచ్ఛతి మాలికాభిః
సోఽపి త్వదీయకుటిలాలకవాసితాభిః. 19

ఉపనిషత్తు లెవరిని సర్వగంధుడని వర్ణిస్తున్నవో, ఆ సర్వగంధుడు కూడా నీ రంగు రంగుల ముంగురులవల్ల పరిమళించే పూలహారాలచేత మరొక రకమైన సుగంధాన్ని- ఆనందాన్ని- పొందుతున్నాడు.

ధన్యే సమస్తజగతాం పితురుత్తమాంగే
త్వన్మౌలిమాల్యభరసంభరణేన భూయః,
ఇందీవరస్రజమివాదధతి త్వదీయా-
న్యాకేకరాణి బహుమానవిలోకితాని. 20

ఓదేవీ! నీతల పూలసంపదలను దాల్చుటంవల్ల జగత్పిత శిరము ధన్యమయింది.

ప్రేమతో ప్రసరింపచేసిన నీ క్రీగంటి- చూపులను నీలోత్పలమాలనువలె తలదాల్చాడు.

రంగేశ్వరస్య తవ చ ప్రణయానురోధాత్
అన్యోన్యమాల్యపరివృత్తిమభిష్టువన్తః,
వాచాలయన్తి వసుధే! రసికాస్త్రిలోకీమ్
న్యూనాధికత్వసమతావిషయైర్వివాదైః. 21

ఓదేవీ! రంగనాయకులూ నీవూ ప్రేమబద్ధులై పరస్పరం పూలమాలలను మార్చుకొంటుండగా రసికులు మెచ్చుకుంటున్నారు. మీ ఇద్దరి నేర్పులో ఎక్కువ తక్కువలను, సమానత్వాన్ని, పోల్చి, చర్చించేవారి మాటలతో ముల్లోకాలు మారుమ్రోగుతున్నాయి.

దూర్వాదళప్రతిమయా తవ దేహకాంత్యా
గోరోచనారుచిరయా చ తథేన్దిరాయాః,
ఆసీదనుజ్ఝితశిఖావళకంఠశోభం
మాంగళ్యదం ప్రణమతాం మధువైరిగాత్రమ్. 22

ఓ శోభనాంగి! గరికాకుతో సమానమైన పచ్చని నీ దేహకాంతిచేత, గోరోచనమువలె పసుపుపచ్చగా నున్న లక్ష్మీదేవియొక్క శరీరకాంతిచేతనూ, సొగిల

బడి దండాలుపెట్టి జీవులకు మేలుచేసే మధుసూదనుని (భగవంతుని) శరీరము విడదీయరాని మయూరకంఠశోభలా శోభిస్తున్నది.

అర్ఘ్యం సమర్ఘ్య నియమైర్నిగమప్రసూ్నైః
నాథం త్వయా కమలయా చ సమేయివాంసమ్,
మాతశ్చిరం నిరవశన్నిజమాధిరాజ్యం
మాన్యా మనుప్రభృతయోఽపి మహీక్షితస్తే. 23

తల్లీ! నీతోనూ లక్ష్మీదేవితోనూ కూడియుండి, వేదవిహిత నియమాలచే పూజింపదగిన శ్రీరంగనాథస్వామిని, లోకమాన్యులైన మనువు మొదలైన మహీపాలకులుకూడా సలక్షణంగా పూజించి, తమ సార్వభౌమాధిపత్యాన్ని చిరకాలం నిలబెట్టుకున్నారు.

ఆర్ద్రాపరాధిని జనేఽప్యభిరక్షణార్థం
రంగేశ్వరస్య రమయా వినివేద్యమానే,
పార్శ్వే పరత్ర భవతీ యది తస్య నాసీత్
ప్రాయేణ దేవి! వదనం పరివర్తితం స్యాత్. 24

ఓ దేవీ! శ్రీరంగేశ్వరుని కొక ప్రక్కన లక్ష్మీదేవి క్షమింపరాని నేరం చేసిన జనులనైనా రక్షించటానికి విన్నవిస్తూ ఉంటే, మరొక ప్రక్క నీవు లేకున్నచో బహుశః ఆయన మొగం ఆ ప్రక్కనే త్రిప్పిఉండేది.

గోదే! గుణైరపనయన్ ప్రణతాపరాధాన్
భ్రూక్షేప ఏవ తవ, భోగరసానుకూలః,
కర్మానుబంధిఫలదానరతస్య భర్తుః
స్వాతంత్ర్యదుర్వ్యసనమర్మభిదా నిదానమ్. 25

ఓ జననీ! ఆశ్రితులదోషాలను గుణాలచేత నివారించేదీ, కర్మానుసారంగా ఫలాన్ని ప్రసాదించే అనర్తకల స్వామి (పతి) యొక్క స్వాతంత్ర్యం దుర్వ్యసన మర్మాన్ని కనిపెట్టి భేదించటంవల్ల ఆనంద రసానుభూతికి అనుకూలించేదీ, ప్రధానంగా నీభ్రూవిలాసమేకదా!

రంగే తటిద్గుణవతో రమయైవ గోదే!
కృష్ణాంబుదస్య ఘటితాం కృపయా సువృష్ట్యా,
దౌర్గత్యదుర్విషవినాశసుధానదీం త్వాం
సన్తః ప్రపద్య శమయన్త్యచిరేణ తాపాన్. 26

ఓ గోదాదేవి! మెరుపువంటి లక్ష్మీదేవితో కూడిన నీలమేఘమువంటి శ్రీరంగనాథుని దయావృష్టిచేత శ్రీరంగమందు నీవు దుర్గతిని కలిగించే సంసార విషాన్ని హరించి అమృత స్రవంతివై వెలసితివి. సజ్జనులు నిన్నాశ్రయించి తమ పాపతాపాలను శమింపచేసికొంటారు.

జాతాపరాధమపి మామనుకంప్య గోదే!
గోప్త్రీ యది త్వమసి యుక్తమిదం భవత్యాః,
వాత్సల్యనిర్భరతయా జననీ కుమారం
స్తన్యేన వర్ధయతి దష్టపయోధరాఽపి. 27

ఓ తల్లీ! నేను నేరాలు చేసినవాడినే అయినా, నన్ను దయతో కాపాడటం నీకే తగునమ్మా! పసివాడు పాలు త్రాగుతూ పంటితో చంటిని నొక్కినా, కన్నప్రేమ జాలువారటంవల్ల తల్లి చనుపాలిచ్చి పెంచుతూనే ఉంటుంది కదా—

శతమఖమణినీలా చారుకహ్లారహస్తా
స్తనభరనమితాంగీ సాన్ద్రవాత్సల్యసిన్ధుః,
అలకవినిహితాభిః స్రగ్భిరాకృష్టనాథా
విలసతు హృది గోదా విష్ణుచిత్తాత్మజా నః. 28

ఇంద్రనీలమణివలె దేహకాంతికలిగి - చెంగలువ చేతితో ధరించి, స్తనభారంవల్ల వంగిన శరీరం కలిగి, అపారకృపాసముద్రయైనట్టి కురులయందు తురుముకొన్న విరుల సరములతో పతిని వశపరచుకొన్న - విష్ణుచిత్తుని పుత్రిక గోదానాయకి మన యెదలో వెలయుగాక —

ఇతి వికసితభక్తేరుత్థితాం వేంకటేశాత్
బహుగుణరమణీయాం వక్తి గోదాస్తుతిం యః,
స భవతి బహుమాన్యః శ్రీమతో రంగభర్తుః
చరణకమలసేవాం శాశ్వతీమభ్యుపేష్యన్. 29

అనేక గుణాలతో మనోహరమైన ఈ గోదాస్తుతిని పరమభక్తుడైన వేంకట నాథ కవి రచించాడు. ఈ స్తోత్రాన్ని చదివేవ్యక్తి ఐహికాముష్మికఫలాన్ని పొందుతాడు. లక్ష్మీ సహాయుడైన శ్రీరంగనాయకుల పాదపద్మముల సేవను ఎల్లకాలం చేయగలుగుతాడు.

(1) గోదాస్తుతియు, భావములును ముగిసెను.

(2) ఆండాళ్ తిరువడిగళే శరణమ్.

లక్ష్మీచరణలాక్షాంక
సాక్షాత్ శ్రీవత్సవక్షసే,
క్షేమంకరాయ సర్వేషాం
శ్రీరంగేశాయ మంగళమ్.

స్వోచ్ఛిష్టమాలికాబంధ
గంధబంధురజిష్ణవే,
విష్ణుచిత్తతనూజాయై
గోదాయై నిత్యమంగళమ్.

మాదృశాకించనత్రాణ-
బద్ధకంకణపాణయే,
విష్ణుచిత్తతనూజాయై
గోదాయై నిత్యమంగళమ్.

# శ్రీ గోదా అష్టోత్తరశత నామావళి

(ప్రతినామము మొదట 'ఓం' అనియు,
చివరన 'నమః' అనియు ఉచ్చరించుచుండవలెను)

| | | |
|---|---|---|
| ఓం | శ్రీరంగనాయక్యై | నమః |
| " | గోదాయై | |
| " | విష్ణుచిత్తాత్మజాయై | |
| " | సత్యై | |
| " | గోపీవేషధారిణ్యై | |
| " | దేవ్యై | |
| " | భూసుతాయై | |
| " | భోగశాలిన్యై | |
| " | తులసీకాననోద్భూతాయై | |
| " | శ్రియై | 10 |
| " | ధన్విపురవాసిన్యై | |
| " | భట్టనాథప్రియకర్యై | |
| " | శ్రీకృష్ణహితభోగిన్యై | |
| " | ఆముక్తమాల్యదాయై | |
| " | బాలాయై | |
| " | రంగనాథప్రియాయై | |
| " | పరాయై | |
| " | విశ్వంభరాయై | |
| " | కలాలాపాయై | |
| " | యతిరాజసహోదర్యై | 20 |
| " | శ్రీకృష్ణానురక్తాయై | |
| " | సుభగాయై | |
| " | సులభశ్రియై | |

ఓం సులక్షణాయై నమః
" లక్ష్మీప్రియసఖ్యై
" శ్యామాయై
" దయాంచితదృగంచలాయై
" ఫల్గున్యావిర్భావాయై
" రమ్యాయై
" ధనుర్మాసకృతవ్రతాయై 30
" చంపకాశోక పున్నాగ-
" మాలతీవిలసత్కచాయై
" ఆకార త్రయ సంపన్నాయై
" నారాయణసమాశ్రితాయై
" శ్రీమదష్టాక్షరీ మంత్రరాజ-
" స్థిత మనోరథాయై
" మోక్షప్రదాన నిపుణాయై
" మంత్రరత్నాధిదేవతాయై
" బ్రహ్మణ్యాయై
" లోకజనన్యై
" లీలామానుషరూపిణ్యై
" బ్రహ్మజ్ఞాయై 40
" అనుగ్రహాయై
" మాయాయై
" సచ్చిదానందవిగ్రహాయై
" మహాపతివ్రతాయై
" విష్ణుగుణకీర్తనలోలుపాయై
" ప్రపన్నార్తిహరాయై
" నిత్యాయై

ఓం వేదసౌధవిహారిణ్యై నమః
" శ్రీరంగనాథమాణిక్యమంజర్యై
" మంజుభాషిణ్యై 50

" సుగంధార్థగ్రంథకర్త్ర్యై
" రంగమంగళదీపికాయై
" ధ్వజవజ్రాంకుశాబ్జాంక-
మృదుపాదతలాంచితాయై
" తారకాకారనఖరాయై
" ప్రవాళమృదులాంగుళ్యై
" కూర్మోపమేయపాదోర్ధ్వభాగాయై
" శోభనపార్ష్ణికాయై
" వేదార్థభావవిదిత-
తత్త్వబోధాంఘ్రిపంకజాయై
" ఆనందబుద్బుదాకారసుగుల్ఫాయై
" పరమాయై 60

" అణుకాయై
" తేజఃశ్రియోజ్జ్వలధృత-
పాదాంగుళిసుభూషితాయై
" మీనకేతనతూణీర-
చారుజంఘావిరాజితాయై
" కకుదత్‌జానుయుగ్మాయై
" స్వర్ణరంభాభసక్థికాయై
" విశాలజఘనాయై
" పీనసుశ్రోణ్యై
" మణిమేఖలాయై

ఓం ఆనందసాగరావర్త- నమః
గంభీరాంభోజనాభికాయై
" భాస్వద్వళిత్రికాయై 70
" చారుజగత్పూర్ణమహోదర్యై
" నవవల్లీరోమరాజ్యై
" సుధాకుంభాయితస్తన్యై
" కల్పమాలానిభభుజాయై
" చంద్రఖండనఖాంచితాయై
" సుప్రవాళాంగుళీన్యస్త-
మహారత్నాంగుళీయకాయై
" నవారుణప్రవాళాభ
పాణిదేశసమంచితాయై
" కంబుకంఠ్యై
" సుచుబుకాయై
" బింబోష్ఠ్యై 80
" కుందదంతయుజే
" కారుణ్యరసనిష్యంది-
నేత్రద్వయసుశోభితాయై
ముక్తాశుచిస్మితాయై
" చారుచాంపేయనిభనాసికాయై
దర్పణాకార విపుల-
" కపోలద్వితయాంచితాయై
" అనంతార్క ప్రకాశోద్యత్-
మణితాటంకశోభితాయై
" కోటిసూర్యాగ్నిసంకాశ-
నానాభూషణ భూషితాయై

ఓం సుగంధవదనాయై నమః
" సుభ్రువే
" అర్ధచంద్రలలాటికాయై 90
" పూర్ణచంద్రాననాయై
" నీలకుటిలాలకశోభితాయై
" సౌందర్యసీమాయై
" విలసత్కస్తూరీతిలకోజ్జ్వలాయై
" ధగద్ధగాయమానోద్యత్-
మణిసీమంతభూషణాయై
" జ్వాజ్వల్యమాన సద్రత్న-
దివ్యచూడావతంసకాయై
" సూర్యార్ధచంద్రవిలసత్-
భూషణాంచిత వేణికాయై
" అత్యర్కానల తేజోఽధి-
మణికంచుకధారిణ్యై
" నిగన్నిగద్రత్నపుంజ-
ప్రాంత స్వర్ణనిచోళికాయై
" సద్రత్నాంచిత విద్యోత-
విద్యుత్పుంజాభశాటికాయై 100
" నానామణిగణాకీర్ణ-
హేమాంగద సుభూషితాయై
" కుంకుమాగరు కస్తూరీ-
దివ్యచందనచర్చితాయై
" స్వోచితౌజ్జ్వల్య వివిధ-
విచిత్రమణిహారిణ్యై
" అసంఖ్యేయ సుఖస్పర్శ-
సర్వాతిశయ భూషణాయై

ఓం మల్లికా పారిజాతాది-
దివ్యపుష్పస్రగంచితాయై
,, శ్రీరంగనిలయాయై
,, పూజ్యాయై
,, దివ్యదేశ సుశోభితాయై
శ్రీమహాగోదాదేవ్యై నమః 108

గమనిక :

64వ నామము
"కకుదబ్జానుయుగ్మాఢ్యా" అనియు
72వ నామము
"నవమల్లీరోమరాజిః" అనియు
అనుసృతముగావచ్చుచున్న పాఠములు.

కాని ఇందు ఇచ్చినవి ప్రముఖపండితులచే పరిష్కరింపబడిన పాఠములు.

64 ,, కకుదత్ జానుయుగ్మాఢ్యా" అనియు
72 ,, నవవల్లి రోమరాజిః" అనియున్న.

శ్రీగోదా అష్టోత్తరశత నామావళి సమాప్తము.

# శ్రీరంగనాథ అష్టోత్తర శతనామావళి

ఓమ్ రంగనాథాయ నమః
,, దేవేశాయ
,, రంగబ్రహ్మసంజ్ఞకాయ
,, శేషపర్యంకశయనాయ
,, శ్రీనివాసభుజాన్తరాయ
,, ఇంద్రనీలోత్పలశ్యామాయ
,, పుండరీకనిభేక్షణాయ
,, శ్రీవత్సలాంఛితాయ
,, శ్రీహారిణే
,, శ్రీవనమాలినే 10
,, హలాయుధాయ
,, పీతాంబరధరాయ
,, దేవాయ
,, నారాయణాయ
,, హరయే
,, శ్రీభూమినీళాసహితాయ
,, శ్రీమహావిష్ణవే
,, సనాతనాయ
,, సింహాసనస్థాయ
,, భగవతే 20
,, వాసుదేవప్రభావృతాయ
,, కన్దర్పకోటిలావణ్యాయ
,, శ్రీకస్తూరీ తిలకోజ్జ్వలాయ

ఓమ్ ... నమః

” శ్రీ శంకచక్రగదాపద్మ-
సులక్షిత చతుర్భుజాయ
” శ్రీమత్ సుందరజామాతృనాథాయ
” దేవశిఖామణయే
” రంగనాయకాయ
” లక్ష్మీవల్లభాయ
” తేజసాంసిధయే
” సర్వశర్మప్రదాయ 30
” ఈశాయ
” సామగానప్రియోత్సవాయ
” అమృతత్వప్రదాయ
” నిత్యాయ
” సర్వప్రభవే
” అరిందమాయ
” భద్రకుంకుమాలిప్తాయ
” మూర్తయే
” చిత్రరంజితాయ
” సర్వలక్షణ సంపన్నాయ 40
” శాంతాత్మనే
” తీర్థనాయకాయ
” రంగనాయకీశాయ
” యజ్ఞమూర్తయే
” హిరణ్మయాయ
” ప్రణవాకార సదనాయ
” ప్రణవార్థప్రకాశకాయ
” గోదాప్రాణేశ్వరాయ

ఓమ్ నమః

" కృష్ణాయ
" జగన్నాథాయ 50
" జయప్రదాయ
" నిచుళాపురవల్లీశాయ
" నిత్యమంగళదాయకాయ
" గన్ధస్తంభద్వయోల్లాస-
గాయత్రీరూపమంటపాయ
" భృత్యవర్గశరణ్యాయ
" బల, భద్ర, ప్రసాదాయ
" వేదశృంగవిమానస్థాయ
" వ్యాఘ్రాసురనిషూదనాయ
" గరుడానన్తసేనేశ-
గజవక్త్రాది సేవితాయ
" శంకరప్రియమాహాత్మ్యాయ 60
" శ్యామాయ
" శంతనువందితాయ
" పాంచరాత్రార్చితాయ
" నేత్రే
" భక్తనేత్రోత్సవప్రదాయ
" కలశాంబోధినిలయాయ
" కమలాసనపూజితాయ
" సనన్ద సన్ద సనక
సుత్రామామర సేవితాయ
" సత్యలోకపురావాసాయ
" చక్షుషే 70

ఓమ్ ... నమః

,, అష్టాక్షరాయనమః
,, అవ్యయాయ
,, ఇక్ష్వాకుపూజితాయ
,, అనంతాయ
,, వసిష్ఠాదిస్తుతాయ
,, అనఘాయ
,, రాఘవారాధితాయ
,, స్వామినే
,, రాజేన్ద్రాయ
,, రఘువన్దితాయ 80
,, విభీషణార్చితపదాయ
,, లంకారాజ్యవరప్రదాయ
,, కావేరీమధ్యనిలయాయ
,, కల్యాణపురవాస్తుకాయ
,, ధర్మవర్మాఖ్యచోళేన్ద్ర-
పూజితాయ
,, పుణ్యకీర్తనాయ
,, పురుషోత్తమకృతస్థానాయ
,, భూలోకజనభాగ్యదాయ
,, అజ్ఞానదమనజ్యోతిషే
,, అర్జునప్రియసారథయే 90
,, చంద్రపుష్కరిణీనాథాయ
,, చండాదిద్వారాపాలకాయ
,, కుముదాదిపరీవారాయ
,, పాండ్యసారూప్యదాయకాయ
,, సప్తావరణసంవీతసవనాయ

ఓమ్ నమః

" సురపోషకాయ
" నవనీతనవాహారాయ
" విహారిణే
" నారదస్తుతాయ
" రోహిణీ జన్మతారాయ 100
" కార్తికేయవరప్రదాయ
" రంగాధిపతయే
" శ్రీమతే
" శ్రీమద్రంగమహానిధయే
" శ్రీరంగవత్సలాయ
" శ్రీరంగపాలకాయ
" శ్రీరంగదేవోత్తమాయ
" శ్రీరంగసర్వస్వాయ 108

శ్రీరంగనాథ పరబ్రహ్మణే నమః

శ్రీరంగనాథార్పణమస్తు

గమనిక :

95 "సప్తావరణ సంహితాయ" అనియు

96 "సజ్జనాసుర పోషకాయ" అనియు పాఠాంతరము

శ్రీరంగనాథ అష్టోత్తరశతనామావళి సమాప్తము

# పాంచరాత్ర లక్ష్మీతంత్రమునందలి

# శ్రీ లక్ష్మీ అష్టోత్తరశత నామావళి

## శ్రీరస్తు

ప్రతి నామమునకు ముందు "ఓం" అనియు చివర "నమః" అనియు ఉచ్చరించవలెను.

ఓమ్ శ్రియై నమః
" లక్ష్మ్యై
" కమలాయై
" దేవ్యై
" మాయై
" పద్మాయై
" కమలాలయాయై
" పద్మే స్థితాయై
" పద్మవర్ణాయై
" పద్మిన్యై ౧౦
" మణిపంకజాయై
" పద్మప్రియాయై
" నిత్యపుష్టాయై
" ఉదారాయై
" పద్మమాలిన్యై
" హిరణ్యవర్ణాయై
" హరిణ్యై
" అర్ఘ్యాయై

| ఓమ్ | | నమః |
|---|---|---|
| ,, | చంద్రాయై | |
| ,, | హిరణ్మయ్యై | 20 |
| ,, | ఆదిత్యవర్ణాయై | |
| ,, | అశ్వపూర్వాయై | |
| ,, | హస్తినాదప్రబోధిన్యై | |
| ,, | రథమధ్యాయై | |
| ,, | దేవజుష్టాయై | |
| ,, | సువర్ణరజతస్రజాయై | |
| ,, | గంధద్వారాయై | |
| ,, | దురాధర్షాయై | |
| ,, | తర్పయన్త్యై | |
| ,, | కరీషిణ్యై | 30 |
| ,, | పింగళాయై | |
| ,, | సర్వభూతానామీశ్వర్యై | |
| ,, | హేమమాలిన్యై | |
| ,, | కాంసోస్మితాయై | |
| ,, | పుష్కరిణ్యై | |
| ,, | జ్వలన్త్యై | |
| ,, | అనపగామిన్యై | |
| ,, | సూర్యాయై | |
| ,, | సుపర్ణాయై | |
| ,, | మాత్రే | 40 |
| ,, | విష్ణుపత్న్యై | |
| ,, | హరిప్రియాయై | |
| ,, | అర్ద్రాయై | |
| ,, | యష్కరిణ్యై | |

ఓమ్ నమః

" గంగాయై
" వైష్ణవ్యై
" హరివల్లభాయై
" శ్రియణీయాయై
" హిరణ్యప్రాకారాయై
" నళినాలయాయై 50
" విశ్వప్రియాయై
" మహాదేవ్యై
" మహాలక్ష్మ్యై
" వరాయై
" రమాయై
" పద్మాలయాయై
" పద్మహస్తాయై
" పుష్ట్యై
" గంధర్వసేవితాయై
" అయానసహారిణ్యై ౬0
" దివ్యాయై
" శ్రీదేవ్యై
" చంద్రసోదర్యై
" వరారోహాయై
" భృగుసుతాయై
" లోకమాత్రే
" అమృతోద్భవాయై
" సింధుజాయై
" శార్ఙ్గిణ్యై
" సీతాయై
" ముకుందమహిష్యై ౭౦

| | | |
|---|---|---|
| ఓమ్ | | నమః |
| ,, | ఇందిరాయై | |
| ,, | విరంచిజనన్యై | |
| ,, | ధాత్ర్యై | |
| ,, | శాశ్వతాయై | |
| ,, | దేవపూజితాయై | |
| ,, | దుర్గాయై | |
| ,, | రోచన్యై | |
| ,, | గౌర్యై | |
| ,, | మాధవ్యై | 80 |
| ,, | అచ్యుతవల్లభాయై | |
| ,, | నారాయణ్యై | |
| ,, | రాజలక్ష్మ్యై | |
| ,, | మోహిన్యై | |
| ,, | సురసుందర్యై | |
| ,, | సురేశసేవ్యాయై | |
| ,, | సావిత్ర్యై | |
| ,, | సంపూర్ణాయుష్కర్యై | |
| ,, | సత్యై | |
| ,, | సర్వదుఃఖహరాయై | 90 |
| ,, | ఆరోగ్యకారిణ్యై | |
| ,, | సత్కళత్రికాయై | |
| ,, | సంపత్కర్యై | |
| ,, | జయిత్ర్యై | |
| ,, | సత్సంతాన ప్రదాయై | |
| ,, | ఇష్టదాయై | |

" విష్ణువక్షఃస్థలావాసాయై

" వారాహ్యై

" వారణార్చితాయై

" ధర్మజ్ఞాయై 100

" సత్యసంకల్పాయై

" సచ్చిదానందవిగ్రహాయై

" ధర్మదాయై

" ధనదాయై

" సర్వకామదాయై

" మోక్షదాయిన్యై

" సర్వశత్రుక్షయకర్త్ర్యై

" సర్వాభీష్టఫలప్రదాయై 108

శ్రీరంగనాయకీ అర్పణమస్తు

శ్రీలక్ష్మీ అష్టోత్తరశతనామావళి సంపూర్ణము

# శ్రీ లక్ష్మీనారాయణ
## అష్టోత్తరశతనామావళి

( ప్రతి నామమునకు మొదట 'ఓమ్' అనియు చివర 'నమః' అని ఉచ్చరించవలెను )

| | | |
|---|---|---|
| ఓం | శ్రియై | నమః |
| " | విష్ణవే | |
| " | కమలాయై | |
| " | శార్ఙ్గిణే | |
| " | లక్ష్మ్యై | |
| " | వైకుంఠనాయకాయ | |
| " | ఇందిరాయై | |
| " | పుండరీకాక్షాయ | |
| " | రమాయై | |
| " | గరుడవాహనాయ | 10 |
| " | భార్గవ్యై | |
| " | శేషపర్యంకాయ | |
| " | విశాలాక్ష్యై | |
| " | జనార్దనాయ | |
| " | స్వర్ణాంగ్యై | |
| " | వరదాయ | |
| " | దేవ్యై | |
| " | హరయే | |
| " | ఇందుముఖ్యై | |
| " | ప్రభవే | 20 |

ఓం సుందర్యై నమః
" నరకధ్వంసినే
" లోకమాత్రే
" మహాతపసే
" శక్తిప్రియాయై
" దానవారయే
" అంబికాయై
" మధుసూదనాయ
" వైష్ణవ్యై
" దేవకీపుత్రాయ 30
" రుక్మిణ్యై
" కేశిమర్దనాయ
" వరలక్ష్మ్యై
" జగన్నాథాయ
" కీరవాణ్యై
" హలాయుధాయ
" నిత్యాయై
" సత్యవ్రతాయ
" గౌర్యై
" శౌరయే 40
" కాంతాయై
" సురేశ్వరాయ
" నారాయణ్యై
" హృషీకేశాయ
" పద్మహస్తాయై
" త్రివిక్రమాయ
" మాధవ్యై

ఓం పద్మనాభాయ నమః
" స్వర్ణవర్ణాయై
" నిరీశ్వరాయ 50
" సత్యై
" పీతాంబరాయ
" శాంతాయై
" వనమాలినే
" క్షమాయై
" అనఘాయ
" జయప్రదాయై
" బలిధ్వంసినే
" వసుధాయై
" పురుషోత్తమాయ 60
" రాజ్యప్రదాయై
" అఖిలాధారాయ
" మాయాయై
" కంసవిదారణాయ
" మహేశ్వర్యై
" మహాదేవాయ
" పరమాయై
" పుణ్యవిగ్రహాయ
" రమాయై
" ముకుందాయ 70
" సుముఖ్యై
" ముచికుందవరప్రదాయ
" వేదవేద్యాయై
" అబ్ధిజామాత్రే
" సురూపాయై

| | | | |
|---|---|---|---|
| ఓం | అర్కేందులోచనాయ | నమః | |
| " | పుణ్యాంగనాయై | | |
| " | పుణ్యపాదాయ | | |
| " | పావన్యై | | |
| " | పుణ్యకీర్తనాయ | | 80 |
| " | విశ్వప్రియాయై | | |
| " | విశ్వనాథాయ | | |
| " | వాగ్రూపిణే | | |
| " | వాసవానుజాయ | | |
| " | సరస్వత్యై | | |
| " | స్వర్ణగర్భాయ | | |
| " | గాయత్ర్యై | | |
| " | గోపికాప్రియాయ | | |
| " | యజ్ఞరూపాయై | | |
| " | యజ్ఞభోక్త్రే | | 90 |
| " | భక్తాభీష్టప్రదాయై | | |
| " | గురవే | | |
| " | స్తోత్రప్రియాయై | | |
| " | స్తోత్రకారాయ | | |
| " | సుకుమార్యై | | |
| " | సుపర్ణగాయ | | |
| " | మానిన్యై | | |
| " | మందరధరాయ | | |
| " | సావిత్ర్యై | | |
| " | జన్మవర్జితాయ | | 100 |
| " | మంత్రగోప్త్ర్యై | | |
| " | మహేష్వాసాయ | | |
| " | యోగిన్యై | | |

" యోగివల్లభాయ
" జయప్రదాయై
" జయకరాయ
" రక్షిత్రే
" సర్వరక్షకాయ 108

శ్రీలక్ష్మీనారాయణ దివ్యదంపతిభ్యాం
నమో నమః

# శ్రీభూదేవి

## అష్టోత్తరశతనామావళి

(ప్రతి నామమునకు మొదట 'ఓమ్' అనియు చివర 'నమః' అనియు ఉచ్చరించవలెను )

| | | | |
|---|---|---|---|
| ఓమ్ | కమలాయై | నమః | |
| " | కమలావాసాయై | | |
| " | కంజనేత్రాయై | | |
| " | మత్యై | | |
| " | ధృత్యై | | |
| " | విశోకాయై | | |
| " | హారిణ్యై | | |
| " | పౌష్ట్యై | | |
| " | క్షోణ్యై | | |
| " | మహ్యై | | 10 |
| " | అతలాయై | | |
| " | నితలాయై | | |
| " | వితలాయై | | |
| " | సుతలాయై | | |
| " | రసాతలాయై | | |
| " | మహాతలాయై | | |
| " | తలరూపాయై | | |
| " | తలాతలాయై | | |
| " | భూమ్యై | | |
| " | భూతలరూపాయై | | 20 |
| " | లోకరూపాయై | | |

" ఉపసంహితాయై
" ప్రకృత్యై
" వికృత్యై
" విశ్వరూపాయై
" విశ్వనాదిన్యై
" ధరిత్ర్యై
" మహత్యై
" ధాత్ర్యై
" నదీరూపాయై 30
" సరస్వత్యై
" ఆత్మంభరాయై
" వర్ధిన్యై
" కాశ్యప్యై
" మహత్యై
" స్థిరాయై
" ధరాధరసమాధారాయై
" భువే
" ధరాధరరూపిణ్యై
" వసుంధరాయై 40
" వసుకరాయై
" వసుధాయై
" ధనవర్ధిన్యై
" ఫలరూపాయై
" మనోరూపిణ్యై
" బుద్ధిరూపిణ్యై
" చిత్తరూపిణ్యై
" అహంకారరూపిణ్యై

ఓం భూతపంచకరూపాయై నమః

" పృథ్వైశ్యై 50

" సాగరరూపిణ్యై

" అంభోధివర్తిన్యై

" సర్వాయై

" సర్వకామప్రదాయై

" పృథాయై

" కామాయై

" మనోహరాయై

" స్వధాయై

" సర్వమంగళకారిణ్యై

" శ్యామాంగ్యై 60

" సన్నిభాయై

" మహాపాతకవాహిన్యై

" ఉత్పలహస్తాయై

" పుండరీకవిలోచనాయై

" పుండరీకాక్షదయితాయై

" విశ్వంభరకులాయిన్యై

" హరేః ప్రియతమాయై

" వాసస్థలాయై

" అతికాన్తికాయై

" ఆదిమూర్త్యై 70

" ప్రియాయై

" నిత్యాయై

" నందిన్యై

" సత్యరూపిణ్యై

" సత్యప్రియాయై

| | | |
|---|---|---|
| ఓం | హిరణ్యాక్షాన్తకారిణ్యై | నమః |
| ” | జీవవ్రాతసదాధారాయై | |
| ” | మహాలక్ష్మీప్రియాయై | |
| ” | వరప్రసాదిన్యై | |
| ” | రమ్యాయై | 80 |
| ” | విపులాయై | |
| ” | పరమోదిన్యై | |
| ” | వరరూపాయై | |
| ” | పుణ్యాంగాయై | |
| ” | పుణ్యవత్యై | |
| ” | అబ్ధిమేఖలాయై | |
| ” | ఇష్టపదాయై | |
| ” | యజ్ఞాంగ్యై | |
| ” | ప్రకృత్యై | |
| ” | ఇష్టసాధిన్యై | 90 |
| ” | ఆత్మంభరాయై | |
| ” | సర్వంసహాయై | |
| ” | నిర్నిద్రాయై | |
| ” | నిష్కృత్యై | |
| ” | స్థిత్యై | |
| ” | స్వాహాయై | |
| ” | స్వధాయై | |
| ” | యజ్ఞయజ్ఞాయై | |
| ” | బృహత్యై | |
| ” | ఓంకారరూపిణ్యై | 100 |
| ” | స్వాహాకారాయై | |
| ” | స్వధాకారాయై | |

,, వేదవిద్యాయై
,, సురూపిణ్యై
,, మహాదేవ్యై
,, మహామాన్యాయై
,, సర్వసిద్ధ్యై
,, ధనుర్ధరాయై 108

అష్టోత్తరశతనామావళి

సమాప్తము

సంకలనకర్తలకు కృతజ్ఞలతో
"శ్రీదత్తాత్రేయస్తోత్రకదంబ"
గ్రంథమునుండి ఉద్ధృతము

---

# మంగళం

మంగళం కమలాకాంతే,
మంగళం కరుణానిధే.
మంగళం లోకజనని,
మంగళం భక్తవత్సల.

మంగళం మంగళావాసే,
మంగళం మంగళాలయ.
మంగళం శ్రీమహాలక్ష్మి,
శ్రీనారాయణ! మంగళమ్.

శుభం భూయాత్
సమస్త సన్మంగళాని భవన్తు

# గరుడ ద్వాదశనామాని

సుపర్ణం వైనతేయం చ నాగారిం నాగభూషణమ్,
విషాంతకం జితామిత్రం అజితం విశ్వతోముఖమ్.

గరుత్మంతం ఖగపతిం తార్క్ష్యం కశ్యపనందనమ్,
ఏతత్ద్వాదశనామాని గరుడస్య మహాత్మనః.

ప్రభాతే స స్మరేత్ యో వై స్నాతో వా యది మానవః,
విషం నాశయతే తస్య న హింసన్తి చ పన్నగాః.

# ఆంజనేయ ద్వాదశనామాని

హనూమానంజనాసూనుః వాయుపుత్రో మహాబలః,
రామేష్టః ఫల్గునసఖః పింగాక్షోఽమితవిక్రమః.

ఉదధిక్రమణశ్చైవ సీతాశోకవినాశకః,
లక్ష్మణప్రాణదాతా చ దశగ్రీవస్య దర్పహా.

ద్వాదశైతాని నామాని కపీంద్రస్య మహాత్మనః,
స్వాపకాలే పఠే నిత్యం యాత్రాకాలే విశేషతః.

తస్య మృత్యుభయం నాస్తి సర్వత్ర విజయీ భవేత్.

ఆపదామపహర్తారం దాతారం సర్వసంపదామ్,
లోకాభిరామం శ్రీరామం భూయో భూయో నమామ్యహమ్.

శ్రీరామరక్ష - సర్వజగద్రక్ష.

కాయేన వాచా మనసేంద్రియైర్వా
బుద్ధ్యాత్మనా వా ప్రకృతేః స్వభావాత్,
కరోమి యద్యత్ సకలం పరస్మై
నారాయణాయేతి సమర్పయామి,

స్వస్తి ప్రజాభ్యః పరిపాలయన్తాం
న్యాయ్యేన మార్గేణ మహీం మహీశాః,
గో బ్రాహ్మణేభ్యః శుభమస్తు నిత్యం
లోకాస్సమస్తాః సుఖినో భవన్తు

# లభ్యపుస్తకసూచి

| దివ్యప్రబంధ వ్యాఖ్యలు | రూ. పై. |
|---|---|
| పెరుమాళ్ తిరుమొళి | 15-00 |
| దివ్యప్రబంధత్రయి | 10-00 |
| (తిరుమాల-అమలనాదిపిరాన్ కణ్ణినుణ్ శిరుత్తాంబు) | |
| ఉపదేశరత్నమాల | 10-00 |
| తిరువాశిరియము- పెరియ తిరువందాది | 12-00 |
| తిరువాయ్ మొళి 2, 5, 6, 7, 8, 9 పత్తులు 12X6 = | 72-00 |
| పెరియాళ్వార్ తిరుమొళి 1వ పత్తు | 18-00 |
| పెరియాళ్వార్ తిరుమొళి 2వ పత్తు | 18-00 |
| పెరియాళ్వార్ తిరుమొళి 3వ పత్తు | 18-00 |

## ఇతరములు

| | |
|---|---|
| శ్రీగోదాస్తవము వ్యాఖ్యతో | 20-00 |
| భగవద్గీతామృతము వ్యాఖ్యతో (1వ భాగము) | 20-00 |
| భగవద్గీతామృతము వ్యాఖ్యతో (2వ భాగము) | 20-00 |
| గద్యత్రయ వ్యాఖ్య | 15-00 |
| రామాయణ తనిశ్లోకి (2వ భాగము) | 12-00 |
| నా జీవిత సాహిత్యం (1వ భాగము) | 20-00 |
| నా జీవిత సాహిత్యం (2వ భాగము) | 25-00 |
| దివ్యసూరి కథాసారము | 15-00 |
| రామానుజ కథాసారము | 12-00 |

1) ముందుగా 200/- రూ.లు పంపినవారికి పైవన్నియు ఉచితము.

2) ఖర్చులు చాల పెరిగినందున సంవత్సర చందా రు. 30/-చేసినాము.

3) వి. పి. పోష్టు ఖర్చులు అదనము.

## గ్రంథమాలకు ఘనసహకారము నందించిన

## ఈ భాగవత కులశేఖరులకు మా మంగళాశాసనములు

| | |
|---|---|
| శ్రీ చరణరేణువు | 500.00 |
| శ్రీమాన్ యస్.సి రామానుజాచార్యులవారు ఖమ్మం | 500-00 |
| శ్రీమాన్ యమ్ వి.రాఘవాచార్యులుగారు హైదరాబాదు | 202-00 |
| శ్రీమతి బి. ప్రేమలతగారు హైదరాబాదు | 200-00 |
| ,, కె. అన్నపూర్ణగారు ఏలూరు | 200-00 |
| శ్రీమాన్ టి కె వి.అయ్యంగారు హన్మకొండ | 150.00 |
| శ్రీమతి రావు లక్ష్మీదేవిగారు చీరాల | 130-00 |
| డా॥ మోపిదేవి కృష్ణస్వామిగారు విజయవాడ | 121-00 |
| శ్రీమాన్ తిరుమల శేషాచార్యులుగారు హైదరాబాద్ | 116-00 |
| ,, జి. ఎ వి యస్ అప్పలాచార్యులుగారు ద్వారకా తిరుమల | 116-00 |
| ,, యన్.వి.యల్.యన్.రామానుజాచార్యులుగారు పెంటపాడు | 116-00 |
| ,, సౌమిత్రి మాధవాచార్యులుగారు మణుగూరు | 116-00 |
| ,, కలవపూడి వెంకటాచార్యులుగారు తాడేపల్లిగూడెం | 116-00 |
| ,, కె నరసింహంగారు కారైకుడి | 116-00 |
| ,, శేషం శ్రీనివాసాచార్యులుగారు హన్మకొండ | 116-00 |
| ,, కందాళయతి రాజవల్లి తాయారమ్మగారు కొవ్వూరు | 116-00 |
| శ్రీ లాల్‌బహదూర్‌శాస్త్రి ఓరియంటల్ డిగ్రీకళాశాల (చినసింద్రకొలను) సిబ్బంది. | 116-00 |

| | |
|---|---|
| శ్రీమాన్ రాఘవస్వామి చి.సౌ. సుధావల్లి గారలు హైదరాబాదు | 116.00 |
| శ్రీమాన్ కొండకింది రంగాచార్యులుగారు కల్లూరు | 101 |
| ,, యన్ లక్ష్మణమూర్తిగారు వరంగల్ | 100 |
| శ్రీ చిట్టూరి వెంకట సత్యనారాయణగారు కూచిపూడి (కృష్ణా) | 100 |
| శ్రీమాన్ టి. విజయరాఘవాచార్యులుగారు తిరుపతి | 100 |
| ,, న. తి. అళహసింగరాచార్యులుగారు విజయవాడ | 100 |
| ,, చి. సత్యలక్ష్మణాచార్యులుగారు గుంటూరు | 100 |
| ,, టి. నారాయణయ్యగారు పామూరు | 100 |
| ,, వి. వి. అయ్యంగార్ సికిందరాబాదు | 100 |
| శ్రీ పెనల సూర్యచంద్రరావుగారు తాడేపల్లిగూడెం | 100 |
| చి. యతిరాజ సంపత్కుమార్ హైదరాబాదు | 100 |
| శ్రీమాన్ అగ్నిహోత్రం శ్రీనివాసాచార్యులుగారు ద్వారకాతిరుమల | 100 |
| ,, కె. యస్ రామానుజాచార్యులవారి తిరునక్షత్రోత్సవ సందర్భమున | 100 |
| ,, కె టి రామానుజాచార్యులుగారు నెల్లూరు | 100 |
| ,, జి. వి రాఘవాచార్యులుగారు మంగళగిరి | 100 |
| ,, జి ఆంజనేయాచార్యులుగారు మంగళగిరి | 75 |
| శ్రీమతి తెన్నేటి సుధగారు హైదరాబాదు | 70 |
| శ్రీ యన్. కేశవరామయ్యగారు హైదరాబాదు | 60 |
| శ్రీమాన్ కె. వి. రాఘవాచార్యులుగారు హైదరాబాదు | 58 |
| ,, కె. ఎల్. నరసింహంగారు ఏలూరు | 50 |
| మెట్రో హోమియోహాల్ ఏలూరు | 50 |
| శ్రీ మడుపు ప్రభాకరరావుగారు హైదరాబాద్ | 50 |
| ,, జి. జ్ఞానప్రసాద్‌గారు హైదరాబాదు | 50 |

| | |
|---|---|
| శ్రీ కె యస్ ఆర్. ఎ శర్మగారు హైదరాబాదు | 50 |
| శ్రీమాన్ వంగల లక్ష్మీనరసింహాచార్యులుగారు హైదరాబాదు | 50 |
| శ్రీమాన్ నల్లాన్ చక్రవర్తుల కృష్ణమాచార్యులుగారు విజయవాడ | 50 |
| ,, పరాశరం మారుతీ ప్రసాద్‌గారు ఖమ్మం | 50 |
| ,, యస్. టి. పి. వి రామానుజాచార్యులుగారు నల్గొండ | 50 |
| ,, మోటుపల్లి వరాహస్వామిగారు హన్మకొండ | 50 |
| ,, కె. వేంకటాచార్యులుగారు ,, | 50 |
| ,, యస్. పురుషోత్తమాచార్యులుగారు ,, | 40 |
| శ్రీ ధన్యంరాజు శంకర్‌గారు హైదరాబాదు | 40 |
| ,, అత్తిలి వేంకట రమణగారు నూజివీడు | 35 |
| ,, మైలవరపు సూర్యనారాయణమూర్తిగారు కృష్ణంపాలెం | 35 |
| శ్రీమాన్ కె. వి. ముకుందాచార్యులుగారు విశాఖపట్నం | 35 |
| ,, టి. పి. యస్. ఆచార్యులుగారు విశాఖపట్నం | 35 |
| శ్రీ యస్. హరిగోపాల్ గారు ,, | 35 |
| ,, యమ్. వి. యస్. వి. ప్రసాదరావుగారు విశాఖపట్నం | 35 |
| శ్రీమతి సుంకర యశోదమ్మగారు గండికుంట | 30 |
| ,, పి. జయశ్రీగారు బందరు | 30 |
| డా. బి. వి. రంగాచార్యులుగారు బందరు | 30 |
| శ్రీమాన్ యస్. టి. పి. శ్రీనివాసాచార్యులుగారు ఏలూరు | 30 |
| శ్రీమతి న. చ. నప్పిన్న పిరాట్టిగారు ,, | 30 |
| శ్రీమతి గుడివాడ రామరత్నంగారు ,, | 30 |
| శ్రీ గాదేపల్లి దక్షిణామూర్తి శాస్త్రిగారు నూజివీడు | 30 |
| ,, పడాల సూర్యనారాయణగారు ,, | 30 |

| | | |
|---|---|---|
| డా. టి మధుసూదనరావుగారు | నూజివీడు | 30 |
| కుమారి దివ్య | బందరు | 30 |
| శ్రీమతి అంగలూరి వెంకట సీతమ్మగారు | రాజమండ్రి | 30 |
| శ్రీమాన్ యస్. సి. యన్. వి. ఆచార్యులుగారు | బందరు | 32 |
| శ్రీ చిట్టూరి కోటేశ్వరరావుగారు | విజయవాడ | 30 |
| శ్రీ తిరుంగరి శ్రీనివాస్ గారు | జోగిపేట | 30 |
| శ్రీమతి అంగలూరి రంగనాయకమ్మగారు | మంగళగిరి | 30 |
| శ్రీమతి టి. శాంతకుమారిగారు | గన్నవరం కృష్ణా | 30 |
| శ్రీమాన్ కందాడై వేంకటాచార్యులుగారు | విజయరాయి | 30 |
| కీ. శే. శ్రీమతి వై. భాషామణిగారు | పొల్లిపాలెం | 30 |
| శ్రీమాన్ పరాశరం గోపాలకృష్ణమూర్తిగారు | గుంటూరు | 30 |
| ,, కొంటూరి రామానుజయ్యగారు | దంపూరు | 30 |
| డా॥ ప్రేమానందకుమార్ | శ్రీరంగం | 30 |
| శ్రీ యన్. వేంకట రమణయ్యగారు | సికిందరాబాదు | 30 |
| శ్రీమాన్ మరింగంటి భట్టర్ కుమార్ గారు | తుని | 30 |
| శ్రీ మాదాడి ప్రభాకర్ రెడ్డిగారు | హన్మకొండ | 30 |
| శ్రీమతి సుశీలగారు | ,, | 30 |
| శ్రీ కె. రాంబాబుగారు | హైదరాబాదు | 30 |
| ,, జి వి. సుబ్రహ్మణ్యంగారు | ,, | 30 |
| ,, జి వి. లక్ష్మణరావుగారు | ,, | 30 |

| | | |
|---|---|---|
| శ్రీ పుల్లెల శ్రీరామచంద్రుడుగారు | ,, | ౮౦ |
| ,, కాశూరి హనుమంతరావుగారు | ,, | ౩౦ |
| శ్రీమాన్ శేషశతం వేదాంతాచార్యులుగారు | ,, | ౮౦ |
| ,, బి. కె. వి. యల్. రామానుజాచార్యులుగారు | హైదరాబాదు | ౩౦ |
| ,, వై. వి. రామానుజస్వామిగారు | ,, | ౪౦ |
| ,, రామానుజాచార్యులుగారు | ,, | ౫౦ |
| ,, జి. కస్తూరిరంగాచార్యులుగారు | ,, | ౬౦ |
| శ్రీమతి పి. ఆండాళ్ | ,, | ౮౦ |
| శ్రీమతి కె. రాజ్యలక్ష్మి | ,, | ౮౦ |

